# చైతన్య రామాయణము

# చైతన్య రామాయణము



జ్ఞానబ్రహ్మ

స్వామి సుందర చైతన్యానంద

# చైతన్య రామాయణము (ప్రథమభాగము)

స్వామి సుందర చైతన్యానంద

ప్రథమ కెరటం :
జనవరి 1995 - 15,000 ప్రతులు

(సర్వస్వామ్యములు రచయితవి)

ప్రతులకు :
సుందరచైతన్యఆశ్రమం
ధవళేశ్వరం - 533 125
☎ 77378

ముద్రణ :
శ్రీ లక్ష్మీ గణపతి బైండింగ్ వర్క్స్
కొవ్వూరు - 534 350 ☎ 575



భగవాన్ మురళీకృష్ణ
సుందర చైతన్యాశ్రమం

మేము చేస్తున్న భక్తి ప్రచారం ఈ **web sights** ద్వారా చేస్తున్నాము
**www.telugudevotionalswaranjali.blogspot.in**
**www.gitamakarandam.blogspot.in**
**www.sundaravignanagrandalayam.blogspot.in**
**www.hindudevotionalswaranjali.blogspot.in**
**OUR VIDEO CHANNELS:**
**www.youtube.com/user/hindudevotionalo**
**www.youtube.com/user/Shruthimandiramu**
**www.youtube.com/user/devotionalswaranjali**
**PDF BOOKS CHANNEL: www.scribd.com/ysreddy94hyd**
**E mail ID: ysreddy94hyd@gmail.com**
**FACEBOOK: YEDAVALLI SUDARSHAN REDDY**
**pl forward the above links to your friends&relatives**
**our mediafire folderlinks**
**www.mediafire.com/?86epi81waeayl**
**www.mediafire.com/?790osuod857zc**
**www.mediafire.com/?45h5fdfw4igzi**
**www.mediafire.com/?606gdhk35zvbc**
**www.mediafire.com/?ot92fowb91g18**
**www.mediafire.com/?xw75pfuld2dyy**



# ప్రభాతం



ముందున్న మోము తెల్లన
వెనుకున్న కురులు నల్లన

చందురుని వంటి అందమైన ముఖాన్ని ముందు ఉంచి, చీకటి వంటి నల్లని కురుల్ని వెనుక ఉంచడంలో అంతర్య మేమిటో?

ముందున్న అందాన్ని చూసి మురిసిపోకు. వెన్నంటి వచ్చే వెతల్ని చూచి నడువు అని తెలుపుటకా? లేక, సుఖం వెనుకే దుఃఖం దాగి ఉంది అని చెప్పుటకా? ఏది అయినా,

ఇది గాలిబ్రతుకు. క్షణక్షణానికి పడమటవైపు వాలిపోతున్న బ్రతుకు. రాలిపోతున్న బ్రతుకు.కాలంలో కాలిపోతున్న బ్రతుకు.

గాలి ఉన్నంతవరకే మేడలు, మేడమూ...... ఆ తరువాత, అవన్నీ గాలితోపాటు కూలిపోయే మేడలే. గాలిమేడలే.

వార్పు దొరకని జీవికి ఓదార్పే చల్లని కూర్పు. బాధల సుడిగుండంలో బోధలే రక్షకులు. మంచి మాటలే మార్గగాములు.

జీవితం చదరంగమే కాదు. రణరంగము కూడా. చేదు అనుభవాలు చుట్టుముట్టి బాధిస్తున్నా, చిత్తపరిపాకం చెదరకుండా సాగిపోవడం నేర్చుకోవాలి. ఆ నేర్పు కావాలి. జీవికి ఆ నేర్పు రావాలి.

ప్రాణ సమానంగా ప్రేమించినా, అవగాహన లేనివారు మనల్ని విడిచి వెళ్ళినపుడు చిత్తక్షోభ కలుగుతుంది కదూ? అట్టి సమయాలలో,

**"చలా హి ప్రాణినాం మతిః"**

"జీవుల మనసులు చంచలమైనవి" అనే మాట ఎంత ఓదార్పు నిస్తుంది!
కళ్ళముందే కన్పిస్తున్న సుఖం క్షణంలో అదృశ్యమైనపుడు,

**"దుర్లభం హి సదా సుఖమ్"**

"సుఖమనేది ఎల్లప్పుడూ ఉండదు కదా!" అనే మాట ఎంత ధైర్యాన్నిస్తుంది!
ఆత్మీయుడైన నవయువకుడు ప్రమాదంలో గతించినపుడు,

**"ధృవం హ్యకాలే మరణం న విద్యతే"**

"కాలం తీరనిదే చావు రాదు" అనే పలుకు ఎంత ఊరట నిస్తుంది!

మంచికి పోయి వంచనకు గురియైనపుడు,

"మృదుర్హి పరిభూయతే"

"మెత్తని వానిని అందరూ మొత్తుతారు" అనేది ఎంత హాయినిస్తుంది!

యజమానితో పాటు యజమాని కుమారుడు కూడా బాధపెట్టినపుడు, లేదా తండ్రివలె దారితప్పిన తనయుని చూసినపుడు,

"న హి నిమ్బాత్ స్రవేత్ క్షౌద్రమ్"

"వేపచెట్టు నుండి తేనె కారుతుందా?" అనే వాక్యం ఎంత సమంజసం!

మరణశయ్యపై కొట్టుమిట్టాడుతున్న వ్యక్తిని చూస్తూ అందరూ నిస్సహాయులై నిలబడి యున్న వేళ

"ఛిద్యమాన మివాశక్త స్త్రాతు మన్యో నగో నగమ్"

"ఒక వృక్షాన్ని ఖండిస్తూ ఉంటే ప్రక్కనున్న వృక్షం ఏమి చేయగలదు?" అనే ఆలోచన మనసును ఎంతగా బుజ్జగిస్తుంది!

ఇవి ఎలా ఉన్నాయి? ఇలాంటివి ఎన్నో ఉన్నాయి. ఇవి వాక్యాలు కావు. జీవితారణ్యంలో దారి తెలియక పరిభ్రమించే బాటసారులకు కరదీపికలు. ఆశాజ్యోతులు. ఇంతకీ, ఈ విజ్ఞాన వెలుగులు ఎక్కడివి?

ఇవి రామాయణ రత్నదీపం నుండి విరజిమ్మబడే జ్ఞానజ్యోతులు.

చేదు పూల నుండి తియ్యని తేనెను జుర్రుకొనే తేనెటీగల తెలివిని ఎంతని శ్లాఘించాలి?

ఇది స్తుతించడానికి కాదు. జీవించి సుఖించడానికి.

కష్టాల బావినుండి సుఖాలనే జలాలను చేదుకోవాలి. అది ఎలా సాధ్యమో తెలిపే గ్రంథమే రామాయణం.

ఇది కాలపరీక్షకు తట్టుకున్న గ్రంథము.

అన్నీ చదివి వెలితి పొందినవారు రామాయణాన్ని చదివి వెలుగును దర్శిస్తారు.

అన్ని కాలాల్లో, అందరినీ సంతృప్తిపరచే ఉదాత్తమైన గ్రంథం. అభ్యుదయానికి, ఆదర్శానికి నిదర్శనమే రామాయణ కావ్యం.

భారతజాతిని ధర్మజాగరణలో నిలిపిన గ్రంథం.

భారతీయ సంస్కృతీ వైభవమును అంబారీ నెక్కించి విశ్వమంతా ఊరేగించిన గ్రంథం.

చివర ఎక్కడో తెలియని చరిత్ర

కడ ఎక్కడో కనిపించని కథ

ఇది ఆరు కాండల కావ్యం. ఇరవైనాలుగువేల శ్లోకాల గ్రంథం.

రసభరితమైన రఘునాథుని రమణీయ చరితము.

వాల్మీకి వాక్సుధ. రసోద్వేగము గల రచన.



ఆలోచనామృతమైన సాహిత్యం, ఆపాత మధురమైన కవిత్వం గోదావరి వరదలా ప్రవహించింది ఈ కావ్యంలో.

హిమవన్నగము వలె ఉన్నతమైన ఊహలు

సముద్రలోతు వలె అగాధమైన భావాలు

అదొక కమనీయ రచన. వాల్మీకి ముఖ వినిస్సృతమైన రచన. కాదు. అర్చన. కవితార్చన. కవికోకిల పరవశించి, ఆరాధించిన దివ్యార్చన. దేవతార్చన.

బిడ్డను ఒడిలో కూర్చోబెట్టుకొని తల్లి కథ చెప్పిన ట్లుంటుంది, ఒకచోట.

గురువు తరగతిలో పాఠం చెప్పినట్లు ఉంటుంది, మరొకచోట.

న్యాయవాది న్యాయస్థానం ముందు అమోఘంగా వాదించిన ట్లుంటుంది, ఇంకొకచోట.

వైద్యుడు వ్యాధిని, చికిత్సను వివరించి చెప్పిన ట్లుంటుంది, వేరొకచోట.

ఇది ఆదికావ్యం. ప్రజాదరణ కావ్యము.

వ్యక్తిధర్మము

కుటుంబధర్మము

సంఘధర్మము ఈ ధర్మత్రయాన్ని వంటబట్టించే త్రివేణీ సంగమమే రామకథ. అభ్యుదయానికి, ఆదర్శానికి నిదర్శనమే రామకథ. సీతారామకథ.

భారతం జరిగి ఐదువేల సంవత్సరాలైంది.

భారత కథకు ముందు యుగంలో రామాయణం జరిగింది.

ఇన్నివేల సంవత్సరాలుగా ఒక కథ లేదా కావ్యము ప్రజల్ని ప్రభావితం చేస్తూ వస్తున్నదంటే, మారే దేశకాలపరిస్థితులకు ఆ రచన ఎంత అనుగుణంగా ఉందో ఆలోచించండి.

రామాయణం అందరికీ కావాలి అద్దంలాగా. ఎందుకో తెలుసా? అందులో అందరి పాత్రలూ ఉన్నాయి. రామాయణాన్ని చదివేవారంతా అందులో తమ చోటెక్కడో అన్వేషించి పట్టుకుంటారు. గుట్టుచప్పుడు కాకుండా మనసులో ఓ మూల దాచేసుకుంటారు.

రామాయణాన్ని జిజ్ఞాసువులు తరచి తరచి చూస్తారు. ఎందుకు చదవాలి? అని అజ్ఞాని ప్రశ్నిస్తాడు. ఇంకా తెలుసుకోవాలి అని జ్ఞానులంటారు. ఎంతకూ అంతుపట్టదు అని పరిశోధకు లంటారు.

వాలిని వెనుకనుండి చంపడం అధర్మం కాదా?

దశరథునితో అబద్ధం చెప్పమని రాముడు సుమంత్రునికి చెప్పలేదా?

నిండు చూలాలైన సీతమ్మను అడవుల పాల్జేయడం న్యాయమా?

ఇలాంటి ప్రశ్నలెన్నో?

ఇవన్నీ విమర్శలు కావు. పరామర్శలు.

రామునిలో ఒక్క తప్పును కూడా చూసి సహించలేని అంతర్మథనమే ఈ ప్రశ్నల వెనుక నిలిచియున్న వాస్తవం.

రాముడు అధర్మపరుడు కాడు-అది ఎలాగో తెలుసుకోవాలనే తపన.

నిజానికి, అదొక తరహా ఇంటరాగేషన్.

దారి తప్పిన నడకే గాని గమ్యాన్ని నిరసించే బాట కాదు. మాట లేదు.

ఒకవ్యక్తి రామాలయంలో నిత్యమూ జరిగే రామాయణ ప్రవచనం వింటుండేవాడు. ఒకరోజు తన కుమారుడు కూడా తండ్రితో కలసి శ్రవణానికి బయలుదేరాడు. వద్దని తండ్రి కుమారుని వారించాడు.

ఎందుకో తెలుసా? తన వృత్తి చోరవృత్తి. రామాయణం విని తన కుమారుడు ధర్మజీవనాన్ని ఎంచుకుంటాడేమో! చోరవృత్తిని త్యజిస్తాడేమో? అనే భయం.

మరి, రోజూ తానెందుకు వింటున్నట్లు? రామాయణాన్ని శ్రవణం చేసి తాను మారనవుడు కొడుకు మాత్రం ఎందుకు మారుతాడు? దీనిని మనస్తత్వశాస్త్ర దృక్కోణం నుండి పరిశీలించాలి.

తాను వింటున్నాడు. అయినా మారలేదు.కానీ మారమని అంతర్యము ఘోషిస్తూ ఉంది. నేటివరకు ఎలాగో తట్టుకున్నాడు. ఇలా తట్టుకొని నిలిచే కాఠిన్యం తన కుమారునికి ఉంటుందో, లేదో అనేదే సందేహం. అందుకే రామాయణాన్ని శ్రవణం చేయవద్దని చెప్తాడు కుమారునితో.

రామాయణం ప్రభావం అలాంటిది.

ఒక్కసారి వింటే చాలు. వంటబట్టే వరకు వ్యక్తిని విడవకుండా వెంటనడిచే కావ్యం అది.

ఒక సన్నివేశాన్ని చదవడం పూర్తికాగానే ఇంకా ఉంటే బావుండేది అనిపిస్తుంది.

ఎప్పట్నుంచో చదువుతున్నా అప్పుడే అయిపోయిందా? అనిపిస్తుంది.

అదొక నిత్యదాహం. తీరని ఆశ. తనివి తీరని పిపాస.

వాల్మీకిమహర్షి మనసుతో మాట్లాడడు. హృదయంతో భాషిస్తాడు.

బరువైన తేలిక పదాలతో హృదయాల్ని కుదిపేస్తాడు.

వేదం సనాతన మైతే, సనాతనధర్మ ప్రదర్శనమే రామాయణం.

దివినుండి భువికి దిగిన నాదాత్మకమైన వేదమే రామాయణం.

**వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే**
**వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా!**

"వేదవేద్యుడగు పరమాత్మ దశరథుని కుమారుడైన శ్రీరాముడుగా జన్మించగా, వేదము ప్రాచేతసుడగు వాల్మీకి వలన రామాయణంగా ఆవిర్భవించింది."



ఈవిధంగా చూస్తే రామాయణం దేవుడైన నారాయణుని కథ అవుతుంది. కానీ, రాముణ్ణి దేవుడుగా వాల్మీకి చిత్రించలేదు. మానవునిగానే చిత్రించాడు.

వాల్మీకి రామునిలో మనకు మానవుడు గోచరిస్తాడు.

మానవునిలో రాముని నిలపాలంటుంది రామాయణము. అంతే.

**ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజే**

తాను మానవుడని, దశరథుని కుమారుడని రాముడు యుద్ధకాండలో చెప్పుకున్నాడు.

మానవుడై జన్మించి, కష్టాల్లో కూరుకుపోయినా మార్గాన్ని వీడకుండా ధర్మ జీవనాన్ని గడిపి, మానవులందరికీ ఆదర్శప్రాయు డయ్యాడు శ్రీరాముడు.

పూర్ణపురుషుడుగా రాముడు జన్మించలేదు. జీవితంలో మహోన్నత విలువలతో జీవించి పూర్ణపురుషు డయ్యాడు. ఇలా చూసినపుడే రాముడు ఆదర్శానికి నిదర్శనంగా భాసిస్తాడు.

**Human I am, human let me remain**

"నేను మానవుణ్ణి. నన్నలాగే బ్రతకనివ్వండి" అని అరవిందయోగి సావిత్రిలో పలికించిన మాటలే ఇక్కడ రాముని నుండి వినిపిస్తున్నాయి.

రాముడు మానవమాత్రుడుగా గోచరిస్తాడు. సామాన్యునిలా కనిపిస్తాడు. మనలాగే ఉంటాడు. కానీ మనం ఆయన లాగా ఉండలేము.

నీలాగా నాలాగా రాముడు శోభిస్తాడు. రామునిలా మనం శోభించ గలిగితే జీవితం ధన్యమవుతుంది. ఆ పని చేసేందుకే రామాయణం ఆవిర్భవించింది.

**ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్**
**యః పఠే ద్రామ చరితం సర్వపాపైః ప్రముచ్యతే**

"రామకథ పవిత్రమైనది. పాపములను హరిస్తుంది. పుణ్యప్రద మైనది. వేదములతో సమానమైనది. రామకథను పఠించువాడు సర్వపాపాల నుండి విముక్తుడవుతున్నాడు;" అని రామాయణ పఠనము యొక్క ఫలాన్ని వాల్మీకి శ్రీమద్రామాయణం బాలకాండములో తెలుపుతాడు.

కనుక ఇది పుణ్యకథ. పుణ్యనది లాంటిది. పావనగంగ వంటిది.

**వాల్మీకి గిరి సంభూతా రామాంభోనిధి సంగతా**
**శ్రీమద్రామాయణీ గంగా పునాతి భువనత్రయమ్**

"శ్రీమద్రామాయణము గంగానది వంటిది. వాల్మీకి యనే హిమవన్నగము నుండి ఆవిర్భవించింది. గంగానది సాగరములో సంగమించునట్లు, రామాయణ మహానది రామసాగరంలో సంగమిస్తున్నది. ఈ రామాయణ గంగ ముల్లోకములను పవిత్రం చేస్తూ ఉంది".

ఇంతకీ ఈ పుణ్యకథ ఎవరిది?

రామునిదా? సీతమ్మదా? రావణునిదా?

కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్
పౌలస్త్యవధ మిత్యేవ చకార చరితవ్రతః

నిత్యవ్రతుడైన వాల్మీకిమహర్షి ఈ కావ్యమును "రామాయణము", "సీతాచరితము" "పౌలస్త్యవధము" అను పేర్లతో రచించినట్లు శ్రీమద్రామాయణము బాలకాండము లోని నాల్గవ సర్గయందు స్పష్టం చేయబడింది.

ఈ కావ్యానికి మూడు పేర్లు.

1. రామాయణము 2. సీతాచరితము 3. పౌలస్త్యవధ

1. రామకథ:-

**రామస్య అయనమ్ రామాయణమ్** - రాముని పొందేలా చేయునది రామాయణము. ఇది బాహ్యానికి రామకథ. అంతర్యానికి పరమాత్మకథ.

2. సీతకథ:-

**రామాయాః అయనమ్ రామాయణమ్** - రామా అనగా స్త్రీ, అంటే సీత. ఆమెయొక్క కథ రామాయణము అని అర్థము. ఇది బాహ్యానికి సీతకథ. అంతర్యానికి జీవాత్మగాథ. 'రమ్' ధాతువు పుంలింగ మైనపుడు రామ+అయనం=రామాయణమై రామకథ అవుతుంది. అలాగాక స్త్రీలింగ మైనపుడు రామా+అయనం=రామాయణమై సీతకథ అవుతుంది.

3. రావణవధ:-

"పౌలస్త్యవధ" అని పిలుచుటచేత రామాయణము రావణ సంహారమే అని తెలియుచున్నది. ఇది బాహ్యానికి రావణవధ.అంతర్యానికి అజ్ఞాన నాశము.

రావణుని పాత్రను ప్రక్కకు నెట్టి రాముని ఊహించుట సాధ్యపడదు.

రామరావణ పాత్రలు ధర్మాధర్మ స్వరూపాలు.

రామునికి ధర్మమే ప్రాణం. రావణునికి అధర్మమే ఊపిరి.

రామునిది సత్యమార్గం. రావణునిది అసత్యమార్గం.

సత్యధర్మాలు జీవితానికి శోభనిస్తాయి అంటుంది రాముని పాత్ర.

అసత్య అధర్మాలు జీవితానికి క్షోభను కల్పిస్తాయి అని తెలిపేందుకు రావణుని పాత్ర.

రాముడు బాగా చదువుకున్నవాడు. రావణుడు అంతకు తక్కువేమీ కాదు.

చదివింది రామునికి వంటబట్టింది. రావణునికి అజీర్ణం చేసింది.

రాముడు సూర్యోదయమైతే, రావణుడు అస్తమయం వంటివాడు.

ధర్మం కొరకు భార్యనే పరిత్యజించాడు రాముడు.

అధర్మంతో పరుల భార్యలను అపహరించాడు రావణుడు.

అది రాముని విజ్ఞత. ఇది రావణుని అజ్ఞత.



ఎన్ని కట్టెలు వడేసినా 'చాలు' అనదు నిప్పు.

ఎన్ని నదులొచ్చి పడినా 'వద్దు' అనదు సముద్రం.

ఎంత నీరు పోసినా నిలుపుకోదు జల్లెడ.

కామము చిల్లుల జల్లెడయే. దీనికి చెల్లు రాయలేని వాడే రావణుడు.

రావణుడు గొప్పవాడే. కానీ మంచివాడు కాడు. మంచి లేని మహిమకు మరణమే శరణ్యము.

**He is not great, who is not greatly good**

"గొప్పదైన మంచితనం లేనివాడు ఎన్నడూ గొప్పవాడు కాలేడు" అంటాడు షేక్స్పియర్.

స్త్రీలోలత్వం చంపుకోలేక బిడ్డల్ని చంపుకున్నాడు. బంధువుల్ని చంపుకున్నాడు. తమ్ముళ్ళను చంపుకున్నాడు. లంకానగరాన్నే శ్మశానంగా మార్చేశాడు.

చివరికి ఏం మిగిలింది?

తానుకూడా మిగలకుండా పోయాడు. అపఖ్యాతి ఒక్కటే నిలిచిపోయింది.

ఇదే రావణుని పాత్ర.

నాలాగా జీవించి సుఖించండి అని తెలిపేందుకు రాముని పాత్ర.

నాలాగా జీవించి నశించకండి అని తెలిపేందుకు రావణుని పాత్ర.

రామాయణ పుణ్యకథ

1. ధర్మాత్ముడైన రాముని గాథ
2. మహాసాధ్వి యైన సీతమ్మ గాథ
3. మహావీరుడైన రావణుని గాథ

పరమాత్మ అడుగుజాడల్ని పట్టుకొనేందుకు రామకథ. జీవాత్మ తరించేందుకు సీతకథ. అజ్ఞాన నాశమునకు రావణవధ.

నామాలు ఎన్నయినా, ఇవన్నీ మన చిరునామాను తెలునుకొనేందుకే.

ఇలా వాల్మీకి దృష్టి అనేక కోణాల్లో పయనించింది.

రామాయణ శ్రుతిలో వాల్మీకి ఆలపించిన రాగాలు అమోఘాలు.

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్॥

"కవిత్వమనే కొమ్మపై కూర్చుని "రామ-రామ" అని మధురాక్షరములను మధురముగా ఆలపించే వాల్మీకి కోకిలకు నమస్కారము."

వాల్మీకి గొంతులో కోకిల స్వరాలే గాదు. సింహగర్జనలూ ఉన్నాయి.

వాల్మీకీ ర్మునిసింహస్య కవితా వన చారిణః
శ్రుణ్వన్ రామకథా నాదం కో న యాతి పరాంగతిమ్॥

"కవిత్వమనే అరణ్యంలో వాల్మీకి అనే సింహము సంచరిస్తూ ఉంది. ఆ సింహము రామకథను గర్జిస్తూ ఉంది. ఆ నాదాన్ని ఆలకించినవాడు తరించకుండునా?"

వాల్మీకిలో కోకిల సుస్వరం ఉంది. సింహగర్జనమూ ఉంది. కోకిలలా మధురంగా చెప్పడమే గాక, సింహంలా గంభీరంగా చెప్పడం కూడా వాల్మీకికి అలవడింది. శారదకి కల పండింది. మనకు జన్మ తరించింది.

వాల్మీకి కోకిల స్వరములో మధుర రవాలతో పాటు, మధురాక్షరాలు దొర్లుతున్నాయి. అక్షరత్వము సిద్ధించింది.

అక్షరత్వ మున్నందున రామాయణం క్షరం కాలేదు. కాలప్రవాహంలో కరిగిపోలేదు. నిత్యనూతన కళలతో అనుదిన ప్రవర్ధమానంగా శోభిస్తూనే ఉంది.భవిష్యత్తులో ఇంకా శోభిస్తుంది కూడాను.

యావత్ స్థాస్యన్తి గిరయః సరితశ్చ మహీతలే
తావ ద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి

"ఈ భూప్రపంచమున గిరులు, నదులు ఉన్నంత వరకు రామాయణకథ లోకంలో నిలిచి ఉంటుంది" అని శ్రీమద్రామాయణము బాలకాండములో బ్రహ్మదేవుడు కవియైన వాల్మీకితో అంటాడు.

శ్రీమద్రామాయణము ఆపన్న ప్రసన్నుడైన శ్రీరాముని గాథ. కనుక ఇది అక్షరం. అనవద్యం. అమృతం.

రామాయణము అమృతసాగరము. అందుకే దానిలోని భాగాలకు కాండములని పేరు పెట్టాడు వాల్మీకి.

కాండము అనగా జలము అని అర్థము. ప్రతి అమృతబిందువు ప్రాణప్రదమే. రామాయణంలో ప్రతి అక్షరము మోక్షప్రదమే .అక్షయపదమే. అందుచేత రామాయణము సుధాసాగరమైంది.

ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్

ప్రతి అమృతబిందువు ప్రాణప్రద మైనట్లు, రామాయణంలో ప్రతి అక్షరము పాపనాశమేనని వాల్మీకి వాక్సుధ.

రామాయణము సాగరమే కదా! అయితే,

దూరాన నిలిచి చూచేవారికి కవిత్వకెరటాల శబ్దమాధుర్యాలు చెవికి అందుతాయి.

దిగిన వారికి ఒళ్ళు చల్లబడుతుంది. ఉల్లము తేలిక పడుతుంది. కావ్యంలోని అర్థమాధుర్యాలు హృదయాన్ని స్పృశిస్తాయి.

లోతుకెళ్ళిన వారికి ఆణిముత్యాలు లభిస్తాయి. అక్షరసత్యాలు ప్రాప్తిస్తాయి.

కుక్షి శుద్ధిపడి, అక్షి సిద్ధపడి మోక్షము లభిస్తుంది.

ఇదీ వాల్మీకి ప్రవహింప చేసిన రామాయణ మహానది.

రసానంద సాగరాన్ని సదా స్పృశించే సజీవ కావ్య స్రోతస్విని.



మునిజన సంవేద్యంగా, అఖిల భక్తజన హృద్యంగా మనకు ప్రాప్తించిన ఆద్యగ్రంథము. ఆదికవి నుండి వెలుగు చూసిన రామాయణ కల్పవల్లి. కావ్యతల్లి. ఇదియే వాల్మీకి రామాయణం.

మరి అవాల్మీకాల విషయ మేమిటి? అవాల్మీకం అంటె వాల్మీకి రచన గానిది అని అర్థము.

అవాల్మీకాలు పలుపలు విధాలుగా ప్రవహించాయి.

ఏది ఎలా ఉన్నా, వాల్మీకమే ప్రమాణం.

వాల్మీకం ప్రమాణం అనగానే తక్కినవి అప్రమాణం అనే ధ్వని ఉండనే ఉంది. ఏం చేద్దాం? చెప్పండి.

అందరి కన్నూ ఆదికావ్యం పైనే. ఆదికవిని అధిగమించాలనే అత్యాశ లేకున్నా, అనుకరించి ఆనందించాలనే ఉబలాటం తప్పదు కదా! అమృతాన్ని అపహాస్యం చేస్తున్న కావ్యాన్ని ఎవరు కౌగిలించుకోరు?

ఈ ప్రయత్నంలోనే అవాల్మీకాలు కోకొల్లలుగా దొర్లాయి. అనేక భాషలలో రామాయణాలు అసంఖ్యాకంగా అరుదెంచాయి.

అయితే, వీరంతా వాల్మీకి అన్నదే రాశారా? రామాయణంలో ఉన్నదే రాశారా?

అలా జరిగితే అవి అవాల్మీకా లెలా అవుతాయి? అవాల్మీకా లంటేనే జహదజహల్లక్షణాల సంయోజనం. ఉన్నవి కొన్ని తొలగించి ఉంటారు. లేనివి కొన్ని తగిలించీ ఉంటారు. ఈ కూడికల, తీసివేతల పనితనంలోనే అవి వాల్మీకాలు కాకుండా మిగిలాయి. ప్రత్యేక నామాలతో శోభిస్తున్నాయి.

అవే తులసీ రామాయణం, భావార్థ రామాయణం, కంబరామాయణం, అధ్యాత్మ రామాయణం, ఆనంద రామాయణం, రంగనాథ రామాయణం, భాస్కర రామాయణం, మొల్ల రామాయణం, గోపీనాథ రామాయణం, చెంపూ రామాయణం, విచిత్ర రామాయణం, నిర్వచనోత్తర రామాయణము - ఇలా చెప్పుకొంటూ పోవాలంటే ఎన్నని? ఎన్నయితే నేమి? అన్నీ అవాల్మీకాలే.

అయితే, వీటి ప్రభావ ప్రాశస్త్యా లేమిటి? అనేదే మన ముందు నిలిచియున్న ప్రశ్న, లేదా సమస్య.

ఈ ప్రశ్నకు సమాధానం వెదికే ముందు, ఈ సమస్యకు పరిష్కారాన్ని కనిపెట్టే ముందు లేదా కనుగొనే ముందు అసలు వాల్మీకి రామాయణాన్ని ఎందుకు వ్రాశాడు? అనే విషయంపై మన దృష్టి సారించక తప్పదు. వాల్మీకం ఎందుకో తెలిస్తే, అవాల్మీకాలు ఎందుకొచ్చాయో తెలుస్తుంది.

వాల్మీకి రామాయణాన్ని బట్టి వాల్మీకి రామునికి సమకాలికుడు అని తెలుస్తూ ఉంది.రాముని జీవితకాలం లోనే వాల్మీకి రామాయణ రచన చేశాడు. ఇది నిర్వివాదాంశం. ఇకపోతే, ఎందుకు వ్రాయవలసి వచ్చింది? ఈ రచనను ఉపక్రమించడానికి దారి తీసిన పరిస్థితు లేమిటి?

1. తమసానదీ తీరాన బోయవాడు క్రౌంచపక్షిని చంపడం చూసి కరుణామయుడైన కవి హృదయం స్పందించి శోకమయం కావడం.... అది శ్లోకరూపం ధరించడం.

2. ఇదిలా ఉండగా, లోకనిందకు గురియై భర్తకు దూరమై అరణ్యాల పాలైన సీతమ్మ వాల్మీకి ఆశ్రమంలోనే ఉందికదూ?

పక్షికి ప్రాప్తించిన శోకము పడతిని హింసించిన లోకము -

శోకము, లోకము మదిలో మెదిలి **మానిషాద** శ్లోకంగా రూపొందింది.

ఇది ఆశ్చర్యం. పరమాశ్చర్యం. కదూ!

3. "ఆశ్చర్యపడకండి. ఇదంతా నా సంకల్పమే. నా ప్రేరణే. రామకథను రచించు. నారదుడు చెప్పింది నీవు వినియే ఉన్నావు. నా అనుగ్రహంతో వినిపించనిది కూడా నీకు కనిపిస్తుంది" అని బ్రహ్మదేవుడు పలకడం. వాల్మీకి ఆదికావ్యానికి శ్రీకారం చుట్టడం. ఇంతేకదూ!

మహాసాధ్వి యైన సీతమ్మపై నింద వేసిన లోకాన్ని చూసి కలత చెందియున్న దయామయుని హృదయాన్ని పక్షి శోకము కుదిపేసింది.

వ్యాధుడు పక్షిజంటను శాశ్వతంగా వేరు చేశాడు. రావణుడు సీతారాముల్ని తాత్కాలికంగా వేరు చేశాడు. క్రౌంచపక్షులు ఇక కలిసే దుండదు. కానీ సీతారాములు కలిశారు. ఏం లాభం?

లోకం కోడెత్రాచై కాటువేసింది. సీతమ్మను శాశ్వతంగా రామునికి దూరం చేసింది. ఈ దారుణ బాధను కోమలమైన కవిహృదయం భరించలేక పోయింది. లోకం పోకడకు దుఃఖించింది. అంతటితో ఆగలేదు. లోకం కళ్ళు తెరిపించే ప్రయత్నం చేసింది. **సీతాయా శ్చరితం మహత్** సీతమ్మ కరుణామయ గాథను వ్రాసి లోకానికి చాటాలని అభిప్రాయపడ్డాడు ఆదికవి. ఈ అన్యాయం మరొకరికి జరగకూడదని భావించాడు. కన్నీళ్ళను సిరాగా మార్చి కరుణారస భరితమైన రామాయణాన్ని రచించాడు. కుశలవులకు బోధించాడు. నిప్పులాంటి తల్లిపై నిందలు వేసిన, నిందలు మోపిన లోకం సిగ్గుతో తలవంచేలా చిన్నారుల చేతులకు చిఱుతలు తగిలించి కావ్యగానం చేయించాడు.

అది గానం కాదు. యుద్ధభేరీ నినాదం.

అమాయకుల జీవితాలతో ఆట్లాడుకొనే సమాజంపై కలాన్ని కత్తిలాగా ఝులిపించిన సాంస్కృతిక విప్లవం.

ఒకరి పొరపాట్లు మరొకరికి గ్రహపాట్లుగా మారకూడదని,

ఒకరి వికృతపు చేతలు మరొకరికి నొసటి రాతలు కాకూడదని, మ్రోగించిన ఎదురులేని, అదురెరుగని వీర శంఖారావం.

కవితాలక్ష్యం విశ్వకళ్యాణమే కదూ?



కావ్యలక్ష్యం విశ్వశ్రేయమే కదూ?.... అయితే ఆ కార్యం సఫలీకృత మైంది. వాల్మీకికి కార్యసిద్ధి లభించింది.

కాస్త ఆగండి. అవాల్మీకాలను గూర్చి ఇప్పుడు ఆలోచించండి.

ఏ విశ్వశ్రేయాన్ని కాంక్షించి వాల్మీకి ఆదికావ్యం రచించాడో, ఏ మానవ సమాజాన్ని ఉద్ధరించడానికి రామాయణాన్ని అందించాడో, అదే స్ఫూర్తితో అభ్యుదయాన్ని కాంక్షిస్తూ, ఆదర్శాన్ని వాంఛిస్తూ ఎందరో మహాత్ములు తమదైన, అరుదైన బాణీలను సమకూర్చుకొని రామకథను గానం చేశారు.

రూపాలు వేరే గాని, పదార్థం, ప్రయోజనం ఒక్కటే.

జీవనది సాగిపోతుంటే, మధ్యమధ్యన ఉపనదులు వచ్చి కలుస్తాయి.

కాలువలు కలుస్తాయి. వాగులు చేరుతాయి. అన్నీ కలిసి సాగరాన్ని చేరి శాంతిస్తాయి.

వాల్మీకి రామాయణ మహానదిలో అలాగే అవాల్మీకాలు తోడై నడిచాయి.

కాలువల్లాగా కొత్త కథలు కలిశాయి.

వాగుల్లా నూతన వ్యాఖ్యానాలు వరించి వచ్చాయి.

ఇవన్నీ నదిశోభను పెంచాయే గాని తగ్గించలేదు.

పొంగించాయే గాని కృంగదీయ లేదు.

"ఇక్షురసాన్ని ఎగతాళి చేసేలా ఉంది" అని రసాఖాన్ స్తుతించిన "రామచరిత మానసము"ను ఆ కాలంలో తులసీదాస్ వ్రాయకపోయున్నట్లైతే ఈనాడు ఉత్తర భారతదేశము మనకు పరదేశంగా మిగిలి ఉండేది.

బెల్లం చుట్టూ ఈగలు చేరినట్లు

ఆదికావ్యాన్ని ప్రేమతో అందరూ ఆశించారు.

సంస్కారానికి అనుగుణంగా సంతర్పణ చేశారు. సందడి చేశారు.

ఇది శుభపరిణామమే నని నా అభిప్రాయం.

దీని వెనుక అనంతుని అభయహస్తం ఉందనే నా నమ్మకం.

అవాల్మీకాల వల్ల ఆదికావ్యానికి కీడు జరుగలేదు.

నిజం చెప్పాలంటే, ప్రక్షిప్తాల వల్లే ప్రమాదం వాటిల్లింది.

అవాల్మీకాల్ని అందించిన ఎందరో మహాత్ములు తమ హృదయంలోని వెలుగును వెలికితీసే ప్రయత్నం చేశారే గాని, వల్మీకంలో వేలుపెట్టలేదు. వాల్మీకంలో చేయి దూర్చలేదు.

వాళ్ళ పాటేదో వాళ్ళు పాడారు. వారి రాగాన్ని వారు ఆలపించారు. అంతేగాని మరొకరి గానంలో అపశ్రుతిని జోడించే ప్రయత్నం చేయలేదు. కనుక సాగరానికి దూరంగా నిలబడి భక్తితో దణ్ణం పెట్టినట్లు, వాల్మీకానికి వందన మాచరించి తమ కార్యాన్ని తాము నిర్వర్తించుకున్నారు.

ఎటాచ్చి, ప్రక్షిప్తాల ప్రబుద్ధులే వాల్మీకికి నామాలు వేయాలని చూశారు. వ్యాఖ్యలు, సమీక్షలు అంటూ తమ ఛాందసాన్ని, మత మౌఢ్యాన్ని వాల్మీకానికి అంటగట్టే ప్రయత్నం చేశారు.

కానీ, అంతా శ్రీరామరక్ష. అవేమీ అంటుకోలేదు. జ్ఞానాంజనమును ధరించిన మహాత్ములు పవిత్ర నేత్రాలతో వాల్మీకాన్ని చూడగానే, రసానుభూతి కొరవై, అంటుకొనే శక్తి లేక, అంటిపెట్టుకొని యున్న ప్రక్షిప్త అంటు జాడ్యాలను హెచ్చరిస్తూ మరీ తీసిపారేశారు.

ఆత్మబంధువులారా!

ఆదికవి రచించిన ఆదికావ్యం ఆదిత్యప్రకాశంతో కవితాగగనంలో శోభిస్తున్నా, దేశకాల పరిస్థితుల ననుసరించి, రామాయణాన్ని నూతన ఫక్కీలో ఎందరో మహాత్ములు రచించారు.

అందరి రచనలు ప్రయోజనాన్ని ఊహించినవే అయినా, ప్రయోగాలలో, పద్ధతులలో ఒక విధంగా సాగలేదు.

## 1. తులసీ రామాయణం

**మంగల కరని కలిమల హరని తులసీ కథా రఘునాథ కీ!**

రఘురాముని చరితము కళ్యాణప్రదమైన స్థితిని సమాజంలో ఆవిష్కరిస్తుందని, కలియుగ దోషములను నివారిస్తుందని జనావళికి హామీ ఇస్తూ రామచరిత మానసాన్ని ప్రారంభించి రచించాడు తులసీదాను. హిందూ సమాజంలో నూతన తేజాన్ని నింపాడు.

"భక్తుడైనవాడు ఒక్కసారైనా తులసీరామాయణాన్ని తప్పక చదవాలి"అంటాడు గాంధీజీ.

నారాయణునిలోని నరుణ్ణి దర్శించినవాడు వాల్మీకి.

నరునిలో నారాయణుణ్ణి దర్శించినవాడు తులసీదాస్.

"తులసీ రామాయణం భక్తుల పాలిటి పారిజాతం. హిందువులకు వేదం వంటిది. ముస్లిములకు ఖురాను లాంటిది"అని శ్లాఘించాడు మహాకవి రహీమ్.

## 2. కంబరామాయణం

"రామాయణాన్ని తమిళంలో రచించాలని, తమిళ ప్రపంచానికి అందించాలని నేను అభిలషిస్తున్నా. పాలకడలిని ఆపోశనం పట్టాలని పిల్లి చేసే ప్రయత్నం ఎలాంటిదో నా ప్రయత్నం కూడా అలాంటిదే నని నాకు తెలుసు" అంటూ కంబరు కవి తమిళ రామాయణాన్ని నమ్రతతో ప్రారంభించాడు. అవధులు లేని వాల్మీకి పాండిత్యానికి జోహరు లర్పిస్తూ ఉపక్రమించాడు.



తమిళ ప్రజలకు రామాయణాన్ని అందించి, సమాజ రథచక్రాలను నూతన మార్గంలో త్రిప్పాలని కంబరు అభిప్రాయపడ్డాడు. తన రామాయణాన్ని ఆనాటి సమాజం ఆదరించదేమో, నిరసిస్తుందేమో అనే భావన కూడా కంబరులో లేకపోలేదు. అయినా ఈ మహోత్తమ కార్యానికి కంబరు వెనుకాడలేదు. కంబరు ఏమంటున్నాడో చూడండి.

పయ్యం ఎన్నై ఇగళు మాసెన
క్తైద ఉమ్మి తియంబువదు తీయ దెనిల్
పొయిల్ కేళ్వి ప్పులమయిన్ ఒన్ పుగల్
ద్తైప మూక్కదై మాచ్చి తిరిక్కవే॥

"వాల్మీకి రామాయణాన్ని చదివి, అందలి దివ్యత్వాన్ని అవగతం చేసుకున్న నేను నా ఆనందాన్ని ప్రపంచంతో పంచుకోవాలనే అభిలాషను, ఆవేశాన్ని నిగ్రహించుకోలేక పోతున్నాను. నేను అజ్ఞాని నని ప్రజలు పరిహసించనీ. నానుండి దొర్లే గోరంత తప్పుల్ని కొండంత చేసి చూపనీ. రామాయణ కావ్య రచనను నేను విరమించుకోలేను" అంటాడు రసవత్తర భావోత్కర్షకు మారుపేరైన కంబరు కవి.

## 3. భావార్థ రామాయణము

మహారాష్ట్ర దేశంలో ప్రాకృతంలో గ్రంథాలు రచించి, ఆనాటి పండితుల ఆగ్రహానికి, అసూయకు గురియైన మహాత్ములలో సంత్ ఏకనాథ్ ఒకడు. సమాజం విషయము అలా ఉంచి, తన ఇంట్లోనే సంస్కృత విద్వత్తు కలిగిన కుమారుడగు హరిపండితుని నిరసనను ఎదుర్కోవలసి వచ్చింది ఏకనాథ్.

మరాటీ భాషలో రామాయణం వెలువడాలి అనేది పాండురంగదేవుని సంకల్పం. ఏకనాథ్ చక్కని పనిముట్టు అయ్యాడు. భావార్థ రామాయణం దివ్యంగా ఆవిర్భవించింది. మహారాష్ట్ర ప్రజలకు విజ్ఞాన మణిదీపమై భాసించింది. సమాజంలో నూతన వెలుగుల్ని ఆవిష్కరించింది.

శబ్దాలంకార సంవిధానంతో, వాక్య నిర్మాణ కౌశలంతో, అవరోధం లేకుండా, అలవోకగా సాగిపోయే పఠన సౌలభ్యాన్ని, శ్రవణ సుభగత్వాన్ని రంగరించి, రాగ రంజితమైన భావార్థ రామాయణాన్ని అందించాడు సంత్ ఏకనాథ్ మహారాజ్. ఈ కార్యం వెనుక రాముని అనుగ్రహమే ప్రధానం కాని తన అర్హత కాదు అంటాడు.

**తూ కైసా ఝూలాసి వక్తా పుసాల మాఝు యోగ్యతా**
**మా ఝు అంగీ మూర్ఖపణ మా ఝు మీ జాణే సంపూర్ణ**
**నకరీ మహణతా రామాయణ శ్రీరామ ఆపణ కథా ప్రేరి!**

"రామాయణానికి నీవు వక్త ఎలా కాగలవు? అని నా అర్హత నన్ను ప్రశ్నిస్తూ ఉంది. నాలాంటి మూర్ఖుడు రామాయణాన్ని వ్రాయగలడా? నా నిలువెల్ల మూర్ఖత్వమే. రామాయణాన్ని రాసే శక్తి నాకు లేదని నాకు బాగా తెల్సు. శ్రీరాముడే ప్రేరేపించి, నాచేత ఈ పని చేయించాడు" అంటాడు ఏకనాథ్.

### 4. అధ్యాత్మ రామాయణము

**"వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వం"** వ్యాసునికి తెలియని విషయం ప్రపంచంలో లేదని పండితుల మాట. నిజమే కదా! భారత, భాగవత, పురాణాది గ్రంథాలు రచించడమే గాక వేదాన్ని సంస్కరించి సంవిధాన మొనర్చిన ఘనత ఆయనకే దక్కింది. వ్యాసభగవానుని అపూర్వ సృష్టియే ఈ అధ్యాత్మ రామాయణము.

విభిన్న సిద్ధాంతాలతో, పాండిత్య వైషమ్యాలతో దారి తప్పిన సమాజాన్ని సక్రమ మార్గంలో ఉంచేందుకు రామాయణ రచనను ప్రత్యేకంగా ఎన్నుకున్నాడు వ్యాస భగవానుడు. సంస్కృతభాషలో రచించాడు.

తావ త్సర్వాణి శాస్త్రాణి వివదన్తే పరస్పరం
యావజ్జగతి నాధ్యాత్మ రామాయణ ముదేష్యతి!

"అధ్యాత్మ రామాయణము లోకంలో ప్రాచుర్యమును పొందనంతవరకే సర్వశాస్త్రాలు పరస్పర వాదాలతో కలహించుకుంటూ ఉంటాయి" అని ప్రారంభ పలుకుల్లోనే పలికాడు వ్యాసభగవానుడు.

సంకుచిత భావాలతో అజ్ఞానారణ్యంలో సంచరిస్తున్న మానవ సమాజాన్ని విశాల భావ స్ఫూర్తితో విజ్ఞాన వీధులలో విహరింప చేయాలని సంకల్పించి ఈ రచనను వ్యాసుడు చేపట్టినట్లు తెలుస్తోంది. విజ్ఞానం ఉదయించిన చోట వికృతాలు, వైషమ్యాలు తలఎత్తవు కదా!

ప్రచరిష్యతి తల్లోకే ప్రాణ్యదృష్ట వశాద్యది
తస్యాధ్యయన మాత్రేణ జనాయాస్యన్తి సద్గతిం

"అధ్యాత్మ రామాయణ ప్రచారము జనుల అదృష్టము. ఈ గ్రంథమును అధ్యయనము చేసినవారు సద్గతిని పొందుతారు" అన్నాడు వ్యాసభగవానుడు.

లోకంలోని దురదృష్టాన్ని, దుర్గతిని పోగొట్టే ప్రయత్నంలో వ్యాసభగవానుడు అధ్యాత్మ రామాయణాన్ని రచించాడు.

### 5. రంగనాథ రామాయణము

ఇది తెలుగులో ద్విపద కావ్యము. దీని రచయిత గోనబుద్ధారెడ్డి. 13వ శతాబ్దములో ఈ రచనను చేసినట్లు తెలుస్తూ ఉంది.

తెలుగులో వెలువడిన రామాయణాలలో దీనికే అగ్రతాంబూలం అందింది. ద్విపద కావ్యమైనందున పాడుకోడానికి, చదువుకోడానికి అనువుగా ఉండి చక్కని ప్రాచుర్యాన్ని పొందింది.



భాస్కర రామాయణము దీటైన పద్యకావ్యము. కానీ అది ఒక కవి చేతిమీదుగా సాగిన రచన కాదు. రంగనాథ రామాయణాన్ని మించలేక పోవడానికి అదికూడా ఒక కారణము.

రంగనాథ రామాయణము ప్రజాదరణ పొందింది. జనప్రియంగా సాగింది. స్త్రీలు ఇంటిపనులు చేసుకుంటూ పాడుకొనే రామాయణము ఇదే. తోలుబొమ్మలను ఆడించువారు పాడేది రంగనాథ రామాయణమే.

దేశకవిత్వము సాధారణంగా గేయకవిత్వమే. అందుచేత ద్విపద కావ్యాలకున్న ప్రాచుర్యము పద్యకవిత్వానికి ఉండదు. జన సామాన్యానికి దగ్గరగా చేరేది ద్విపద కావ్యమే. ఇది గ్రహించిన రచయిత రామాయణాన్ని ద్విపదకావ్యంగా రచించి, సామాన్య జనులకు కూడా అందుబాటులో ఉండేలా చేశాడు. ఈవిధంగా జనబాహుళ్యానికి రామకథను చెప్పి, సమాజంలో రమణీయ బాటను నిర్మించి, అభ్యుదయ మార్గాన్ని సూచించాడు.

ఆది కవీశ్వరుఁడైన వాల్మీకి
యాదరంబునఁ బుణ్యులందఱు మెచ్చఁ
జెప్పిన తెఱఁగున శ్రీరాము చరిత
మొప్పఁ జెప్పెదఁ గథాభ్యుదయ మెట్లనిన॥

అని ప్రారంభించాడు కవి. వాల్మీకి రామాయణాన్ని ఉన్నదున్నట్లు తెనిగిస్తా నన్నాడే కాని, వాల్మీకంలో లేని అనేక విషయాలను జోడించి చెప్పాడు. "ఊర్మిళ నిద్ర, లక్ష్మణుని నవ్వు" లాంటి ఎన్నో విషయాలను రచించాడు. అలా చేయడమే మంచిదయింది. దానివల్లనే జన బాహుళ్యానికి దగ్గరైంది ఈ రామాయణము తెలుగునేల మీద.

తెలుగులో అనేక రామాయణాలు వెలువడ్డాయి. వాటివాటి ప్రత్యేకతల్ని అవి నిరూపించుకున్నాయి. కానీ బహుళ ప్రచారానికి నోచుకున్నది రంగనాథ రామాయణమే.

### 6. గోపీనాథ రామాయణము

తెలుగులో వెలువడిన రామాయణాల్లో గోపీనాథ రామాయణము నాకు బాగా నచ్చిన గ్రంథము. దీని కర్త గోపీనాథము వేంకటకవి. ఇతడు వాల్మీకమును అనుసరిస్తూనే రచన సాగించాడు. తన గ్రంథాన్ని నరులకు అంకిత మివ్వకుండా శ్రీకృష్ణునికి సమర్పించిన భాగవతోత్తముడు గోపీనాథం వేంకటకవి.

గోపీనాథ రామాయణము వెలువడి వందసంవత్సరాలే అయింది. వేంకటగిరి సంస్థానాధీశుడైన సర్వజ్ఞ కుమార యాచేంద్ర భూపతి ఆనాడు కవిని సత్కరించి, కృతిని విస్తరింప చేశాడు.

విద్వద్వరేణ్యులని చెప్పుకుంటూ, కడుపు కూటికి అడ్డదారులు త్రొక్కుచు, పారమార్థికచింతన ఏ మాత్రము లేకుండా, అన్నీ తమకే తెలిసినట్లు గర్విస్తూ,

రూకలకు రచనలు చేసి, కుయుక్తులతో సత్కవులను వంచించు దుష్కవులను దుయ్యబట్టే కార్యాన్ని కూడా స్వీకరించాడు గోపీనాథం వేంకటకవి.

నృపతుల వేడినన్ గరుణ నిచ్చిన నిత్తురు దంతివాజిర
త్న పట ధనాగ్రహారములు దప్పక యన్నియు నస్థిరంబు లా
విపుల కృపా పయోధి యదువీరుని వేఁడినఁ బ్రీతినిచ్చు ని
త్యపదము నట్టి వానిఁ గొనియాడక యన్యుల వేఁడ నేటికిన్

అని భక్తి వైరాగ్యములతో నిండిన తన నిర్మల హృదయాన్ని స్పష్టం చేశాడు గోపీనాథం వేంకటకవి.

1923లో ఈ గ్రంథాన్ని వావిళ్ళవారు ముద్రించారు. ఆ తరువాత పునర్ముద్రణలు ఆరు దశాబ్దాల వరకు జరుగలేదు. 1987లో పునః వెలుగు చూసిన గోపీనాథ రామాయణాన్ని మూడు సంవత్సరాల క్రితం వేంకటకవి గారి మునిమనుమడు నన్ను కలిసి రెండు సంపుటాలుగా వెలువడిన ఈ రామాయణాన్ని భక్తి గౌరవాలతో నాకు సమర్పించాడు. మండూకప్లుతి న్యాయంగా మొదట అక్కడక్కడ చూశాను. ఆ తరువాత సంపూర్ణంగా చూశాను. సంతసించాను. గద్యపద్యాలతో నడిచిన ఈ గోపీనాథ రామాయణము గణనీయమైనది తెలుగులో.

## 7. మొల్ల రామాయణము

రామాయణము జనసామాన్యమునకు అందాలని కృషి చేసిన రచయితలలో నెల్లూరు మండలానికి చెందిన కవయిత్రి మొల్ల ఒకతె. రామాయణాన్ని పద్య గద్య కావ్యంగా ఈమె రచించింది.

గోపవరం గ్రామంలో వెలసియున్న శ్రీకంఠమల్లేశ్వర స్వామి అనుగ్రహంతో తాను రామాయణాన్ని రచిస్తున్నట్లు మొల్ల తన గ్రంథంలో పేర్కొన్నది. విద్యాసంపద తనకు లేదని వినయంగా చెప్పుకున్నది.

అనువాద రీతుల మీదనే సున్నితంగా ధ్వజమెత్తింది మొల్ల. తేట తెలుగులో కందువ మాటలతో కమ్మని కవిత్వమును చెప్పడం మరచి, సంస్కృతమూలము కంటే ప్రౌఢంగా రచించడం వల్ల ప్రయోజన మేమిటని ప్రశ్నించింది ఈ కవయిత్రి.

తేనె సోక నోరు తీయన యగురీతి
తోడ నర్థమెల్ల తోచకుండ,
గూఢ శబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూఁగ చెవిటివారి ముచ్చటగును.

అని నిశితంగా విమర్శించింది. ఈ భావాన్ని మనసులో ఉంచుకొని తాను రామాయణ రచనకు ఉపక్రమించింది. తనలోని రామభక్తికి పరవశిస్తూ, జనసామాన్యానికి రామాయణాన్ని దగ్గరగా తీసికొని పోవాలనే తపన మొల్లలో స్వచ్ఛంగా కన్పిస్తుంది.



అది రఘురాము చరితము
నాదరముగ విన్నఁ గ్రొత్తయై లక్షణ సం
పాదమ్మై పుణ్యస్థితి
వేదమ్మై తోఁచకున్న వెట్టినె చెప్పన్?

అని ఋజుత్వంతో పలికింది మొల్ల. నచ్చి చెప్పిన కావ్యమే గాని పిచ్చిపట్టి పలికింది కాదని విమర్శకులను హెచ్చరించింది.

చెప్పమని రామచంద్రుడు
చెప్పించిన పలుకు మీదఁ జెప్పెద నే, నె
ల్లప్పుడు నిహపర సాధన
మిప్పుణ్య చరిత్ర, తప్పు లెంచకుడు కవుల్

అని పలికింది వినయ కవయిత్రి మొల్ల. మల్లెల కన్న తెల్లనైన మనసు గల మొల్ల నిర్మల రామభక్తితో రచించిన కావ్యమే మొల్ల రామాయణము. మువ్వు తొలగించాలనే సంకల్పముతో చేపట్టిన కావ్యములో తప్పులు ఎంచవద్దని పెద్దలకు విన్నవించుకున్నది.

ఈవిధంగా భక్తితో, సామాజిక స్పృహతో, ఈశ్వరానుగ్రహమును తోడు చేసుకొని అనేకమంది రామకథను రచించారు.

కళ్యాణ గుణాభిరాముడైన శ్రీరామచంద్రుని సుగుణములకు సమ్మోహితులై, ఇలాంటి నాయకుడు దొరకుట అలభ్యమని భావించి, కొందరు కవులు తమ ప్రతిభతో రామకథను దివ్యంగా వర్ణించారు.

రఘువంశ కావ్యాన్ని వ్రాసిన మహాకవి కాళిదాసు రఘువంశీయుల సుగుణములే తన రచనకు ప్రేరకములని చెబుతాడు.

సంస్కృతములో "అనర్ఘ రాఘవ నాటకము" ను రచించినవాడు మురారి కవి. ఈ నాటకాన్ని తాను ఎందుకు వ్రాయవలసి వచ్చిందో ఇలా చెబుతాడు.

యది క్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్య చరితం
గుణై రేతావద్భి ర్జగతి పున రన్యో జయతి కః?
స్వమాత్మానం తత్తద్గుణ గరిమ గంభీర మధుర
స్ఫురద్వాగ్బ్రహ్మణః కథ ముప కరిష్యంతి కవయః ॥

ఈ శ్లోకంలో తన రచనకు కారణమును చెబుతున్నాడు మురారి. రఘురాముని చరితమును పూర్వము ఎందరో కవులు రచించారు. అయినా అలాంటి మహానాయకుడు విశ్వ సాహిత్యంలో మరొకడు లభించడు. అట్టి రాముని చరిత్రను వ్రాసినపుడే పాండిత్యానికి, కవిత్వానికి సార్థక్యము. అందుకే తాను అనర్ఘ రాఘవ నాటకాన్ని రచించినట్లు చెబుతాడు మురారి.

ఎందరు చెప్పినా
ఎంతగా చెప్పినా
ఎన్నిసార్లు చెప్పినా
తనివి తీరనిది, నిత్యనూతన మైనది రామకథ.
బావుంది. ఇన్ని రామాయణాలు ఉండగా, ఈ

## చైతన్య రామాయణము

ఎందుకు? ఎవరి కొరకు? ఏమి సాధించాలని? - చెబుతాను.

నా కథ చెప్పేముందు ప్రస్తావనగా రెండు మాటలు ........

రామచంద్రుని గుణానుకీర్తనము పుణ్యప్రదము. ముక్తిప్రదము. రాముడు ధీరోదాత్త నాయకుడు. అట్టి సుగుణాభిరాముని కళ్యాణ చరితమును కమనీయంగా రచించిన వారిలో ఒకరైన కవిబ్రహ్మ తిక్కన తన "నిర్వచనోత్తర రామాయణము" నకు, హేతువును ఇలా చెబుతాడు.

ఎత్తఱి నైనను ధీరోదాత్త నృ
పోత్తముడు రామధరణీపతి స
ద్వృత్తము సంభావ్యమౌట
నుత్తర రామాయణోక్తి యుక్తుడ నైతిన్

అని తన మనోభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు ఉభయకవిమిత్రుడు తిక్కనార్యుడు. రామకథారచన కార్యాన్ని జీవిత లక్ష్యంగా భావించి, రచించి, తరించిన మహానుభావు లెందరో ఈ పుణ్యభూమిలో.

అంతేకాదు. రామకార్యమే నిజమైన పని యని, తక్కినదంతా శని యని భావించిన వారూ ఉన్నారు.

ఏ పనికో జన్మించితి నని నీ వెంచవలదు శ్రీరామ నే ॥నేపనికో॥
శ్రీపతి శ్రీరామచంద్ర నీ చిత్తానికే తెలియదా నే ॥నేపనికో॥
వాల్మీకాది మునులు నరులు నిన్ను
వర్ణించిన నా యాస దీరునా
మేల్మియై యుండు సద్భక్తులు
మెచ్చుదురే త్యాగరాజ నుత నే ॥నేపనికో ॥

అని కీర్తిస్తూ, రామ గుణానుకీర్తనమే తన జీవితానికి ముఖ్య ప్రయోజనము అంటాడు త్యాగరాజస్వామి.



ఇక నా కథ

ఇది చైతన్య రామాయణం. రామ చైతన్యాన్ని వర్ణించే గ్రంథం. రామాయణ చైతన్యాన్ని వివరించే గ్రంథం.

నాకు దైవ నియోగం

మీకు ప్రసాద వినియోగం.

పైనుండి అందింది పిలుపు ... క్రింద అందించబోయేది మేలుకొలుపు.

ఇరవైఏడు సంవత్సరాలుగా చేసిన కొలువు

గ్రామ గ్రామాన కనుల పండుగగా సాగిన భక్తి చెలువు - ఏకమై నాకు ఈ రామాయణ రచనా భాగ్యాన్ని ప్రసాదించాయి.

కవినై వ్రాయలేదు.

పండితుణ్ణై ప్రవచించలేదు.

తియ్యని రామకథను, పవిత్రమైన రాముని గాథను తెల్లని కాగితంపై వ్రాశాను. అంతే.

ప్రజాభాషలో వ్రాశాను. జనప్రియంగా చెప్పాను.

సరళభాషలో వ్రాశాను. వాడుక భాషలో వ్రాశాను. వేడుకగా వ్రాశాను. వేడుకుంటూ వ్రాశాను. నన్ను వాడుకోమంటూ వ్రాశాను.

శేముషీ సింధువునై వ్రాయలేదు. ఆర్తజన బంధువునై వ్రాశాను.

"నేనా! దద్దమ్మను. రామన్న కథ రాయడం నాకు సాధ్యమా!" అని పెద్దమ్మ పాదం పట్టుకున్నాను. అమ్మల గన్న అమ్మను వేడుకున్నాను.

దాశరథి గాథను దద్దరిల్లేలా వ్రాయమని పెద్దమ్మ ధైర్యాన్ని నూరిపోసింది.

నా అదృష్టానికి పొంగిపోతూ శతధా ధన్యుణ్ణై రచన కుపక్రమించాను.

ఇది సాహసమే నని నాకు తెలుసు.

గంగానదిని పూర్ణంగా ఆపోశనం పట్టాలని భావించే గోరువంక ప్రయత్నం అని నాకు తెలుసు.

అయినా ప్రారంభించాను. ప్రయత్నించాను.

త్రికరణశుద్ధితో రామాయణాన్ని రచించేవారికి, అంబోధిని దాటిన ఆంజనేయుడు అండగా ఉంటాడనే మాట మీద విశ్వాసమున్న వాణ్ణి.

దైవకృప ఎలా ఉంటుందో జీవితంలో చూసినవాణ్ణి.

రామాయణాన్ని కొందరు కథగా వ్రాశారు.

కొందరు మూలానికి శ్లోక తాత్పర్యాలు సమకూర్చారు.

కొందరు యథాతథంగా భావాన్ని అందించారు.

కావ్యంలోని కవితా పరిమళాన్ని కొందరు వెదజల్లారు.

నేను ఇవేమీ చేయలేక పోయాను.

మహిమను వర్ణించి మనిషిని తీర్చిదిద్దే ప్రయత్నం చేశాను.

అది నా జీవితలక్ష్యం. దైవశాసనం.

ఆంధ్రావనిలో ఈనాడు నాకు ఉండేది ఊడే ఉద్యోగం కాదు. ఊరేగే ఉద్యమం.

చూస్తూ నమ్మలేని సభలు.

సమయాల్ని పాటిస్తూ, నియమాల్ని అనుసరిస్తూ సకాలానికి సభాస్థలికి గలగలమంటూ నదిలా కదిలొచ్చే జనప్రవాహం.

ప్రసంగించినంత కాలం నిస్తరంగ జలధిలా నిశ్చేష్టులై కూర్చుని,

ఆశ్చర్యంతో

ఆర్ద్రతతో

ఆనందంతో

మూగబాధతో

పకపకమనే నవ్వులతో కొంతసేపు

తడి ఆరని కన్నులతో మరికొంతసేపు

రెండు గంటల్ని రెండు నిముషాలుగా భావించి

జీవిత లక్ష్యాన్ని, మార్గాన్ని పొందామనే తృప్తితో లేచిపోయే అశేష జనావళి ఈనాడు ఆంధ్రావనిలో ఎక్కడైనా సుందర చైతన్య సభలలో ప్రత్యక్షం!

ఆహా! ఏమి వైభవం! ఏమి ప్రాభవం! ఎవరిది ఇదంతా!

ఇదంతా సనాతనధర్మ వైభవమే!

ఏనాటి పుణ్యఫలమో!

వాసుదేవుని కృపా వీక్షణమో,

వ్యాసవాల్మీకాదులు అభిషేకించిన పుణ్యతీర్థం నన్ను కరుణించింది.

తీర్థపుగిన్నె నా చేతికి వచ్చింది.

వినమ్రుడనై, వినీతుడనై వినియోగ భారాన్ని భుజాల కెత్తుకున్నాను. వితరణశీలి నయ్యాను.

నమ్మకమున్న వాణ్ణే గాని అమ్మకం తెలియని వాణ్ణి.

అయితే నేమి? అమ్మిపెట్టేవాడు అచ్యుతు డయ్యాడు.

వేడుకంతా వేదికవద్దే.



చెప్పినట్లు చేయమన్న వాని చరిత్రను వ్రాసి మూడు సంవత్సరాల క్రితం విడుదల చేశాను. వేలాది కాపీలు గంటలో ఎగిరిపోయాయి.

చేసినట్లు చేయమన్న వాని చరిత్రను ఇప్పుడు వ్రాస్తున్నాను. ముస్తాబు కాకముందే మాకంటే మాకని ముచ్చటపడుతున్నారు వేలాది భక్తులు.

నమ్మి నడచిన బ్రతుకు వమ్ము కాదు.

జీవికి ఏనాడైనా ప్రధానమైంది సొమ్ము కాదు.

రెండు దశాబ్దాలు ఆంధ్రావనిలో గీతాప్రవచనం చేశాను. తేట తెలుగులో ఉపనిషత్తులు వినిపించాను. భాగవతామృతాన్ని త్రాగించాను. రామాయణ సాగరం వైపుకు నడిపించాను.

ఓం నమో భగవతే వాసుదేవాయ అనే దివ్య ద్వాదశాక్షరీ మంత్రాన్ని మిన్ను ముట్టేలా వాడవాడలా ప్రతిధ్వనింప చేశాను.

సత్సంగాలు నెలకొల్పాను. సన్మార్గాన్ని బోధించాను. చేయవలసిన సందడంతా చేశాను.

మహర్షుల వైభవాన్ని దర్శించిన నా హృదయం విశ్రాంతిని విసర్జించింది. నిద్రను నిర్జించింది. ఆరోగ్యాన్ని విస్మరించింది.

నోరు మూతను పారేసుకుంది. కంఠం పగ్గాన్ని త్రెంచుకుంది. కాళ్ళు సంకెళ్ళను ఛేదించుకున్నాయి. చేతులు కట్లను వదిలించుకున్నాయి.

ప్రవచనాలు జోరుగా సాగాయి. పాటలు శ్రావ్యంగా కాసెట్ల కెక్కాయి. ఊరూరు ప్రయాణా లయ్యాయి. చాప పరచినట్లు గ్రంథాలు వెలువడ్డాయి.

పరిశ్రమ ఫలించింది. పరిస్థితి మారిపోయింది.

ఇంతకాలం విని ఆనందించిన వారంతా ఇకమీదట కని తృప్తి చెందాలని తపన చెందుతున్నారు. ధర్మజీవనాన్ని గడిపేందుకు నడుం బిగిస్తున్నారు.

ఇప్పుడు రామాయణం వారికి చాలా అవసరమై ఉంది. ఈ క్షణం కొరకే వేచియున్న నేను కలం కదిలించి, రాత్రింబవళ్ళు శ్రమించి, సాధకజన లోకానికి రామాయణాన్ని అందించాలని సంకల్పించాను.

దానికి తోడు

ఈనాటి సమాజానికి రామాయణం అవసరం ఎంతో ఉంది.

తల్లిదండ్రుల మాట బిడ్డలు వినరు.

బిడ్డల భవిష్యత్తును తల్లిదండ్రులు పట్టించుకోరు.

భర్త మాట భార్య వినదు. భార్య సుఖాన్ని భర్త కనడు.

గురువులపై శిష్యులకు గౌరవం లేదు. శిష్యులపై గురువులకు వాత్సల్యం లేదు.

స్నేహితుల మధ్య నమ్మకాలు నశించాయి. బంధువుల మధ్య దూరాలు పెరిగాయి.

వ్యాపారాలు, ఉద్యోగాలు, పాలకులు, పాలితులు - అంతా కాలుష్యమే. కాపట్యమే.

ఈ వ్యసనాన్ని పారద్రోలి.
సద్వ్యవస్థను ఆహ్వానించాలని
ధర్మవ్యవస్థను సమాజంలో ఆవిష్కరించాలని అభిలషించి, ఆశపడి
దేశకాల పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని
సామాజిక స్పృహను మదిలో నింపుకొని
అధఃపతన మవుతున్న ఆధునిక సమాజానికి
సనాతనధర్మ ప్రగతిని అందించాలని
అజ్ఞాన అనారోగ్యంతో నీరసించిన సమాజానికి
దివ్యారోగ్యాన్ని ప్రసాదించే జ్ఞానరత్నాన్ని ఎక్కించాలని, పట్టించాలని
పట్టుపట్టి, పట్టుదలతో రామాయణాన్ని రచిస్తున్నాను.
ఇది చైతన్య రామాయణం
భక్తులకు సారథి. విమర్శకులకు వారధి. సాధకులకు పెన్నిధి. నిజానికి రామప్రభువు సన్నిధి.
రామాయణంలో చైతన్యమూర్తి రామభద్రుడు.
చైతన్యునిలో అదృశ్యశక్తి శ్యామభద్రుడు.
కళ్ళ ముందు రాముడు
మనసు వెనుక శ్యాముడు
నేను మధ్యవర్తిని. మీకు మధ్యవర్తిని. మీ మధ్యవర్తిని.
చైతన్య రామాయణమంతా వాల్మీకమే.
అవాల్మీకాలు సుందరంగా గోచరించిన చోట వాటి చిరునామాలు తెలుపుకుంటూ నడిచాను.
రాముని ఆలయమే రామాయణం
అది భక్తుల పాలిటి దేవాలయం.
విగ్రహం రామునిది
ప్రతిష్ఠ వాల్మీకిది
నా దేమి టంటారా? పరిచర్యలే. సేవలే.
మెట్లు శుభ్రం చేయడం
దారిని సుగమం చేయడం
సున్నం కొట్టడం
రంగులు పులమడం - అంతే.
రాజు కట్టిన వంతెనపై ప్రాకి చీమ నదిని దాటుతుంది.



వాల్మీకి రామాయణాన్ని ఆశ్రయించి నేను నా కార్యాన్ని పూర్తి చేసుకున్నాను.
చీమకు చేవ ఎంతో - మీకు తెలుసు.
చైతన్యుని శక్తి అంతే - అని నాకు తెలుసు.
కృషి రవ్వంత. కృప కొండంత. అంతే అంతా.
పుణ్యాత్ములారా !
శ్రీరామ చరితామృతం మన చేతి కందింది.
శ్రీరామ పాదతీర్థం మనకు లభించింది.
శ్రీరామ నామసుధ మనకు ప్రాప్తించింది.
ఇక ఆలస్య మెందుకు? జుర్రుదామా!

జుఱ్ఱెద మీ కథామృతము జుఱ్ఱెద మీ పదపంకజ తోయమున్
జుఱ్ఱెద రామనామమున జొబ్బిలుచున్న సుధారసంబు నే
జుఱ్ఱెద జుఱ్ఱ జుఱ్ఱగ రుచుల్ గనువారి పదంబు గూర్పవే
తఱ్ఱుల తోడి పొత్తిడక దాశరథీ కరుణా పయోనిధీ

"కళ్యాణరామా! కరుణామయా! నీ చరితామృతాన్ని, నీ పాదతీర్థాన్ని, నీ నామపీయూషాన్ని కడుపారా గ్రోలుతాను.
"దశరథరామా! దయామయా! నీ నామసుధను, నీ కథామృతాన్ని జుఱ్ఱీ జుఱ్ఱీ తృప్తి చెందిన సత్పురుషుల సహచర్య భాగ్యమును నాకు ప్రసాదించు.
"కోదండరామా! కోమల హృదయా! కఠినాత్ముల కూరిమిని ఖండించు తండ్రీ!"
అన్నాడు ఆనాడు భద్రాచల రామదాసు.
ఆ మాటే ఈనాడు నేనూ అంటున్నాను, వినమ్రుడనై.
నిజ భక్తుల చరణధూళినై అంటూనే ...... ఉంటాను.

చల్లని చూపుల నల్లని స్వామి
పదముల కడ
వాడని పువ్వులా పడి ఉండాలని
పరితపించే, పరిశ్రమించే
మీ
స్వామి సుందర చైతన్యానంద

22-10-94

# విషయసూచిక

## బాలకాండము



## అయోధ్యాకాండము

## అరణ్యకాండము



# అంకితం



ఆదికవి
పద సరోజములకు





# శ్రీరామ
# జయరామ
# జయ జయ రామ....



## తొలకరి

ఏకం సత్
'ఉన్నదొక్కటే' అన్నది వేదం. దానికే ఋషుల ఆమోదం.
పైనున్న ఆకాశం ఒక్కటే. క్రిందున్న భూమి ఒక్కటే.
పీల్చేది ఒకే గాలి. త్రాగేది ఒకే నీరు.
విశ్వమంతా ఒకే గృహం. మానవులంతా ఒకే కుటుంబం.
ఒకే దేహంలో వివిధ అంగాలవలె ఒకే పరమాత్మలో జీవులందరూ ఏకమై ఉన్నారు.
ఇది యజ్ఞదృష్టి. దీనికి అనుకూలంగా జీవించడం యజ్ఞజీవనం.
నాదన్నది ప్రక్కకునెట్టి జీవించడమే యజ్ఞజీవనం. నిస్వార్థజీవనం.
స్వార్థము అనర్థాన్ని అందిస్తుంది.
నిస్వార్థజీవనం బ్రతుకుకు పరమార్థాన్ని ప్రసాదిస్తుంది.
స్వార్థపు తెరలు వీడిపోతే,
అహంకార, మమకారపు పొరలు ఊడిపోతే,
సౌభాగ్య సందాయకంగా సమాజంలో యజ్ఞజీవనం ఆవిష్కరింపబడుతుంది.
ఇదే నిత్యాగ్నిహోత్రం.
ఇది ఆరని వెలుగు. చల్లారని అగ్ని.
మనిషి భోగజీవి కాకూడదు. భావజీవి కావాలి. త్యాగజీవి కావాలి.
ఇదే యజ్ఞ శంఖారావం.
యజ్ఞభావంతో విశ్వకల్యాణాన్ని వాంఛించి జీవించువారే ఋషులు.
అందుకే వారు
విశ్వానికి మిత్రులు. హితులు. యతులు.
ఆశలు లేనివారు. స్వార్థము ఎరుగనివారు.
ఈర్ష్యలు తెలియనివారు. అసూయలు అర్థంకానివారు.
ఒక్క మాటలో చెప్పాలంటే,
చిన్నపిల్లలవంటివారు. బాలుర వంటివారు.

### ఇది బాలకాండము.

అంటే, ఒకరి బాల్యానికి సంబంధించింది కాదు.
ఎందరో బాలురకు సంబంధించింది.

రాముని బాల్యానికి సంబంధించింది కనుక దీనికి బాలకాండ అని పేరొచ్చినట్లు చెప్తూ ఉంటారు.
రాముని బాల్యము వాల్మీకి రామాయణంలో వర్ణించబడలేదు.
కనుక పైభావము పొసగదు. అతకదు.
ఈ కాండము బాలురకు సంబంధించింది. అందుచేత బాలకాండము.
ఎందరో బాలురు ఈ కాండములో కనిపిస్తారు.
విశ్వామిత్రుడు, నారదుడు, వాల్మీకి, భరద్వాజుడు, వసిష్ఠుడు, గౌతముడు, ఋష్యశృంగుడు, శతానందుడు, వామదేవుడు - ఇంకెందరో .....
ఎందరైతేనేమి?
అందరూ బాలురే. కల్మషం తగలనివారే. కపటం తెలియనివారే.
భావార్థ రామాయణాన్ని మరాటీ భాషలో రచించిన సంత్ పురుషుడు ఏక్‌నాథ్ మహరాజ్.
ఆయన కూడా బాలురతో చేరిపోయాడు.

**సాధూంచె మీ తార్ హె బాలక్**

"సాధుమహాత్ములవద్ద నేను బాలుణ్ణి;" అంటాడు ఏక్‌నాథ్.
కంబరామాయణాన్ని తమిళభాషలో రచించిన భక్త కవిశేఖరుడు కంబరు.
ఆయన కూడా బాలురతో కలిసిపోయాడు.

**అరైయు మాదరం కుమ్బుడ ప్పిళ్ళైగళ్**

**తరైయిర్ కీరిడిల్ తచ్చరుం కాయవరో**

**ఇరైయుం కేళ్ప ఇలాదర్వే పుఁ కవి**

**మురైఇ నులుణరన్ద దారు మునివరో**

"రామచంద్రుని పుణ్యగాథను వ్రాస్తున్నా. నా మాటలు చప్పగా ఉండొచ్చు. భక్తులు బాలురు. ఉన్మాదులు. వారి మాటలు లెక్కపెట్టవద్దు. పిల్లలు పిచ్చిపిచ్చిగా గీచే గీతల్ని చూచి వాస్తుశిల్పి కోపగించుకుంటాడా?" అనేసి బాలురతో చేరిపోయాడు.
బాలురందరూ ఒకచోట చేరినవేళ
నిజానికి అదొక ఆనందమేళా.
ఈ బాలకాండములో మనకు ఆ భాగ్యం లభిస్తుంది.
వారిని దర్శించే భాగ్యం, వారితో క్రీడించే అదృష్టం ప్రాప్తిస్తుంది.

**ముద మంగళమయ సంత్ సమాజూ**

**జో జగ జంగమ తీరథ రాజూ**

"సాధు సమాగమము ఆనందప్రదము. కల్యాణమయము.
వారు లోకంలో కదిలే పుణ్యతీర్థముల వంటివారు"
అంటాడు చక్కెరను వెక్కిరించే విధంగా రామకథను రచించిన తులసీదాసు. ఈ పుణ్యతీర్థాలలో ఎలా గ్రుంకులిడాలి?

**బిను సత్ సంగ్ బిబేక న హోయీ**

**రామకృపా బిను సులభ న సోఈ**

"విమలమతులైన సత్పురుషుల సాంగత్యము లేకుండా వివేకము ఉదయించదు.
రామానుగ్రహం లేనిదే సత్సంగప్రాప్తి కలుగదు"
ఈ కాండములో మనకు పైరెండూ ప్రాప్తిస్తాయి.
మేలి గుణముల జాబిల్లి, మర్యాద పురుషోత్తముడు శ్రీరామచంద్రుని గుణానుకీర్తనమును హృదయంగమంగా గానంచేస్తాడు నారదమహర్షి.
రసజ్ఞ మనోజ్ఞంగా రచిస్తాడు వాల్మీకిమహర్షి.
ఈ కాండములోనే -

రామ వైభవం

సాధు సమాగమం

యజ్ఞ ప్రాభవం ...

అహల్యకు ఆహ్లాదం ఇక్కడే.
చేదు విరిగేది, తీపి పెరిగేది ఈ కాండములోనే.
శాపాలు కరిగేది, పాపాలు తరిగేది ఇక్కడే.
తాటక సుబాహులనే కామక్రోధాల విషానికి విరుగుడు ఇక్కడే.
అంతేకాదు. ఇంకా ఎంతో వుంది వింత.
బాలురైన ఋషుల క్రీడలే యజ్ఞాలు. వారు వసించు ప్రదేశాలే ఆశ్రమాలు.
వాల్మీకి ఆశ్రమం, గౌతమాశ్రమం, సిద్ధాశ్రమం, మన్మథాశ్రమం,అగస్త్యాశ్రమం ఇలా ఎన్నో ఆశ్రమాలు-
అలాగే ఎన్నో యజ్ఞాలు.
దశరథుని అశ్వమేధ యాగము, పుత్రకామేష్టి యాగము, సిద్ధాశ్రమంలో విశ్వామిత్రుడు నిర్వహించిన యజ్ఞము, జనకపురిలో విదేహరాజు నిర్వహించిన యజ్ఞము, మరెన్నో....
త్యాగమే ఇక్కడ యజ్ఞమని పిలువబడుతోంది.
సమర్పణ అనేది జీవికి అత్యుత్తమ ధర్మము.
సమర్పణభావం యజ్ఞానికి ప్రాణం వంటిది.
యజ్ఞకర్మ ద్వారా దాత, గ్రహీత ఇద్దరూ ఉత్తమ ఫలితాన్ని సాధిస్తారు.
సమాజంలో అభ్యుదయం శోభిస్తుంది.

ఇదేదో అసాధ్యమైన కార్యం కాదు.
కపిలె ద్వారా బావినీటిని పొలాలకు మళ్ళించడం వంటిది.
తోడుతూ ఉంటే నీరు ఊరినట్లు, యజ్ఞకర్మలవల్ల చిత్తం చిగురిస్తూ ఉంటుంది.
పంచుతూవుంటే జ్ఞానం పెరుగుతుంది. ధనం పెరుగుతుంది. ప్రేమ పెరుగుతుంది. శాంతి పెరుగుతుంది.
జీవుని బంధించే కర్మలు ఇక్కడ విముక్తినిచ్చే యజ్ఞాలుగా మారిపోతాయి.

యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మ బంధనః
తదర్థం కర్మ కౌన్తేయ ముక్త సంగ స్సమాచర ॥

"అర్జునా! యజ్ఞకర్మకంటె అన్యమైన కర్మలు లోకంలో బంధాలను సృష్టిస్తాయి. కనుక నీవు ఫలాపేక్ష లేకుండ నిస్సంగుడవై కర్మలాచరించు" అంటాడు భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ.
సంపన్నులు యజ్ఞాలు చేయలేరు. సద్భావసంపన్నులే చేయగలరు.
ఉన్నవాడు పెట్టలేడు. హృదయమున్నవాడే పెట్టగలడు.
మనసున్నవాడికే చేతులుంటాయి.

**He who gives all, keeps all**

"అందించేవాడే ఆస్తిపరుడు" అంటాడు విశ్వకవి రవీంద్రుడు.

సహ యజ్ఞాః ప్రజాః సృష్ట్వా, పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వ మేషవోఽస్త్విష్ట కామధుక్ ॥

బ్రహ్మదేవుడు ప్రజలతో పాటు యజ్ఞములనుకూడా సృష్టించి, యజ్ఞభావంతో జీవించమన్నాడు.
యజ్ఞమయుడు పూర్ణపురుషుడు. కనుక వాంఛారహితుడు. వాంఛాతీతుడు.
తృప్తిచెందిన అతని మనసే కామధేనువు.
సదా అతనికి బ్రహ్మసంబంధమే.
అదే సీతారామ కళ్యాణం.
పెళ్ళిభోజనం కూడా మనకు ఈ కాండములోనే.
ఇక ఆలస్యమెందుకు అంటారా?
సరే. మేము సిద్ధమే. ప్రారంభించండి.

వడివడిగా, వేడివేడిగా
వడ్డించే
బుధజన సేవకుడు
మీ
స్వామి సుందర చైతన్యానంద

# చైతన్య రామాయణము

## బాలకాండము

### అవతారిక

**అది రమణీయమైన ఋష్యాశ్రమం.**

నిర్మలమైన ఆ మునివాటికలో మలయమారుతము మంజులముగ వీస్తూ ఉంది. మనోహరములైన సుమములు మందహాసమును చిందిస్తున్నాయి. దివ్యమైన కుసుమ పరిమళము ఆ పరిసరాలను అలుముకొని ఉంది. తరుశాఖలను కౌగిలించుకొని లతలు అందముగా అల్లుకుపోతూ ఉన్నాయి. వికసిత సుమములలోని మధురమైన మకరందమును ఆస్వాదించి పరవశించిన భృంగములు, శృంగారముగ నర్తిస్తూ మంజుల గానములను ఆలపిస్తున్నాయి. అల్లంత దూరాన గిరిశృంగము నుండి జాలువారే జలపాతాలు దివినుండి భువికి దిగే సురతరుణుల యొక్క జలతారు కొంగులవలె జారుతూ ఉన్నాయి. నింగిన నిలిచి, ఖంగని పిలిచే మేఘుని ప్రేమ పలుకు నందుకొని మైమరచి నృత్యము చేయు మయూరములు, వృక్షశాఖలపై కూర్చుని మధుర రవములను వినదించే కీరసమూహము, స్థితప్రజ్ఞుని వలె అచలమై భాసిస్తున్న ఋషికుటీరము, ముక్తికి మార్గమా అన్నట్లు తెరువబడియున్న కుటీర ద్వారము, మనసులను మరపించి, మనుగడనే మైమరపించునట్లు శోభిస్తున్నాయి. చిత్తములను చిగురింపజేసి చిద్విలాసమును హృదిలో నింపుతున్నాయి.

**అది వాల్మీకి మహర్షి ఆశ్రమం.**

ఎవరీ వాల్మీకి? భృగువంశమున ఋక్షుడను వాడుండేవాడు. రజస్తమో గుణ ప్రేరితుడైన ఋక్షుడు హింసా ప్రవృత్తితో చరించేవాడు. ఆటవిక వృత్తిలో రమించేవాడు. కుటుంబ పోషణకై పరులను హింసించుటకు కూడా వెనుకాడేవాడు కాడు.

పూర్వ పుణ్య విశేషము పుణ్యచరితుల సమాగమమును ప్రసాదించి బ్రతుకును పునీతం చేస్తుందని పెద్దలమాట. ఏనాటి పుణ్యమో ఋక్షునకు సప్తర్షులను దర్శించే భాగ్యం లభించింది. సాధు దర్శనంలో ఋక్షుని బుద్ధి శుద్ధి పడింది. సప్తర్షుల అనుగ్రహానికి పాత్రుడైన ఋక్షునకు

రామమంత్రం ప్రాప్తించింది. పుణ్యశ్లోకుడు, పురాణపురుషుడు అయిన శ్రీరాముని దివ్య మంత్రం సంప్రాప్తించింది.

ఒకచోట కూర్చుని ఋక్షుడు రామమంత్రాన్ని అనేక సంవత్సరాలు జపించాడు. దేహ స్మృతి కూడా దూరమైంది. అతని చుట్టూ పుట్ట పెట్టింది. పెరిగింది. ఋక్షుని పూర్తిగా కప్పేసింది. అయినా అతడు చలించలేదు. తనను మరచి, తనువును మరచి ఆచరించేదే నిజమైన తపస్సు.

వరుణదేవుడు వర్షించాడు. వర్షానికి పుట్ట కరిగింది. ఋక్షుడు బహిర్గత మయ్యాడు. అందుచేత ఋక్షుడు వాల్మీకి అయ్యాడు.

**వల్మీక ప్రభవో యస్మాత్ తస్మా ద్వాల్మీకి రిత్యసౌ**

'వల్మీకము' అనగా పుట్ట. వల్మీకము నుండి ఆవిర్భవించుటచే ఋక్షుడు వాల్మీకి అయ్యాడు.

మట్టి దేహాన్ని అంటి పెట్టుకొని జీవించువారంతా ఋక్షుని వలె పుట్టలో నుండువారే. దైవానుగ్రహమనే వర్షపుజల్లు పడినపుడు ఈ దేహాభిమానమనే పుట్ట కరిగిపోతుంది. అంతవరకు ఋక్షునివలె కుక్షింభరిత్వమునకు పాటుపడేవారంతా, శుద్ధబుద్ధి గలవారై వాల్మీకులవుతారు. రామకార్యానికి కర్తలవుతారు.

వాల్మీకికి ప్రాచేతసుడు అనే నామము కూడా ఉంది. ప్రచేతసుడు అనగా వరుణుడు. వరుణుడు వర్షించుట వలన పుట్ట కరిగి ఋక్షుడు బహిరిల్లుట చేత వాల్మీకికి ప్రాచేతసుడు అనే పేరు కలిగింది.

**ఋక్షోఽ భూ ద్భార్గవ స్తస్మా ద్వాల్మీకి ర్యోఽ భిధీయతే**

'ప్రచేతసుని వలన వాల్మీకి అని కీర్తించబడిన భార్గవుడగు ఋక్షుడు పుట్టెను' అని విష్ణుపురాణము తెలుపుచున్నది.

వాల్మీకి తన ఆశ్రమమున ఋషులు ఉపదేశించిన రామమంత్రమును శిష్యులతో గూడి జపిస్తుండేవాడు. **"మననాత్ త్రాయతే ఇతి మంత్రః"** మననము చేయువానిని రక్షించునది మంత్రము. మంత్ర వైభవము వాల్మీకి జీవితంలో ప్రతిఫలించింది. బుద్ధి శుద్ధిపడింది. బ్రతుకు భగవన్మయంగా మారసాగింది.

రామనామము జీవులకు అమృతత్వమును ప్రసాదిస్తుంది. శివుడు సదా రామనామమును కంఠంలో నిలుపుకొని ఉంటాడు. అందుచేత విషపానం చేసినా చలించలేదు. విషమయ బ్రతుకుల్ని విమలంగా మార్చుతుంది రామనామం. రామనామము సర్వపుణ్యప్రదము.

ఒకప్పుడు దేవతలలో ఒక వివాదము తలెత్తింది. ప్రథమ పూజ అందుకొనుటకు తామంటేతామే అర్హులమని దేవతలు పరస్పరము వివాదపడి బ్రహ్మదేవుని సమీపించారు. వారివారి అర్హతలను విరించికి వివరించారు.

"దేవతలారా! మీలో ఎవరు ముందుగా భూప్రదక్షిణము చేసి తిరిగి నా వద్దకు వస్తారో వారికి ప్రథమ పూజ అందుకొనే అర్హతను ప్రసాదిస్తాను" అని బ్రహ్మదేవుడు చెప్పాడు.



దేవతలు వారివారి వాహనములను ఎక్కి భూప్రదక్షిణము చేయుటకు బయలుదేరారు. వినాయకుడు మూషికవాహనము నధిరోహించి బయలుదేరాడు. దేవతలందరూ ముందుగా పోతున్నారు. మూషికము వెనుకబడింది. గణపతికి ఏం చేయాలో అర్థం కాలేదు.

నారద మహర్షి దారిన వెడుతూ గణపతిని చూశాడు. మూలుగుతున్న మూషికాన్ని వీక్షించాడు. సానుభూతితో హేరంబుని సమీపించాడు.

"విఘ్నరాజా! నీవు విలపించ నవసరము లేదు. నీవు **శ్రీరామ** నామమును భూమిపై వ్రాసి, దానికి ప్రదక్షిణము చేసి బ్రహ్మదేవుని వద్దకు పొమ్ము" అని పలికాడు.




నారదుడు చెప్పిన రీతిగ ఆచరించి వినాయకుడు అందరికన్న ముందుగ బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళాడు. ప్రథమ వందనీయుడు గణపతియేనని బ్రహ్మదేవుడు తీర్పు చెప్పాడు.

భూప్రదక్షిణము చేయుటకన్న శ్రీరామ నామమునకు ప్రదక్షిణము చేయుట మిక్కిలి పుణ్యమని దీనిని బట్టి తెలియుచున్నది. కనుక రామనామము సర్వపుణ్యప్రదమని చెబుతూ రామచరితమానసంలో తులసీదాసు ఈ ఉపాఖ్యానమును తెలిపారు.

నామం మనస్సును పవిత్రం చేస్తుంది. నామాన్ని ప్రేమించాలి. ఆశ్రయించాలి. ప్రాణతుల్యంగా కీర్తించాలి. నామ సాధనలో శ్రమించే, పరిశ్రమించే మనస్సును తయారు చేసుకోవాలి. నామంలో రమించే వారికి శ్రమలు తెలియవు. అనిత్య విషయములనుండి విరమించిన మనస్సే నామమునందు రమించ గల్గుతుంది.

ప్రపంచం నారాయణుని ఆధీనంలో ఉంటుంది. కానీ నారాయణుడు నామానికి ఆధీనుడై ఉంటాడు.

నామము భక్తి సాధనము. భక్తిలో శుద్ధిపడినవాడు జ్ఞాని అవుతాడు. నామము నామిని ప్రసాదిస్తుంది.

ఒకనాడు నారదమహర్షి వాల్మీకి ఆశ్రమానికి వస్తాడు. నారదుడు మహాభక్తుడు. అంతేకాదు. మహాజ్ఞాని. **"నారం దదాతీతి నారదః"** వరిష్ఠమైన జ్ఞానమును అందించువాడు నారదుడు.

వాల్మీకికి రామనామం తెలుసు. కానీ రాముని గూర్చి తెలియదు. రాముని గూర్చి తెలిసికోవాలని వాల్మీకి భావిస్తాడు. ప్రసంగవశాన నారదమహర్షిని ప్రశ్నిస్తాడు.

# ఆదికవి-ఆదిశ్లోకం

**తపః స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్**
**నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్ముని పుంగవమ్ ॥**

తపోధనుడైన వాల్మీకి, తపస్సునందు, స్వాధ్యాయమునందు సదా ఆసక్తి కలవాడు, వాక్చతురత గలవారిలో శ్రేష్ఠుడు, మునులలో గొప్పవాడు అగు నారదమహర్షిని ప్రశ్నించాడు.

ఇది శ్రీమద్రామాయణము అని ప్రసిద్ధి గాంచిన వాల్మీకి రామాయణంలో ఆరంభశ్లోకం. ఈ శ్లోకంతో గ్రంథము ప్రారంభమైనందున ఇదియే మంగళాచరణమని గ్రహించాలి.

మంగళకరమైన ఈ ప్రారంభశ్లోకమునందు తపోధనుడైన వాల్మీకిమహర్షి మునిశ్రేష్ఠుడైన నారదమహర్షిని ప్రశ్నిస్తున్నాడు.



శిక్షణ యోగ్యుడైన శిష్యుడు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన గురువుని సమీపించి జ్ఞానమును పొందాలి. ఇది శిష్టాచారమున ప్రాప్తించిన సంప్రదాయము.

మనకు ఈసందర్భమున నారదుడు గురువుగా, వాల్మీకి శిష్యుడుగా గోచరిస్తున్నారు. తపస్సునందు, స్వాధ్యాయమునందు సదా రమించువాడు నారదుడు అని చెప్పుట జరిగింది. స్వాధ్యాయము జ్ఞానమును సూచించుచుండగా తపస్సు వైరాగ్యమును తెలుపుచున్నది. జ్ఞాన వైరాగ్యములు గల నారదమహర్షి శిక్షణ యోగ్యుడైన వాల్మీకికి బోధించుటకు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన గురువుగా శోభిస్తున్నాడు.

నారదమహర్షిని మునిపుంగవుడని, వాగ్విదులలో శ్రేష్ఠుడని ఈ ప్రారంభశ్లోకమున వర్ణించుట జరిగింది. **"మునిపుంగవమ్"** అనుట బ్రహ్మనిష్ఠత్వమును సూచించుచుండ, **"వాగ్విదాం వరమ్"** అనుట శ్రోత్రియత్వమును తెలుపుచున్నది.



శిష్యుడు జ్ఞానమును పొందుటకు తపించువాడై ఉండాలి. అందుచేత వాల్మీకి ఇచ్చట తపస్వీ అని చెప్పబడినాడు. అట్టి వాల్మీకి నారదుని పరిప్రశ్నించాడు

'పప్రచ్ఛ' అని చెప్పకుండా "పరిపప్రచ్ఛ" అని చెప్పడం జరిగింది. "పరి" అనే ఉపసర్గ వల్ల విశేషమైన అంశమును గుర్తించాలి. గురువును ప్రశ్నించకూడదు. పరిప్రశ్నించాలి. శాస్త్ర విధానము ననుసరించి వేయు ప్రశ్నలు పరిప్రశ్నలవుతాయి. ఈ విషయమును భగవద్గీత కూడా ప్రస్తావించింది.

**'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా'**

అని భగవద్గీత - జ్ఞానయోగములో పరమాత్మ తెలిపియున్నాడు.

"మహర్షీ ! సర్వ సద్గుణ సంపన్నుడైనవాడు ప్రస్తుతం ఈప్రపంచంలో ఎవ్వడున్నాడు? అంతేగాదు. సుగుణ సంపదతో పాటు పరాక్రమవంతుడు, ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, సత్యవాక్యములు కలవాడు, దృఢవ్రతుడు, సదాచారవంతుడు, సర్వభూత హితుడు, విద్వాంసుడు, సమర్థుడు, సదాప్రియదర్శనుడు, ఆత్మవంతుడు, జితక్రోధుడు, ప్రకాశరూపుడు, అసూయలేనివాడు అగు పురుషుడు ఎక్కడున్నాడు? ఎవడు యుద్ధమున కోపించినచో దేవతలు కూడా భీతి చెందుదురో అట్టివానిని గూర్చి నేను వినగోరుచున్నాను. మహర్షీ! అట్టివానిని గూర్చి నీకు తప్పక తెలిసి ఉంటుంది. అతణ్ణి గురించి వినాలని నేను కుతూహల పడుచున్నాను," అని వాల్మీకి నారదమహర్షికి తన మొరను వినిపించాడు.

వాల్మీకి ఈసందర్భమున పదునారు గుణాలను నారదుని ముందు పరచినాడు. ఇవి వాస్తవానికి పదునారు కళల వంటివి. ఇవియే పరమాత్మ యొక్క షోడశకళలు అని అంగీకరించేవారు చాలామంది. అయితే ఇక్కడ వాల్మీకి ప్రశ్నించి వినగోరినది నరుని గూర్చియా? లేక నారాయణుని గూర్చియా? అన్నది ప్రశ్న.

వాల్మీకి విన కుతూహలపడినది పరమాత్మ విషయముననే గాని, సామాన్య జనుల ఊహలలో మెదిలే దశరథరాజ కుమారుడైన రాముని గూర్చి కాదనియు, అయితే అట్టి కళ్యాణ గుణములు సలక్షణముగ శ్రీరాముని యందు ఉండుటచేత నారద మహర్షి శ్రీరాముని గూర్చి ప్రవచించెననియు పండితులు, భక్తులు, మాన్యులు అభిప్రాయపడుతూ ఉంటారు. శ్రీమద్రామాయణ వ్యాఖ్యాతలలో ప్రముఖులైన గోవిందరాజులవారు కూడా అలాగే అభిప్రాయ పడ్డారు. ఇది సమంజసమైన అవగాహనయేనని నా అభిప్రాయము. కానీ

**కస్య బిభ్యతి దేవాశ్చ జాత రోషస్య సంయుగే**

"రణరంగమున ఎవడు కోపించిన దేవతలు కూడా భీతి నొందుదురో" అనుట వలన వాల్మీకి నిర్గుణ పరమాత్మను తెలుపమని కోరుట లేదనియు, అప్రమేయుడగు పరమాత్మ యొక్క వివరణమును వాంఛించుట కాదనియు నిశాచర వినాశకరుడగు శ్రీరాముని హృదిలో నింపుకొనియే అడిగినాడని తెలియుచున్నది. మునిపుంగవుడైన నారదమహర్షి ద్వారా రామచరితమును వినాలనే కుతూహలమే ఈ ప్రశ్నలకు ముఖ్య కారణమై ఉన్నది. ఇదియే వాల్మీకిలో వ్యక్తమవుతున్న ఆసక్తికి, ఆనందమునకు కారణమై యున్నది.

రామాయణమును అధ్యయనము చేయు పుణ్యాత్ములు రెండు విధాలుగా తెలుస్తున్నారు. 1. రాముడు దేవుడని విశ్వసించి చదివేవారు. 2. రాముడు కూడా

నరుడే యని భావించి చదివేవారు. ఈ రెండు దృక్పథాలలో రెండవది శ్రేయస్కరమని నా అభిప్రాయము. రాముడు దేవుడని రామాయణమును చదువ నారంభించువారు, సమాప్తి అయిన పిమ్మట రాముడు దేవుడు కాడు, మానవుడే అని పలికితే ఆశ్చర్యపడవలసిన పనిలేదు. కానీ రాముడు కూడా మానవుడే అని భావించి రామాయణమును పఠించినవారు మాత్రము, చివర రాముడు దేవుడే యని నిస్సందేహముగా పలుకుతారు. ఇది సత్యము. సత్యము. ముమ్మాటికి సత్యము.

ఈ సందర్భమున రెండు విషయాలను మనము అవశ్యం గుర్తించాలి. 1. పైన తెలిపిన పదునారు లక్షణములు గల దివ్యపురుషుని గూర్చి వినుటకు వాల్మీకి కుతూహల పడుచున్నాడు. 2. అట్టి గుణములు గల పురుషుని గూర్చి నారదునికి తెలుసునని వాల్మీకి ప్రగాఢ విశ్వాసమును వ్యక్తము చేయుచున్నాడు.

తాను శ్రవణము చేయు విషయము నందు శిష్యునకు ఆసక్తి మెండుగా ఉండాలి. అంతేగాదు. తత్సంబంధమైన జ్ఞానము గురువుకు కలదు అనే పూర్ణవిశ్వాసము కూడా తోడై ఉండాలి. అట్టివాడే జ్ఞాన సముపార్జనమును చేయగలడు.

వాల్మీకి వచనములు నారదమహర్షికి ఆనందాన్ని కల్గించాయి. శ్రీరాముని అనంత కళ్యాణ గుణములను కీర్తించే భాగ్యం తనకు కలిగినందుకు నారదుడు పొంగిపోయాడు.ఉత్తమ శ్రోతయైన వాల్మీకి మహర్షికి వినిపించే అవకాశం కలిగినందుకు సంతసించాడు. ఈ కార్యము భవిష్యత్తులో ఎందరో సుఖించుటకు రాచబాట కాగలదని గుర్తించాడు. దీనివల్ల ప్రపంచానికి మహోపకారం జరుగుతుందని విశ్వసించి ప్రవచించుటకు నారదుడు ఉపక్రమిస్తున్నాడు.

**శ్రూయతామితి చా మన్త్ర్య ప్రహృష్టో వాక్య మబ్రవీత్**

వాల్మీకి వచనములను ఆలకించిన నారదమహర్షి సంతసించినవాడై " పలికెదను- వినుము" అని చెప్ప నుపక్రమించాడు.

సంతసించినవాడై నారదమహర్షి చెప్పసాగాడు ("ప్రహృష్టః").శిష్యుని పలుకులు లేదా ప్రశ్నలు గురువుకు సంతసమును కలిగించేవిగా ఉండాలి. అలాగే గురువు ప్రేమతో శిష్యులకు ఆనందముగా బోధించేవాడై ఉండాలి.

భక్తులు భగవత్కార్యములను ఆనందముగా భక్తితో ఆచరిస్తారు. భక్తి అనేది బండను మోసినట్లు ఉండ కూడదు. వృత్తిలో పరమాత్మను మరువకపోతే ఆ వృత్తి భక్తిగా మారుతుంది. విషయాసక్తి ఉన్నంతవరకు భగవద్భక్తి కలుగదు. కదలదు.

"వాల్మీకి మహర్షీ ! నీవు కోరిన గుణాలు ఒకే వ్యక్తిలో దుర్లభాలు. కానీ మన అదృష్టం కొద్దీ అట్టి ఆదర్శపురుషుడు ఒకడున్నాడు. అతణ్ణి గూర్చి చాలా మందికి తెలిసే ఉంటుంది.

**మునే వక్ష్యామ్యహం బుద్ధ్వా తైర్యుక్తః శ్రూయతాం నరః**

"మహర్షీ! అట్టి గుణయుక్తుడగు దివ్యాత్ముని గూర్చి తెలిసి ప్రవచిస్తాను. విను;" అని నారదమహర్షి చెప్ప నారంభించాడు.

శ్రీరాముని చరితమును బ్రహ్మదేవునిద్వారా నారదమహర్షి శ్రవణం చేసి యున్నాడు. వాల్మీకి అడుగుటచేత తాను వినిన దానిని చెప్పుటకు ప్రారంభిస్తున్నాడు.



తెలిసికొని (బుద్ధ్వా), నేను చెప్పుచున్నాను (అహం వక్ష్యామి) అని నారదుడు పలికాడు.

ఇతరులకు బోధించేముందు అట్టి జ్ఞానము ముందుగా తనకున్నదో లేదో చూసుకొని మరీ బోధించాలి. ఎండిన చెరువు పండించేది ఏముంటుంది? ఉన్నవాడే పెట్టగలడు. త్రాడున్నవాడే కట్టగలడు. వెలిగే దీపమే మరొక దీపాన్ని వెలిగిస్తుంది. జ్ఞానియే జ్ఞానమును పంచగలడు. తనకు లేని జ్ఞానమును ఇతరులకు బోధించేవాడు శ్రోతలను నట్టేట దించగలడు. తేలే అవకాశ మివ్వకుండా ముంచగలడు.

తెలిసి పలికే నారదుడు శ్రీరాముని అనంత కళ్యాణగుణములను వాల్మీకికి వివరించి చెప్తున్నాడు. సర్వులను సమ్మోహింపచేయు ఎన్నో దివ్య గుణములు రాముని యందున్నవని పలుకుతున్నాడు.

శ్రీరాముడు ఇక్ష్వాకు వంశమున జన్మించాడు. ఆయన ఆవిర్భావము వలన ఇక్ష్వాకు వంశము తరించింది. అతడు నియతాత్ముడు. గొప్ప పరాక్రమ వంతుడు. మహాతేజస్సంపన్నుడు, ధైర్యశాలి, నియమనిష్ఠలు కలవాడు, బుద్ధిమంతుడు, నీతికోవిదుడు, సర్వవిద్యా పారంగతుడు, సంపన్నుడు, శత్రుసంహారకుడు, అందమైనవాడు, నీలమేఘశ్యాముడు, విశాలమైన వక్షస్థలము కలవాడు, విశాలమైన నేత్రములు గలవాడు, శుభలక్షణుడు, ధర్మజ్ఞుడు, సత్యసంధుడు, కీర్తిమంతుడు, జ్ఞానసంపన్నుడు, పరిశుద్ధుడు, ఆశ్రితజన రక్షకుడు, సర్వజీవ పోషకుడు, సమస్త ధర్మ రక్షకుడు, వేద వేదాంగ కోవిదుడు.

సీ॥ వెడద కన్నులవాడు విపులాంసములవాడు రాకేందు బింబ వక్త్రంబువాడు
కంబు కంఠము వాడు ఘనలలాటమువాడు రమణీయ మృదు కపోలముల వాడు
పీన వక్షమువాడు పృథునితంబమువాడు సముదగ్ర చారు మస్తకము వాడు
దివ్య దేహమువాడు దీర్ఘబాహులవాడు కమనీయ శుభ లక్షణములవాడు
తే॥ ప్రబల చాపంబు మూపున బరగువాడు శ్యామవర్ణంబు వాడు ప్రశస్తగూఢ
జత్రు దేశంబు గలవాడు సమవిభక్త, సముచిత మనోజ్ఞ సుందరాంగముల వాడు.

అని రాముని సుందర రూపమును గోపీనాథ రామాయణము వర్ణించింది.

అంతేగాదు. సాధుశీలుడు. నిగ్రహవంతుడు. సర్వ సంపూజ్యుడు. సాగరునివలె గంభీరుడు. హిమాలయమువలె ధీరుడు. పరాక్రమమున విష్ణువు అంతటివాడు. చంద్రుని వలె చల్లనివాడు. ఓర్పునందు భూదేవి వంటివాడు. కోపం వస్తే కాలాగ్నిలా ప్రచండుడు. త్యాగంలో కుబేరుని వంటివాడు.

**సర్వదాభి గతః సద్భిః సముద్ర ఇవ సిన్ధుభిః**

నదులు సదా సాగరమునే చేరుచుండు నట్లు, సత్పురుషులు ఎల్లవేళల శ్రీరాముని వద్దకు వస్తూ ఉంటారు; అన్నాడు నారదమహర్షి.

తనలోని సంపదను సాగరము ఎలా నిక్షిప్తం చేసికొని ఉంటుందో, తనలోని ఈ దివ్యమయ గుణాలనుకూడా శ్రీరాముడు బయటపడనీక సామాన్యునివలె చరిస్తుంటాడు. అట్టి రఘురాముని అగణిత గుణ శోభను వర్ణిస్తూ, రామకథను ప్రారంభించి సంక్షిప్తముగా

వంద శ్లోకాలలో వాల్మీకికి తెలిపాడు నారదుడు. ఇదియే సంక్షిప్త రామాయణము* అని పేరొందింది. ఇది శ్రీమద్రామాయణం లోని బాలకాండలో ప్రథమసర్గ.

## శోకము - శ్లోకము

నారదుడు చెప్పిన రామకథ వాల్మీకికి ఆనందమును, పారవశ్యమును కల్గించింది. వాల్మీకి నారదమహర్షిని శ్లాఘించాడు. అర్చించాడు. ఆనందాశ్రువులు రాల్చాడు.

వాల్మీకి భక్తికి నారదుడు చలించాడు. హృదయ స్పందనలో వాల్మీకిని ఆలింగనం చేసుకున్నాడు. గురుపూజానంతరము తాను గురువై బోధించిన విషయాన్ని కూడా నారదుడు మరచాడు. జ్ఞానులు కర్తృత్వమును ఎక్కువకాలం మనసులో ఉండనివ్వరు.

నారదమహర్షి ఆకాశమార్గాన దేవలోకమునకు వెళ్ళాడు. మహర్షి బోధించిన రామకథ వాల్మీకి వీనులలో ప్రతిధ్వనిస్తూనే ఉంది. రమ్యమైన రామకథను మననం చేసుకుంటూ పులకాంకితుడు అవుతున్నాడు వాల్మీకి.

ఆ స్థితిలోనే తన శిష్యుడైన భరద్వాజునితో కలసి స్నానము ఆచరించుటకు తమసానదికి బయలుదేరాడు వాల్మీకి. తమసానదీ తీరాన బురదలేని రేవును చూచి,

**అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ**
**రమణీయం ప్రసన్నాంబు, సన్మనుష్య మనోయథా ॥**

"భరద్వాజా! ఈ రేవును చూడు. బురదలేదు. మనోహరంగా ఉంది. ప్రసన్నంగా ఉంది. ఇది మహాత్ముని మనసువలె ఉంది" అన్నాడు వాల్మీకి.

ఇచ్చట నది యందలి జలమును సత్పురుషుని మనసుతో పోల్చడం జరిగింది. ఇది బహు చక్కని ఉపమానము. సజ్జన హృదయం నిర్మల జలము వంటిది అంటున్నాడు వాల్మీకి మహర్షి.

రేవులో బురదలేదు. అంతేగాదు. పూడిక తెలియునట్లు జలము నిర్మలంగా, ప్రసన్నంగా ఉంది. అందుచేత ఆ రేవు మనోహరంగా ఉంది.

రేవులో అలలు లేవు. బురదలేదు. అందుచేత ప్రసన్నంగా ఉంది. అట్టి రేవును మంచివాని మనసుతో పోల్చినారు వాల్మీకి.

ఎవని మనసులో సంకల్పాలు అనే అలలు ఉండవో, అజ్ఞాన పంకము లేదో అట్టివాని అంతఃకరణ నిర్మలంగా ఉంటుంది. అలలు, బురదలేని రేవులో పూడిక తెలియునట్లు, సంకల్పాలు నిరోధించబడి, అజ్ఞానము అంతరించిన హృదయమడుగులో అధిష్ఠాన పరబ్రహ్మ దర్శనీయుడు అవుతాడు.

ఈశ్లోకంలో మహర్షి తెలిపిన ఉపమాన ఉపమేయములను గ్రహిస్తే వాల్మీకియొక్క హృదయస్థితి మనకు అర్థం కాకపోదు. అలలు, బురదలేని రేవులాగా తన ఆంతర్యం తయారై ఉంది. లేనిచో రామకథను ఎలా వ్రాయగలడు? రాముడు ప్రవేశించే ముందు ఎవరి హృదయమైనా అలాగే ఉండాలి. ఉంటుంది.

* ఈ సంక్షిప్త రామాయణంపై స్వామీజీ రచించిన వ్యాఖ్యను ప్రత్యేక పుస్తకంగా ఆశ్రమం ముద్రించింది.



"నాయనా! భరద్వాజా! ఆ జలపాత్రను క్రిందపెట్టి, నాకు వస్త్రమును ఇమ్ము. పవిత్రమైన ఈ తమసా తీర్థము నందు స్నానం చేస్తాను" అన్నాడు మహర్షి.

భరద్వాజుడు గురుదేవునకు నారపంచెను అందించాడు. దానిని తీసికొని తమసానదీ తీరము నందలి విశాలమైన వనప్రదేశమును దర్శిస్తూ వాల్మీకిమహర్షి సంచరిస్తూ ఉన్నాడు.

అలా విహరిస్తూ ఉండగా, దారి ప్రక్కన, ఒక చెట్టుపై క్రీడించుచున్న క్రౌంచ పక్షుల జంట మహర్షి దృష్టిని ఆకర్షించడం జరిగింది.

కామమోహితమై ఉన్న క్రౌంచపక్షుల జంటలో మగపక్షిని బోయవాడు బాణంతో కొట్టాడు. అది విలవిల తన్నుకుంటూ, క్రిందపడి, రక్తసిక్తమైన దేహముతో మరణించింది. అదిచూచి పెంటిపక్షి మగపక్షి చుట్టూ తిరుగుతూ విలపించ సాగింది. గుండె చెరువయ్యేలా రోదించసాగింది.

ఆ సన్నివేశము ధర్మాత్ముడైన వాల్మీకి హృదయాన్ని ద్రవింపజేసింది. మనసును కలవరపరచింది. దయామయుడైన వాల్మీకి మనసు వికలమైంది. ఆంతర్యం శోకసముద్రంలా తయారైంది. మహర్షి నిషాదునివైపు తిరిగి,

**మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీ స్సమాః**
**యత్ క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్ ॥**

*నిషాద=ఓ కిరాతుడా!, త్వం=నీవు, యత్=ఏ కారణము వలన, (క్రౌఞ్చ) మిథునాత్=క్రౌంచ పక్షుల జంటనుండి, కామమోహితమ్=కామముచే మోహితమై ఉన్న, ఏకమ్=ఒకదానిని, అవధీః=చంపితివో, (తత్= అందువలన); శాశ్వతీః=చాలా, సమాః=సంవత్సరములు, ప్రతిష్ఠాంతు=ఉండుటను, మా గమః= పొందకపోయెదవు గాక!*



"ఓరీ బోయవాడా! నీవు క్రౌంచపక్షుల జంటనుండి కామమోహితమై యున్న ఒక పక్షిని కొట్టి చంపావు. కనుక నీవు ఎక్కువ కాలము జీవించ కుందువుగాక!" అని శపించాడు.

క్రౌంచపక్షిని జూచి, జాలిపడి మహర్షి ఆవేదనతో పలికిన ఆ మాటలు ఛందోబద్ధమైన శ్లోకరూపాన్ని ధరించాయి. తీవ్రమైన ఆవేదనలో తననుండి అప్రయత్నంగా వెలువడిన ఆ పలుకులు అందమైన శ్లోకరూపాన్ని పొందడం వాల్మీకికే ఆశ్చర్యాన్ని కల్గించింది.

ఆ మాటలు నాలుగు పాదాలుగా విభజించుటకు అనువుగా ఉన్నాయి. పాడటానికే కాదు. పాడుతూ ఆడటానికి

కూడా లయబద్ధంగా శోభిస్తున్నాయి. ఆ శ్లోకాన్ని మహర్షి మళ్ళీ మళ్ళీ మననం చేసుకున్నాడు. విస్మయాన్ని పొందాడు.

వాల్మీకిది సున్నిత హృదయం. ఆయన మనస్సు కోమలం. పక్షి మనసుని అర్థం చేసికొని వాల్మీకి కలత చెందాడు. అందుకే వాల్మీకికి రాముడు లభించాడు.

పక్షి యొక్క శోకాన్ని సమంగా వాల్మీకి కూడా అనుభవించాడు. ఆయన దుఃఖం తన కొరకు కాదు. ఆయన శోకం లోకం కొరకే. అందుచేత అప్రయత్నంగా, అసంకల్పితంగా ఆ దివ్యాత్ముని మాటలు శ్లోకరూపాన్ని దాల్చాయి. శోకము లోకంతో కలిసి శ్లోకంగా మారింది.

వాల్మీకి ఆశ్రమం చేరాడు. ఈ శ్లోకాన్ని శిష్యులకు వినిపించాడు. తానూ పదేపదే మననం చేయసాగాడు. తన ధ్యాస మాత్రం పక్షిమీద, శ్లోకం మీదే ఉంది. ఈస్థితిలో సృష్టికర్త, చతుర్ముఖుడు అయిన బ్రహ్మదేవుడు వాల్మీకిని చూచుటకు ఆశ్రమానికి వచ్చాడు.

బ్రహ్మదేవుని చూడగనే వాల్మీకి విస్మితుడైనాడు. వెంటనే లేచాడు. చేతులు జోడించి నమస్కరించాడు. అర్ఘ్యపాద్యాదులిచ్చి అర్చించాడు. కుశలమును ప్రశ్నించాడు.

పితామహుడైన బ్రహ్మదేవుడు ఎదురుగా కూర్చొనియున్నాడు. అయిననూ వాల్మీకి మనసు ఆ క్రౌంచపక్షి మీదనే ఉంది. తాను అప్రయత్నముగా పలికిన శ్లోకమును గూర్చియే ఆలోచన సాగుతున్నది.

వాల్మీకి ఆంతర్యమును బ్రహ్మదేవుడు గ్రహించాడు.చిరునవ్వును చిందిస్తూ చతుర్ముఖుడు, "మహర్షీ! నీవు పలికింది శ్లోకమే. ఆ విషయంలో సందేహము లేదు. నా సంకల్పం వల్లనే ఆశ్లోకము నీనుండి పుట్టింది. నీవు నారదునిద్వారా శ్రీరాముని చరితమును ఆలకించియున్నావు.

**రామస్య చరితం సర్వం కురు త్వమృషి సత్తమ**

"ఋషిశ్రేష్ఠుడా! శ్రీరాముని సంపూర్ణ చరితమును నీవు కావ్యరూపమున రచించు."

"బ్రహ్మర్షీ! శ్రీరాముడు ధర్మాత్ముడు. సుగుణవంతుడు. బుద్ధిమంతుడు. నారదుడు నీకు చెప్పిన దానిని వినినది వినినట్లుగ రచించు. అంతేకాదు. శ్రీరాముడు, లక్ష్మణుడు, సీత, భరతుడు, రాక్షసులు - వీరందరికి సంబంధించిన చరిత్రములు అందరికి తెలిసినవియే గాకుండా, రహస్యమైన విషయాలు కూడా నీకు తెలుస్తాయి.

"మహర్షీ! నీనుండి వెలువడే ప్రతిమాట సత్యమై ఉంటుంది. నీ రచనలో ఒక్కమాట కూడా అసత్యంకాదు. ప్రారంభించు. రామకథనంతా శ్లోకబద్ధం చెయ్యి.

**యావత్ స్థాస్యన్తి గిరయః సరితశ్చ మహీతలే**
**తావ ద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి**

"ఈ ప్రపంచమున గిరులు, నదులు ఉన్నంతవరకు నీవు రచించే రామకథ కూడా ఉంటుంది" అనిపలికి బ్రహ్మదేవుడు అంతర్హితుడయ్యాడు.

రామాయణము పర్వతాలకొరకు, నదులకొరకు కాదు.. పర్వతాలు అంటే పురుషులని భావం. నదులంటే స్త్రీలని అర్థం. ఈ ప్రపంచంలో జీవులు ఉన్నంతవరకూ వారి జీవితాలను పవిత్రం చేసే రామాయణము స్థిరంగా ఉంటుంది.



రామాయణంలో ప్రవచించిన సత్యాలు పర్వతాలవలె చెక్కుచెదరకుండా స్థిరంగా ఉంటాయి. రామాయణం వినిపించే ధర్మాలు నదీప్రవాహంలా సాగుతూనే ఉంటాయి.

బ్రహ్మదేవుడు అంతర్ధాన మయ్యాడు. వాల్మీకి, శిష్యులైన భరద్వాజాదులు ఆశ్చర్యపడ్డారు. అందరూ అమితానందభరితులై పదే పదే ఆశ్లోకమును పఠించసాగారు. పరస్పరము దానిని గూర్చి ముచ్చటించుకోసాగారు. పరమాత్మ ధ్యాన తత్పరుడైన వాల్మీకి మహర్షి అత్యుత్సాహ వంతుడై శిష్యులతో,

**కృత్స్నం రామాయణం కావ్య మీదృశైః కరవాణ్యహమ్ ॥**

"సంపూర్ణ రామాయణ కావ్యమును ఈ శ్లోకవృత్తముతోనే రచిస్తాను" అన్నాడు.

## జై జై ఆదికవి వాల్మీకిమహర్షి కీ

బ్రహ్మదేవుడు ప్రసంగవశాన వాల్మీకిని "మహర్షీ!" అని సంబోధించాడు. "నా ఋషిః కురుతే కావ్యమ్" ఋషి కానివాడు కావ్యమును వ్రాయలేడు అని దాని భావము. ఋషి శ్రేష్ఠుడా! అని బ్రహ్మ వాల్మీకిని సంబోధించుటచే ఆదికావ్యమైన రామాయణము శ్రేష్ఠమై భాసిస్తుందని బ్రహ్మ ఆశీర్వదించి, నిర్దేశించినట్లు గోవిందరాజీయము అనే రామాయణ వ్యాఖ్యాన గ్రంథము తెలుపుచున్నది.

శ్రీమద్రామాయణము కరుణ రసాంచితమైన కావ్యము. విధిని మార్చే శక్తివంతమైన దివ్యగాథ యని విధాతయే నిర్ణయించిన కావ్యము. ఈ కావ్యములోని ప్రబోధ గరిమ, ప్రవచన చారిమ అనితర సాధ్యం. అనన్య సామాన్యము.

రామాయణం ఆదికావ్యం. అనాదియని విఱ్ఱవీగే మాయను అనాథను చేసిన మహాకావ్యం. విహితజీవనమును తెలిపి, ధర్మమార్గమును చూపి మానవులను స్థిరచిత్తులుగా, హితమతులుగా, మహిత మతులుగా, మహాయతులుగా తీర్చిదిద్దిన, దిద్దుతున్న సిద్ధకావ్యం. ప్రసిద్ధకావ్యం. సుప్రసిద్ధకావ్యం. భారతీయులందరు మాది అని గర్వించదగిన ఆదికావ్యం.

కావ్యము పారవశ్యమును, తన్మయత్వమును కల్గిస్తుంది. శబ్దములో సౌందర్యం, అర్థములో శిల్పం, భావంలో శిల్పసౌందర్యం ఉట్టిపడి, పూర్ణరూపంలో సౌందర్య శిల్పంగా గోచరిస్తుంది కావ్యం. సజీవ శిల్పసుందరిగా దర్శనమిస్తుంది. కనుకనే కావ్యాన్ని కాంతా సమ్మితము అన్నారు.

వేదము ప్రభుసమ్మితము. నీవు ఆచరించవలసిన దానిని సాధికారికంగా ప్రభువువలె శాసిస్తుంది వేదము. వేదమును తిరిగి ప్రశ్నించే అవకాశ ముండదు. చేసి తీరవలసిందే. అందుచేత వేదమును ప్రభుసమ్మితము అన్నారు.

పురాణములు మిత్రసమ్మితాలు. కథల ద్వారా, ఉపాఖ్యానాలద్వారా ధర్మాధర్మములను, కృత్యాకృత్యములను స్నేహితునివలె వివరిస్తాయి. అవియే భాగవతాది పురాణాలు. మిత్రుని వలె వివరించే ప్రజ్ఞ, ప్రేమ గలవి.

కావ్యాలు కాంతాసమ్మితాలు. భార్య భర్తను తన ప్రియవాక్కుల ద్వారా సన్మార్గమునకు త్రిప్పునట్లు, కావ్యము ప్రేమమయ వచనములతో జీవులను తృప్తిపరచి, సత్యమార్గమున పయనించునట్లు చూస్తుంది.

శ్రీమద్రామాయణము కావ్యములలో మొదటిది. అందుచేత ఇది ఆదికావ్యమని ప్రసిద్ధికెక్కింది. దీనిని రచించిన సిద్ధహస్తుడు వాల్మీకి అగుటచేత ఆయన ఆదికవి అని కీర్తించబడ్డాడు.

"రామాయణాన్ని శ్లోకరూపంలో రచిస్తాను" అన్నాడు వాల్మీకిమహర్షి. 'శ్లోక' శబ్దమునకు యశస్సు అని కూడా అర్థము. కనుకనే పురుషోత్తముడైన పరమాత్మ పుణ్యశ్లోకుడని కీర్తించబడ్డాడు. ఉత్తమ కీర్తిగల పరంధాముడుగా శ్లాఘింపబడ్డాడు.

శ్లోకరూపుడైన భగవానుడు దివ్యకీర్తితో శోభిస్తున్నాడు. అట్టి పరమాత్మ గాథను భవ్యంగా రచించిన వాల్మీకి కీర్తి శాశ్వతంగా అలరారుతూ ఉంది. శ్లోక రూపమైన ఈ రామాయణ గాథను పఠించువారు కూడా వైభవంతో శోభిస్తారు అని వేరుగా చెప్ప పనిలేదు.

భరద్వాజాదులు 'మానిషాద' అని వాల్మీకి పలికిన ఆదిశ్లోకాన్ని పదే పదే గానం చేస్తున్నారు. ఒక చెవిలో శ్లోక పారాయణము నిలిచి ఉంది. మరొక చెవిలో బ్రహ్మదేవుని వాక్కులు ప్రతిధ్వనిస్తున్నాయి వాల్మీకిమహర్షికి. వెంటనే కళ్ళుమూసికొని అంతర్ముఖుడయ్యాడు. తన నారదమహర్షి చెప్పిన రామకథ హృదయ తెరపై చలనచిత్రము వలె కదలసాగింది. తన నుండి అప్రయత్నంగా కదలిన 'మా నిషాద' శ్లోకం మనోఫలకంపై రమ్యాక్షరాలతో గోచరిస్తూ ఉంది.

ఈ శ్లోకం వాల్మీకి ముఖత: వెలువడింది. కానీ బ్రహ్మదేవుని సంకల్పముచేత అభివ్యక్తమైంది. అలాంటి శ్లోకంలో శాపాలు, క్రోధాలు ఎలా ఉంటాయి? శాపాలు, పాపాలు మంగళాచరణములు అవుతాయా? ఇందులో ఏదో రహస్యముంది. విశేషాంశాలు దాగున్నాయి. ఈ దృక్పథంతో ఆలోచించిన పుణ్య శీలురైన మన పూర్వీకులకు ఆశ్లోకంలో దివ్యమైన, భవ్యమైన రామకథ గోచరించింది. ఈ సంకల్పంతో 'మానిషాద' శ్లోకం మంగళాచరణశ్లోకంగా మారిపోయింది.

**మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః**
**యత్ క్రౌఞ్చ మిథునా దేక మవధీః కామమోహితమ్॥**

"ఓ బోయవాడా! నీవు క్రౌంచపక్షుల జంటనుండి కామమోహితమై యున్న ఒక పక్షిని కొట్టి చంపావు. నీవు ఎక్కువ కాలము జీవించకుందువు గాక!"

ఈభావాన్ని చెప్పే పైశ్లోకానికి మొదట ప్రతిపదార్థాన్ని కూడా అందించడం జరిగింది. కిరాతుని పాపమును చూసి కలత చెందిన వాల్మీకి పెట్టిన శాపం అది. కానీ ఈ మంగళశ్లోకము యొక్క అర్థాన్ని ప్రస్తుతం మనం అధ్యయనంచేస్తున్న దృక్కోణం నుండి దర్శిద్దాం.

మా=లక్ష్మీదేవికి, నిషాద=నివాస స్థానమైనవాడా!, త్వం=నీవు, యత్=ఎందువలన, క్రౌఞ్చ మిథునాత్=వక్రంగా చరించే రాక్షస దంపతుల నుండి, కామమోహితమ్=కామ వశుడైన, ఏకం=ఒకడైన రావణుని, అవధీ:=వధించితివో, (తత్=అందువలన) శాశ్వతీస్సమా:=చాలా సంవత్సరములు, ప్రతిష్ఠాం=వైభవమును, అగమ:=పొందితివి.

"హే లక్ష్మీనివాసా! శ్రీనివాసా! రావణ మండోదరులనే రాక్షస దంపతుల నుండి కామ పరవశుడైన రావణుని వధించావు. నీవు శాశ్వతమైన కీర్తిని పొందినావు"



బ్రహ్మదేవుని సంకల్పముచే మహర్షి ముఖమునుండి బహిర్గతమైన ఈ శ్లోకములో బాహ్యార్థమున బోయవానిని శపించినట్లు ఉన్నది. అంతరార్థమును వీక్షించినచో శ్రీరామునకు స్వస్తి పలుకుట జరిగింది. మహర్షుల మాటలలోని దివ్యభావాలు ఇలా ఉంటాయి.

## ఆదికావ్యం - ఆవిర్భావం

రామకథను వ్రాయుటకు వాల్మీకి ఉపక్రమించాడు. నారదుడు తనకు చెప్పిన దానికంటె ఎక్కువగా ఏమైన రామచరితము ఉన్నదా? అనెడి శంక కదిలింది. వెంటనే ధ్యానమగ్నుడయ్యాడు. రామచరితము నంతయూ తెలుసుకున్నాడు. యోగదృష్టిచేత రామకథకు సంబంధించిన విషయము లన్నిటినీ **"పాణావామలకం యథా"** అరచేతిలోని ఉసిరికాయను చూచినట్లు దర్శించాడు. రామకథను వ్రాయడానికి పూనుకున్నాడు.

**కామార్థగుణ సంయుక్తం ధర్మార్థ గుణ విస్తరమ్**
**సముద్ర మివ రత్నాఢ్యం సర్వశ్రుతి మనోహరమ్**

కామార్థములు అనే పురుషార్థములతో కూడి, ధర్మ ప్రధానమైన గుణములతో విస్తరించునట్లు, రత్నాలతో నిండియున్న సాగరం వలె శోభించునట్లు, సర్వుల వీనులను, మేనులను, మనములను ఆకర్షించునట్లు, వేదసార సంగ్రహరూపమైన రామకథను మనోహరంగా రచించాడు వాల్మీకిమహర్షి.

రాముడు రాజ్యము నేలుచున్న కాలంలోనే వాల్మీకి శ్రీమద్రామాయణమును రచించాడు. రామాయణంలోని శ్లోకాలు ఇరవైనాలుగువేలు. సర్గలు ఐదువందలు. ఉత్తరకాండతో కలిపి ఏడు కాండలు.

రామాయణం పూర్తయింది. దానిని అభ్యసించి ఆలపించువారు ఎవరా? అని వాల్మీకి ఆలోచించసాగాడు. వాల్మీకి ఇలా ఆలోచిస్తూ ఉండగా మునివేషధారులైన గాయకులగు కుశలవులు వచ్చి మహర్షి పాదములపైబడి నమస్కరించారు.

కుశలవులు ధర్మజ్ఞులు. యశోవంతులు. తియ్యనిగొంతు కలవారు. ఆశ్రమవాసులు. పైగా సోదరులు. వాల్మీకి తాను రచించిన రామాయణాన్ని వారికి ఉపదేశించాడు.

రామకథ చదవడానికి అనువుగా ఉంది. పాడటానికి అనుకూలంగా ఉంది. ఇందులో నవరసాలు పుష్కలంగా ఉన్నాయి. కుశలవులు సంగీతము కూడా బాగా తెలిసినవారు.

ఒకనాడు పవిత్రాత్ములైన కొందరు ఋషులు ఒకచోట కూర్చునియుండగా కుశలవులు రామాయణాన్ని సుశ్రావ్యంగా గానం చేశారు. కుశలవులు గానం చేసిన రామకథను ఆలకించిన ఋషులు పరవశులైనారు. ముగ్ధులై ఆనందబాష్పాలు రాల్చారు.

కథవిని లాభంలేదు. హృదయంలో పవిత్రభావాలు మొలకెత్తినపుడే కథను వినిన దానికి సార్థకత. భగవత్కథాశ్రవణము నందు ఎవరినేత్రాలు చెమ్మగిల్లుతాయో వారే ఉత్తమ భక్తులు.

**సాధు సాధ్వితి తా వూచుః పరం విస్మయ మాగతాః**

కుశలవుల రామాయణ కథా గానమును ఆలకించిన ఋషులు విస్మయమొందినవారై "బాగు-బాగు" అని మెచ్చుకున్నారు.

"ఏమి శ్లోకాలు! ఏమి గానం! ఎప్పుడో జరిగిన కథ అయినా కండ్లకు కట్టి నట్లున్నది," అని మహర్షులు ప్రశంసించారు. ఒక మహర్షి తనసంతోషమును ప్రకటిస్తూ కుశలవులకు ఒక కలశమును బహూకరించాడు. మరియొక మహర్షి ఆనందముగ్ధుడై నారచీరను ఇచ్చాడు.

ఆశ్చర్యకరమైన ఈ ఆదికావ్యం రాబోవు కవులకు మార్గదర్శిగా శోభించింది. వాల్మీకి రచించిన ఈ రామకథను వీధులందు, రాజమార్గములయందు నిలబడి కుశలవులు గానం చేయసాగారు.

బ్రతుకుకు పుష్టిని కల్గించే రామకథను కుశలవులు వీధులలో నిలబడి గానం చేశారు. భక్తికి బిడియం లేదు. బహిరంగంగా భగవత్కార్యమును నిర్వహించుటలో భక్తులు నిజతృప్తిని పొందుతారు.

నేటి నాగరికులలో బహిరంగంగా భక్తిచేయడం దోషంగా పరిణమించింది. ఇదొక దురదృష్టకర పరిణామం. ముఖాన బొట్టును ధరించాలంటే బిడియం. నలుగురు చూస్తుండగా సంకీర్తన చేయాలంటే అవమానం. పదుగురి ముందు రెండుచేతులెత్తి భగవంతునికి నమస్కరిస్తే ఏదో కొంప మునుగుతున్నట్లు ముఖంలో ముడతలు, మడతలు పేర్చుకుంటూ ఉంటారు.

భక్తిని గూర్చి వినడం తేలికే. కాని భక్తి చేయడం కష్టం. జపం చేయకపోతే జీవితం బాగుపడదు. భక్తిలేని బ్రతుకు చక్కబడదు. భగవంతుని కీర్తించడం అలవరచుకోవాలి. ప్రపంచాన్ని గూర్చి ముచ్చటించడం వల్ల మనసుపాడై ఉంది. పరమాత్మను గూర్చి పలకడానికి నాలుక సిద్ధపడితే బ్రతుకు బాగుపడుతుంది.

ఇతరులను నిందించి మనం ఎంతో పాపాన్ని సంపాదించుకొనియుంటాం. అబద్ధాలు చెప్పి, అక్రమాలు చేసి, అన్యాయాలు ప్రదర్శించి మోయలేని పాపపు మూటలను తయారు చేసికొని ఉంటాము. ఇవే బ్రతుకులో బరువులు. అజ్ఞానం చేత ఈ బరువులే బాధ్యతలుగా తెలుస్తుంటాయి.

మన ద్వారా ఒకరికి జరిగిన అన్యాయం వలన కలిగే పాపము, మరొకరికి భగవద్భక్తిని బోధించి,వారిని సంతృప్తి పరచుట ద్వారా ఉపశమిస్తుంది. అలౌకిక భాషణము మనసును పవిత్రం చేస్తుంది.

కుశలవులు ఒకనాడు రామకథను రాజమార్గాల్లో గానం చేస్తూ ఉండగా రాముడు చూశాడు. వారిని రాజగృహమునకు పిలిపించుకున్నాడు. వారిని గౌరవించాడు.

నిండు కొలువున సింహాసనారూఢుడై ఉన్న శ్రీరాముడు ప్రజలనుద్దేశించి, "జనులారా! వీరు మునిబాలురవలె ప్రకాశించుచున్నను రాజలక్షణాలతో శోభిస్తున్నారు. వీరు గాయకులవలె తెలియుచున్నను గొప్ప తపస్సంపన్నులు. వీరి గానము నాకు కూడా సుఖంగా ఉంటుంది. మీరూ వినండి" అన్నాడు.

కుశలవులు వీణతాళాదులను అనుకూలంగా చేసికొని శ్రుతిసుఖముగ రామకథను గానం చేయసాగారు. జనులందరు మంత్రముగ్ధులై ఆలకిస్తున్నారు. ప్రజలంతా పరవశిస్తున్నారు. పండితులు ప్రశంసిస్తున్నారు. రామకథాగానం సాగుతూ ఉంది.



## అందమైన అయోధ్య

కోసలదేశానికి రాజధాని అయోధ్య. జయించుటకు శత్రువులకు సాధ్యముకానిది అయినందున ఆ పట్టణము అయోధ్య అని పిలువ బడింది. అయోధ్య సరయూనదీ తీరాన ఉంది.

పూర్వం బ్రహ్మదేవుని సంకల్పము వలన కైలాసంలో ఒక సరస్సు వెలిసింది. మనో సంకల్ప ప్రభావముచేత ప్రభవించినందున దానికి మానససరోవరం అనే పేరు కల్గింది. ఆ సరోవరమునుండి ఒక పాయ వేరుగాప్రవహించింది. అదియే సరయూ నదియై అయోధ్యను ఆనుకొని ప్రవహిస్తూ ఉంది.

కోసల దేశంలోని నగరాలు అన్నిటిలో అయోధ్య చాలా అందమైనది. మనుచక్రవర్తి స్వయంగా నిర్మించిన నగరం అయోధ్య. దాని పొడవు పండ్రెండు యోజనాలు. వెడల్పు మూడు యోజనాలు.

నగర వీధులన్నీ విశాలంగా తీర్చిదిద్ది ఉంటాయి. వీధులన్నీ నీటితో తడిపి, ముగ్గులతో, పూలతో అలంకరిస్తూ ఉండేవారు.

ఈ అయోధ్యానగరానికి అధిపతి దశరథుడు. అమరావతిలో దేవేంద్రుడు శోభించునట్లు, అయోధ్యలో దశరథుడు ప్రకాశించేవాడు. ఆయన ధర్మాత్ముడు. తేజోవంతుడు.

గొప్ప సంపదతో, అసమాన శోభతో అయోధ్య అలరారు చుండేది దశరథుని పరిపాలనలో. కోట బురుజులు, ధ్వజములు చాలా ఎత్తుగా ఉండేవి. విశాలమైన ఆ పట్టణానికి బలమైన ప్రాకారం ఉండేది. స్త్రీలకు వడ్డాణము లాగ నగరానికి ప్రాకారము భాసిస్తూ ఉండేది.

ఆ పట్టణము చుట్టూ అగాధమైన అగడ్త ఉండేది. అందుచేత దురాక్రమదారులు అంత తేలికగా ప్రవేశించలేరు. ఆ నగరమంతా రత్నఖచితమైన మేడలే ఉండేవి. ఏడు అంతస్తుల భవనాలు ఉన్నట్లు వాల్మీకి రామాయణంలో వర్ణించాడు.

**గృహ గాఢా మవిచ్ఛిద్రాం సమభూమౌ నివేశితామ్**
**శాలి తణ్డుల సంపూర్ణా మిక్షుకాణ్డ రసోదకమ్**

అయోధ్యలో దట్టమైన ఇండ్లు ఉండేవి. నిరుపయోగమైన స్థలము కనిపించేది కాదు. భూమి మిట్టపల్లాలు లేకుండా సమంగా ఉండేది. వరిధాన్యము పుష్కలముగా లభిస్తూ ఉండేది. నీరు చెఱకురసమువలె తియ్యగా ఉండేది.

మనుష్యులు ఉత్తములు. నగరములో సదా మంగళవాద్యములు మిన్నుముట్టు చుండేవి. అయోధ్యకంటెను ఉన్నతమైన పట్టణము భూలోకమున లేదని చెప్పుకొనేవారు.

## అయోధ్యలో ఆదర్శం

రాజునుబట్టే ప్రజలు. రాజు యోగ్యుడైతే ప్రజలు యోగ్యులు అవుతారు. ధర్మాత్ముడు, తాత్త్వికుడు గాని రాజు ప్రజల పాలిటి దురదృష్ట మనాలి.

అయోధ్య దశరథుని రాజధాని. జనులందరిని దశరథుడు కన్నబిడ్డలవలె పాలించేవాడు. అతడు వేదవిదుడు. దూరదృష్టి కలవాడు. సామాన్య పౌరుల నుండి జానపదులవరకు అందరికీ అతడు ప్రాణతుల్యుడు. లోకకళ్యాణమును ఆశిస్తూ అనేక యాగాలు చేశాడు. ధర్మశీలుడు. రాజువైనను ఋషిలా జీవించాడు.

ధనమున్నా గర్వంలేదు. పరాక్రమమున్నా అహంకారం లేదు. సమ్మితుడు. తన పరిపాలనలో మనువునే మరపించాడు. రాజు ఆదర్శంగా ఉండేవాడు. ప్రజలు రాజును ఆదర్శంగా తీసికొని జీవించేవారు. ఈ విధమైన వ్యక్తిగత ఆదర్శజీవనం సమాజ అభ్యుదయానికి దారితీసేది.

దశరథునకు ఎనమండుగురు మంత్రులుండే వారు. వసిష్ఠుడు, వామదేవుడు అను ఇద్దరు పురోహితులు ఉండేవారు. జాబాలుడు మొదలైన ఋత్విక్కులుండేవారు.

మంత్రులు పాలనాకార్యములు, లౌకిక వ్యవహారాలు చూచేవారు. పురోహితులు వైదిక కర్మలను నిర్వర్తించేవారు. వసిష్ఠాదులు అవసరాన్ని బట్టి వ్యవహరిస్తూ సలహాలిస్తుండేవారు.

దశరథుని మంత్రులు విద్యావంతులు. వేలిముద్ర వేల్పులు కారు. వ్యవహారముల యందు శుచి కలిగి నీతిగా వ్యవహరించేవారు. ఇంద్రియ నిగ్రహం కలవారు. శాస్త్రజ్ఞులు. ఏకాగ్రత కలవారు. త్రికరణశుద్ధిగా వర్తించేవారు. **"స్మిత పూర్వాభి భాషిణః"** చిరునవ్వుతో పలకరించేవారట.

కోపము వచ్చినను , కోరిక కదలినను, ధనము అవసరమైనను అబద్ధములు చెప్పేవారు కారట. తమ బిడ్డలు తప్పులు చేసినా మరో ఆలోచన లేకుండా మంత్రులు దండించేవారు. తప్పుచేయనిచో శత్రువును కూడా దండించేవారు కారు.

**శుచీనాం రక్షితారశ్చ నిత్యం విషయ వాసినామ్**

దేశములోని సత్పురుషులకు ఏవిధమైన బాధలు కలుగకుండ ఎల్లప్పుడు రక్షిస్తుండేవారు.

మంత్రులందరు ఐకమత్యముతో జీవిస్తూ రాజ్య వ్యవహారములను పరిరక్షించేవారు. రాజు ఆదర్శ ప్రాయుడు. రాజుగారి బాటలో ఆదర్శజీవనమును మంత్రులు సాగించేవారు. అందువలన అయోధ్య అమరావతిగా శోభిల్లింది. దశరథుడు మహేంద్రుని వలె ప్రకాశించాడు.

## అయోధ్యలో అభ్యుదయం

రాజు, మంత్రులు ఆదర్శమును అందించుట చేత ప్రజలు వారిని అనుసరించారు. అనుకరించారు. ఆదర్శంగా జీవించారు. సమాజంలో అభ్యుదయాన్ని సాధించారు.

అయోధ్యలో ప్రజలు అసత్యము లెరుగరు. సదా సంతుష్టచిత్తులై ఉండేవారు.తృప్తిగా కనిపించేవారు. శాస్త్రములను అధ్యయనం చేసేవారు. ఆశలు లేనివారు.

స్త్రీపురుషులు ఇంద్రియనిగ్రహము కలిగి యుండేవారు. సాధువులవలె నిర్మలంగా ఉండేవారు. ఐశ్వర్యము, సౌందర్యము, రాజభక్తి లేనివారు కనిపించేవారు కారు.

ఆకలితో అలమటించేవారు, దానము చేయనివారు, ఇంద్రియ నిగ్రహము లేనివారు, పరుల భార్యలను ఆశించువారు, నాస్తికులు, అసూయాపరులు, అసమర్థులు, దీనులు,



దుఃఖభాగులు, యోగము చేయనివారు, దొంగలు, నీచులు, లోభులు, క్రూరులు, విద్యాహీనులు దివిటీనెత్తి వెదికినా అయోధ్యలో గోచరించేవారుకారని వాల్మీకిమహర్షి బాలకాండ ఆరవసర్గలో రచించారు.

దశరథుని కాలంలో ప్రజలకు హక్కుల మీదకన్నా బాధ్యతల మీద ఆసక్తి ఎక్కువగా ఉండేది. అలాంటి సమాజాన్ని ఈనాడు మనం ఊహించలేము. కానీ ఒక్కమాట ధైర్యంగా చెప్పవచ్చు. దశరథుని వంటి రాజు, సుమంత్రుడులాంటి మంత్రులు, వసిష్ఠ వామదేవులవంటి గురువులు లభిస్తే నేడు కూడా రామరాజ్యాన్ని దర్శించవచ్చు, అనుభవించవచ్చు. ఆ రోజులు రావాలని అందరమూ శ్రీరాముని ప్రార్థిస్తాం. వాటిని సాధించేందుకు ఆదర్శంగా జీవిస్తాం.

## అసంతృప్తి - అశ్వమేధం

మనిషికి మనసుందని అందరికీ తెలుసు. అది ఎంత విచిత్రమైనదో ఎవరికి తెలుసు? ఎందరికి తెలుసు? కదలనట్లే ఉంటుంది. కదిలిందా, గాలికన్నా వేగాన్ని పుంజుకుంటుంది.

జీవికి ఎన్నో జన్మలు. కానీ అన్ని జన్మలలో కలిసి నడిచే మనసు ఒక్కటే. మనసుకు ముసలితనం తెలియదు. వయసు మరలినా మనసు పాతపడదు. మమతలను పెంచుకుంటూనే ఉంటుంది.

మనసు నిండుతనం ఎరుగదు. ఎన్నుండినా తృప్తి చెందదు. కోరిక బీజాల్ని నాటి, కర్మ వృక్షాలను పెంచి, అనిత్య ఫలాలను ఆరగించి, అసంతృప్తితో అలమటించేందుకే మనసు అలవాటు పడింది.

మనిషికి మనసుకి వీడని, వాడని బంధం ఉంది. ఈ బంధమే బ్రతుకులో అందాన్ని దూరం చేస్తుంది. అగాధాన్ని సృష్టిస్తుంది. మమతల్ని కౌగిలించుకుంటుంది. బ్రతుకును మారణహోమంగా మార్చుతుంది.

ఎన్నుండి ఏంలాభం? ఏదో లేదనే బాధే మనసుకు నేస్తం. ఉన్నవాడికి ఉండి సుఖంలేదు. లేనివాడికి లేక సుఖంలేదు. లేనివాడు లేనిదానిని గూర్చి పరితపిస్తూ ఉంటే, ఉన్నవాడు ఆ ఉన్నది ఎప్పుడు ఊడిపోతుందో అని పలవరిస్తూ ఉంటాడు.

ఈ ద్వంద్వాల మధ్య అందాలెలా ఉంటాయి? ఆనందాలెలా మిగుల్తాయి? ద్వంద్వాలన్నీ మనస్సు యొక్క చిత్రాలేనని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు. మనసు లేకపోతే మనిషికి మనుగడ లేదు. మనసు ఉన్నంత వరకు మనిషికి సుఖం రాదు. ఇది మనసుకి అర్థం. ప్రాణికోటి ప్రారబ్ధం.

సర్వసంపదలతో, సౌఖ్యాలతో తులతూగుచున్న దశరథునకు సంతానం కలుగలేదు. అదొక తీరని కొరతగా, ఆరని బాధగా దశరథునిలో నిలిచిపోయింది.

పూర్వం ఎప్పుడో ఎక్కడో తెలియక చేసిన పాపానికి ఈ బాధ, దుఃఖం ఫలరూపమని దశరథుడు గ్రహించాడు. ఈ సమస్త పాపములను పోగొట్టుకొని సంతానమును పొందుటకు అశ్వమేధయాగం చేయాలని నిశ్చయించుకున్నాడు.

తన సంకల్పాన్ని మంత్రులకు, హితులకు, పురోహితులకు తెలిపాడు దశరథుడు. పుత్రులు లేరని దుఃఖపడుతున్న తనకు అశ్వమేధయాగం చేయాలనే అభిలాష కలిగిందని వారికి చెప్పాడు. వారి ఆశీస్సులను పొందాడు.

దశరథుడు తన భార్యలను సమీపించి "నేను యజ్ఞముచేయ సంకల్పించాను. మీరు దీక్ష వహించండి" అని పలికాడు. ఆయన పలుకులు రాణులకు హృదయానందమును కలిగించాయి. మంచు తొలగినపుడు కమలములు శోభించునట్లు వారి ముఖకమలములు ప్రకాశించాయి.

మంత్రియైన సుమంత్రుడు దశరథుని సమీపించాడు. రహస్యంగా తన అభిప్రాయాన్ని రాజుగారి ముందు ఉంచాడు.

"మహారాజా! అంగదేశంలో ఋష్యశృంగుడు అనే మహాత్ముడు ఉన్నాడు. బ్రహ్మచర్యవ్రతాన్ని పాటించి ప్రకృతిని తన వశంచేసుకున్న మహితాత్ముడాయన. ఆయన తలపెట్టిన కార్యము విఫలంకాదు. ఆ మహాత్ముని ఆధ్వర్యంలో అశ్వమేధ యాగాన్ని నిర్వహిస్తే బావుంటుంది అని నా అభిప్రాయం. అంతేకాదు. అశ్వమేధంతో పాటు పుత్ర కామేష్టి యాగాన్నికూడా తలపెడితే మంచిది. ఋష్యశృంగుడు పవిత్రాత్ముడు. ఆయన అనుగ్రహం చేత మీరు సంతానవంతులు కాగలరు. ఋష్యశృంగుని వైభవమును సనత్కుమార మహర్షి చెప్పగా నేను వినియున్నాను" అని సుమంత్రుడు దశరథునితో చెప్పాడు.

సుమంత్రుని సలహా దశరథునికి తృప్తి నిచ్చింది. ఋష్యశృంగుని ఆహ్వానించడానికి దశరథుడు నిర్ణయించుకున్నాడు. అంగరాజ్యానికి తానే స్వయంగా వెళ్ళి ఋష్యశృంగుని ఆహ్వానించాలని దశరథుడు సంకల్పించాడు. సన్నాహాలు ప్రారంభమయ్యాయి.

## ఋత్విజుడైన ఋష్యశృంగుడు

విభండకమహర్షి ఒక కాలమున కఠోరముగ తపస్సు చేశాడు. ఒకనాడు ఆమార్గమున ఎచ్చటికో పోవుచున్న ఊర్వశిని చూచి విచలిత మనస్కుడయ్యాడు విభండకుడు. ఆమె అందానికి ముగ్ధుడైన విభండకుడు ఏకాగ్రతను కోల్పోయాడు. అతని మనసు చలించింది. వీర్యస్ఖలనము జరిగింది. ఆ వీర్యాన్ని విభండకుడు జలాశయమున ఉంచాడు. ఆ జలాశయము వద్దకే వచ్చిన లేడి వీర్యయుక్తమైన ఆ జలమును పానం చేసింది. గర్భవతియై మానవరూపంగల శిశువును ప్రసవించింది. శిశువు శిరమున ఒక కొమ్ము మొలిచియుండింది.

విభండకుడు ఆశిశువును చూచి, వెంట తీసికొనివచ్చి, గారాబముగ పెంచి, తలపై కొమ్ము ఉన్నందున ఋష్యశృంగుడని నామకరణం చేశాడు.

బిడ్డను బ్రహ్మజ్ఞానిని చేయాలని విభండకుడు సంకల్పించాడు. మనసులో నిలిచియున్న ప్రాపంచిక వాసనలు తపస్సులో విఘ్నములను సృష్టిస్తాయని విభండకుడు తన అనుభవంలో గ్రహించినవాడు. అందుచేత తనబిడ్డడు అలాంటి బలహీనతలు లేనివాడైనచో, నిర్విఘ్నముగ తపమాచరించి తరించగలడని భావించిన విభండకుడు ఋష్యశృంగునికి ప్రపంచవాసన పట్టకుండా పెంచాడు.



తన జీవితానుభవ దృక్కోణంనుండి పరిశీలించి విభండకుడు బిడ్డను అలాపెంచాడు. మన అనుభవమును జ్ఞానముగా దర్శించడం కన్నా-జ్ఞానమును అనుభవంగా పొందేందుకు యత్నించడం మంచిది. ఋష్యశృంగుని పరిస్థితులకు దూరంగా తీసుకొని వెళ్ళాడు విభండకుడు. అలాగాకుండా ప్రవర్తన ద్వారా పరివర్తన తెచ్చిఉంటే చాలా బావుండేది. పతనమేమిటో తెలియకుండా జీవించడంకన్నా పతనం తెలిసి పతనం గాకుండా ఉండడమే విశేషం.

**The happiness of a man in this life does not consist in the absence but in the mastery of his passions.**

"మోహాలను మరుగుపరచడం కాకుండా వాటిపై ఆధిపత్యాన్ని సాధించడంలోనే మనిషి జీవితంలో సుఖపడతాడు". అంటాడు టెన్నీసన్.

ఋష్యశృంగుడు అరణ్యాలలోనే సంచరించే వాడు. తపస్సు, స్వాధ్యాయముల యందు నిరతుడై ఉండేవాడు. స్త్రీలను చూసి ఎరుగడు. భోగములు తెలియనివాడు. పట్టణాలున్నాయని, అక్కడ కుటుంబాలు ఉంటాయని, వస్తువులు ఉంటాయని, విషయ సుఖాలు ఉంటాయని ఋష్యశృంగునికి తెలియనే తెలియదు.

అంగదేశమును ఆ సమయమున రోమపాదుడు పాలిస్తూ ఉండేవాడు. అనావృష్టి కారణంగా అంగదేశమున క్షామమేర్పడింది. మహాత్ముడు, పవిత్రాత్ముడు అయివ ఋష్యశృంగుడు పాదము మోపినచో వర్షాలు పడతాయని విద్వాంసులు రోమపాదునికి చెప్పారు.

రోమపాదుడు ఋష్యశృంగుని ఆహ్వానించమని అనుజ్ఞ నొసగినాడు. విభండకుడు ఋష్యశృంగుని విడిచిపెట్టడు. మరి ఋష్యశృంగుని అంగదేశానికి ఎలా తీసికొని రావాలి? దానికి ఆస్థానములోని పెద్దలు ఒక పథకాన్ని తయారు చేశారు. అందమైన నర్తకీమణులను అరణ్యమునకు పంపారు. ఋష్యశృంగుని మభ్యపెట్టి, మనసును మరలించి, అంగదేశమువైపు ఆ మహాత్ముని అడుగులు కదులునట్లు చూడమని చెప్పారు.

గణికలు అందముగా అలంకరించుకున్నారు. అరణ్యమునకు వెళ్ళారు. ఋష్యశృంగుని ఆశ్రమ పరిసరాల్లో మకాంపెట్టారు. ఋష్యశృంగుడు ఒకనాడు వారిని చూడటం జరిగింది.

మధుర స్వరములతో గానం చేస్తూ ఆ స్త్రీలు నృత్యం చేయసాగారు. ఋష్యశృంగుని నేత్రాలు ప్రథమంగా స్త్రీలను చూశాయి. చెవులు ప్రప్రథమంగా స్త్రీల స్వరాన్ని విన్నాయి. అయినా ఋష్యశృంగుడు చలించలేదు. ఇంద్రియాలు ప్రవేశించినా అమాయకమైన అతని మనస్సు ఇంద్రియాలకు తోడుగాకపోవడమే ఆయన ఉదాసీనతకు కారణము.

నర్తకీమణులు ఋష్యశృంగుని సమీపించారు. కుశల మడిగారు. ఆయనమగూర్చి వివరాలు తెలుసుకున్నారు. అమాయకుడైన ఋష్యశృంగుడు అతివలను ఆశ్రమానికి ఆహ్వానించాడు.

**ఇహాశ్రమ పదోఽస్మాకం సమీపే శుభదర్శనాః**
**కరిష్యే వోఽత్ర పూజాం వై సర్వేషాం విధిపూర్వకమ్ ॥**

"శుభదర్శనులారా! మా ఆశ్రమము ఇక్కడే ఉంది. చాలా సమీపంలో ఉంది. మీరు నాతో రండి. యథావిధిగా నేను మిమ్మల్ని సత్కరిస్తాను" అన్నాడు ఋష్యశృంగుడు.

పితృసేవ చేసుకుంటూ ఋష్యశృంగుడు అరణ్యంలో ఏకాకిగా జీవిస్తున్నాడు. మాయలు, మర్మాలు, మమతలు, మోహాలు తెలియనివాడు. కనుకనే స్త్రీలతోభాషిస్తూ, "సర్వేషామ్" అని పుంలింగమును ప్రయోగించాడు. స్త్రీపురుష భేదాలు కూడా తెలియని పావనాత్ముడు. పసిబిడ్డలాంటివాడు.

బిడ్డ అగ్నిని పట్టుకుంటే కాలకుండా ఉంటుందా? పసిబిడ్డ అని అగ్నిహోత్రుడు జాలి చూపుతాడా? ప్రకృతిధర్మాలు బలీయమైనవి. తెలిసినా, తెలియకపోయినా ముట్టుకుంటే చాలు. మరీ పట్టిపట్టి ఏడిపిస్తాయి.

ఋష్యశృంగుడు గణికలను ఆహ్వానించాడు. వారితోపాటు మోహరాక్షసి కూడా ప్రయాణమైంది. ఆశ్రమం చేరారు.

అర్ఘ్యపాద్యాదులను సమర్పించి, ఆరగించమని కందమూల ఫలాదులను ఇచ్చాడు ఋష్యశృంగుడు. గణికలు స్వీకరించారు. ఆనందించారు.

"మిత్రుడా! నీవిచ్చిన ఫలాలు మేము ఆరగించాము. మాదగ్గరకూడా కొన్ని ఫలాలున్నాయి. అవి నీవు ఆరగించు" అని తమతోపాటు తెచ్చిన పిండివంటలు, మిఠాయీలు ఋష్యశృంగునికి ఇచ్చారు.

ఋషికుమారుడు వాటిని ఆరగించాడు: గతంలో పిండివంటలు అతడు ఎరుగడు. "చాలా బాగున్నాయి ఈ ఫలములు-చాలా రుచిగా ఉన్నాయి" అంటూ లొట్టలేస్తూ మ్రింగాడు.

గణికలు మధ్యమధ్యన అతణ్ణి కౌగిలించుకోసాగారు. వారి చెక్కిళ్ళతో అతని పెదవులను స్పృశించారు. చెవిలో అవ్యక్తమైన, అగ్రాహ్యమైన ప్రియ భాషణలు వినిపించసాగారు. ఋష్యశృంగుడు ఏదో అవుతున్నాడు.

"మా ఆహ్వానం మేరకు మేము మీ ఆశ్రమానికి వచ్చాము గదా! మా ఆహ్వానాన్ని మన్నించి మీరు మా ఆశ్రమానికి రావాలి" అని గణికలు ఋషి కుమారుని చేయిపట్టుకొని లాగుతున్నారు.

'సరే' నంటూ ఋష్యశృంగుడు వారిని అనుసరించాడు. గంగానదిని సమీపించారు. నావ నెక్కారు. అంగదేశం చేరారు. ఋష్యశృంగుడు అంగదేశములో కాలుమోపాడు. అంతే వరుణుడు వర్షించడం ప్రారంభించాడు.

సాధువు పాదం మోపిన చోట ప్రవచన మేఘం గర్జించక పోతుందా? జ్ఞానవర్షం ముముక్షుజన హృదయసీమలను తడపకుండా వుంటుందా?

రోమపాదమహారాజు ఋష్యశృంగుని ఆహ్వానించాడు. వినమ్రుడై సాష్టాంగ దండ ప్రణామము చేశాడు. తప్పిదమును మన్నించమని ప్రార్థించాడు. తన కుమార్తె శాంతను ఋష్యశృంగునికిచ్చి వివాహం చేశాడు.

విధి బలీయమైంది. అరణ్యాలకు వెళ్ళినా ఆగామి తయారు కాదనే నమ్మకంలేదు. నేటి కర్మలెలా ఉన్నా, ఒకనాటి వాసనలు, కర్మఫలాలు నీడలా వెంటాడుతూనే ఉంటాయి.



ప్రారబ్ధాలు అవసరాల్ని సృష్టిస్తాయి. సమస్యల్ని పల్లవింపచేస్తాయి. పవిత్రమైన పురుషార్థం ద్వారా బ్రతుకుల్ని శుద్ధిచేసుకోవాలి. ఋష్యశృంగుడు అదే చేశాడు. హృదయంలో లేచిన పొంగును ధర్మముడితో పవిత్రం చేసుకున్నాడు.

ఇది ఋష్యశృంగమహర్షి గాథ.

"మహారాజా! మహాత్ముడైన ఋష్యశృంగ మహర్షి ఆధ్వర్యములో అశ్వమేధ, పుత్రకామేష్టి యాగాలను నిర్వహిస్తే మీకు సంతానప్రాప్తి కలుగుతుందని నా అభిప్రాయము" అని సుమంత్రుడు దశరథునితో చెప్పాడు.

దశరథుడు సుమంత్రుని సలహాను శిరోధార్యంగా భావించాడు. అమాత్యులతో కలిసి ఋష్యశృంగుని ఆహ్వానించుటకు అంగదేశానికి స్వయంగా బయలుదేరాడు. వనాలను, నదులను దాటుచు అంగదేశము చేరాడు.

మిత్రుడైన దశరథుని రాకతో సంతసించిన రోమపాదుడు అపూర్వంగా అతిథిసత్కారములను అందించాడు. రోమపాదుని ప్రక్కన నిలబడి అగ్నివలె ప్రకాశిస్తున్న ఋష్యశృంగుని దశరథుడు దర్శించాడు. ఆనందమగ్నుడయ్యాడు.

దశరథునితో తనకున్న మిత్ర బాంధవ్యాన్ని రోమపాదుడు ఋష్యశృంగునికి వివరించాడు. ఋష్యశృంగుడు ఆనందించి దశరథుని అర్చించాడు.

దశరథుడు తన రాక వివరాలను రోమపాదునికి తెలిపాడు. శాంతతోపాటు ఋష్యశృంగుని అయోధ్యకు పంపమని అర్థించాడు. రోమపాదుడు సంతసించి అంగీకరించాడు. శాంతాఋష్యశృంగులను వెంటపెట్టుకొని దశరథుడు అయోధ్యచేరాడు. అంతఃపురములో అందరూ అనందించారు. అయోధ్యా నగర వాసులందరు సంతసించారు.

దశరథుడు ఋష్యశృంగుని అంతఃపురము లోనికి తీసుకొని వెళ్ళి ఘనంగా పూజించాడు. శాంతాఋష్యశృంగులు కొంతకాలము ప్రశాంతంగా అయోధ్యలోనే వసించారు.

## యాగ వైభవము

మనోహరమైన వసంతఋతువు వచ్చింది. దశరథుడు ఋష్యశృంగమహర్షిని సమీపించాడు. తన వంశము పుత్రపౌత్రాదులతో వృద్ధి చెందునట్లు తనచేత యజ్ఞము చేయించమని ప్రార్థించాడు.

ఋష్యశృంగుడు సంతసించి అటులనే చేయించుటకు అంగీకరించి, యజ్ఞాశ్వమును విడువమని చెప్పాడు.

దశరథుడు సుమంత్రునిద్వారా ఋత్విక్కులను, వసిష్ఠాది పురోహితులను పిలిపించాడు. అశ్వమేధ యాగము చేయ సంకల్పించినట్లు వారికి తెలిపాడు. ఋష్యశృంగుని ప్రభావముచే తనఅభీష్టము నెరవేరునని భావిస్తున్నట్లు వారికి తెలిపాడు.

తన ఆస్థానములో వసిష్ఠుడు ఉండగా ఋష్యశృంగుని ఆధ్వర్యంలో యజ్ఞం జరిపించడమా? వసిష్ఠుని మనసు బాధపడవచ్చు. అందుకని దశరథుడు ముందుగా వసిష్ఠుని అనుమతిని తీసుకున్నాడు.

వసిష్ఠుడు రాజుగారి కోరికను మన్నించాడు. మదిలో సంతసించాడు. దశరథుని అనుగ్రహించాడు. అభీష్టము నెరవేరునట్లు ఆశీర్వదించాడు.

అసూయాపరులు ఆచార్యులు అవుతారా? దైవకార్యములయందు, ధర్మకార్యములయందు అసూయలు, ఈర్ష్యలు పనికిరావు. అహంకారులవల్ల యజ్ఞాలు పవిత్రతను కోల్పోతాయి. యజ్ఞ నిర్వాహకులు, ఆధ్వర్యము వహించువారు నిస్వార్థపరులై, త్యాగమయులై యుండాలి. పేరు కొరకు ప్రాకులాడే పిశాచాలు యజ్ఞవైభవమును పాడుచేయు రాక్షసులతో సమానులు.

సంవత్సరము గడిచింది. తిరిగి వసంతఋతువు అరుదెంచింది. దేశాలన్నీ తిరిగి అశ్వము వచ్చింది. సరయూనది ఉత్తరతీరమున యాగం ప్రారంభమైంది. వసిష్ఠుడు యజ్ఞ కార్యభారమును స్వయంగా వహించి పర్యవేక్షిస్తూఉండగా, ఋష్యశృంగుని ముందుఉంచుకొని దశరథుడు యజ్ఞకార్యములు ప్రారంభించాడు.

యజ్ఞము నిర్వహించుచున్న రోజులలో అలసినవాడుగాని, ఆకలిగొన్నవాడు గాని కనిపించలేదు. బ్రాహ్మణులు, సాధువులు, మహర్షులు, ప్రజలు తృప్తిగా భోంచేస్తూ ఉన్నారు. నిత్యము శ్రద్ధగా వండిన భోజనపదార్థముల రాసులు పర్వతాలా అన్నట్లు గోచరిస్తూ ఉండేవి.

పదార్థములు చాలా రుచికరంగా, మధురంగా ఉండేవి. ఎంత తిన్నా జనానికి తృప్తి ఉండేది కాదు. ఇంకా తినాలి అన్నంత మధురంగా ఉండేవి పదార్థాలు. ఎందరు భోంచేస్తున్నా వడ్డించేవారికిగాని, దశరథునికిగాని సంతృప్తి కలగడం లేదు. ఇంకా భోంచేస్తే బాగుండును అని భావించేవారు.

"భోజనాలు మళ్ళీ మళ్ళీ పెట్టండి. వస్త్రాలు మళ్ళీ మళ్ళీ ఇవ్వండి" అనే మంత్రుల మాటలు ఎక్కడో ఒకచోట వినిపిస్తూనే ఉండేవి.

ఒకవైపు భోజనాలు జరుగుచుండగా, మరొక వైపు వస్త్రదానం జరుగుతూ ఉండేది. ఇంకొకవైపు విద్వాంసులు విశ్రామము లభించినపుడు చక్కని శాస్త్రచర్చ చేస్తూ ఉండేవారు.

కల్పసూత్రము ననుసరించి అశ్వమేధ యాగము మూడు రోజులు జరుగుతుంది. మొదటి దినమును చతుష్టోమము అంటారు. రెండవ దినమును ఉక్థ్యము అంటారు. మూడవ దినమును అతిరాత్రము అంటారు.

దశరథుడు వైభవంగా క్రతువును సమాప్తి చేశాడు. యాగఫలము పూర్ణంగా లభించుటకు తన భూమినంతా ఋత్విక్కులకు దానంచేశాడు. ఈ భూమిని రక్షించగలిగిన ప్రభువు దశరథుడు ఒక్కడేనని పలికి ఆభూమిని తిరిగి రాజుకిచ్చి, భూమికి బదులుగ ధనమును ఋత్విక్కులు గ్రహించారు.

యాగమును దర్శించుటకు అరుదెంచిన వారికి దశరథుడు కోటి బంగారునాణెములను ఇచ్చాడు. బంగారం అంతయు దానము చేసిన పిమ్మట ఒక పేదబ్రాహ్మణుడు వచ్చి యాచించాడు. దశరథుడు వెంటనే తన చేతికిఉన్న ఆభరణమును తీసి అతనికి ఇచ్చాడు. దశరథుడు త్యాగధనుడు. త్యాగులే రాముని పొందుతారు.

సామాన్యులకు సాధ్యముగానిది, అసమానులైన రాజులు కూడా నిర్వహించలేని వైభవోపేతమైన అశ్వమేధ యాగమును నిర్వహించినందుకు దశరథుడు సంతసించాడు. సంతృప్తిని పొందాడు. ఋత్విక్కులకు సాష్టాంగ ప్రణామము చేశాడు. గొప్పదాతయైన దశరథుని విప్రవర్యులు ఆశీర్వదించారు.



"మహాత్మా! నా వంశాభివృద్ధికి కారణమైన కర్మను నాచే చేయించుము;" అని దశరథుడు ఋష్యశృంగుని ప్రార్థించాడు.

"రాజా! అలాగే చేయిస్తాను. పుత్రులు కలుగుటకై నీచేత పుత్రకామేష్టిని చేయిస్తాను. నీకు వంశోద్ధారకులైన నలుగురు కుమారులు పుడుతారు" అని పలికి ఋష్యశృంగుడు అథర్వశిరస్సున చెప్పబడిన మంత్రాలతో అగ్నిలో హోమంచేశాడు.

దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు తమతమ యజ్ఞ హవిర్భాగములను అందుకొనుటకు వచ్చి అక్కడ కలుసుకున్నారు.

## సృష్టికర్తను ఆశ్రయించిన సురులు

దేవతలు అందరు సృష్టికర్తయైన బ్రహ్మదేవుని సమీపించారు. పూజ్యభావంతో చతుర్ముఖునికి నమస్కరించి "హే భగవాన్! నీనుండి వరములు పొందిన రావణాసురుడు అనే రాక్షసుడు మమ్ములను బాధిస్తూ ఉన్నాడు. నీవు ఇచ్చిన వరములను మేము గౌరవించి బాధలను అనుభవిస్తూ ఉన్నాము.

"అతడు ముల్లోకములను పీడిస్తున్నాడు. ఇంద్రుని కూడా అవమానిస్తూ ఉన్నాడు. ఋషులను, గంధర్వులను బాధిస్తూ ఉన్నాడు. అతని యెదుట సూర్యుడు ప్రకాశించుటకు సంకోచిస్తూ ఉన్నాడు. వాయుదేవుడు జాగ్రత్తగా వీయుచున్నాడు. తీరములో అతడు తిరుగుతూ ఉంటే సాగరుడు తరంగ చలనమును ఆపుకొంటూ ఉన్నాడు. అతనిని వధించే ఉపాయమేమిటో మీరే ఆలోచించాలి" అని పలికారు.

"దేవతలారా! విచారింపకండి. దేవ దానవ రాక్షస గంధర్వ యక్షుల నుండి తనకు మరణము వాటిల్లకూడదు అని రావణుడు నన్ను వరమడిగి గ్రహించాడు. కానీ మనుష్యులను అతడు ఉదహరించలేదు. కనుక మానవుల చేతిలో మరణించే అవకాశము కలదు" అని బ్రహ్మదేవుడు పలికాడు.

అనాదరము ఆపదలను సృష్టిస్తుంది. చులకన భావము చితిని రగిలిస్తుంది. అహంకారము అంతానికి అంకురార్పణ చేస్తుంది. గర్వము గండాలను బ్రతుకులో దించుతుంది.

నమ్రతయే గొప్పతనానికి నిదర్శనము. ఎవరినీ తక్కువగా భావించకూడదు. పరమాత్మ అంతటా నిండియున్న ఈ సృష్టిలో అందరూ పూజనీయులే. కానీ అహంకారికి అందరూ హీనంగానే కన్పిస్తారు.

అహంకారియైన రావణుడు మనుష్యులను తక్కువగా అంచనా వేశాడు. ఇప్పుడు మానవుల వల్లనే ముప్పువాటిల్లుతూ ఉంది. మానవుడే ముగింపు పలికే సమయం వచ్చింది.

బ్రహ్మదేవుడు విష్ణుదేవుని ఆశ్రయించమని సురులకు చెప్పాడు. దేవతలు విష్ణు భగవానుని శరణు వేడుకున్నారు. విష్ణువు వారి మొరను ఆలకించాడు. రావణుని ఉన్మూలించమని దేవతలు ప్రార్థించారు.



దేవతల ప్రార్థనల నాలకించి విష్ణుదేవుడు సంతృప్తి చెందాడు. రావణుని వధించుటకు ఆంతర్యములో నిర్ణయించుకున్నాడు. కానీ దేవతలను ఒక విషయమై ప్రశ్నించాడు.

**ఉపాయః కోవధే తస్య రావణస్య దురాత్మనః**
**యమహం తం సమాస్థాయ నిహన్యా మృషి కణ్టకమ్.**

"దేవతలారా! ఋషులకు బాధ కలిగించుచున్న దురాత్ముడగు ఆ రావణుని సంహరించుటకు ఉపాయమేమి? నేను ఏ ఉపాయముచే రావణుని వధించగలను?" అని ప్రశ్నించాడు.

రావణుని వధించుటకు నారాయణుడు నిర్ణయించుకున్నాడు. ఎందుకని? అతడు ఋషులను బాధిస్తున్నాడు కనుక. సాధుహింసను శ్రీనాథుడు సహించడు. **"పరిత్రాణాయ సాధూనాం"** సాధువులను రక్షించుటయే భగవంతుని అవతార విశేషమునకు ప్రధానకారణము. అందుచేతనే ఋషులను బాధించుచున్న ఆ రావణుని వధించుటకు ఉపాయమును అడిగాడేగాని, దేవతలను, గంధర్వులను బాధించుచున్న రావణుని వధించుటను ప్రస్తావించలేదు.

రావణవధకు ఉపక్రమించుటకు సిద్ధపడిన విష్ణుదేవుడు దేవతలను ఉపాయము చెప్పమని అడుగుటలో ఆంతర్యమేమి? మానవులే రావణుని వధించగలరు అని దేవతలు చెప్పారు. మరి విష్ణువు మానవుడు కాదుగదా? భగవంతుడు సాధు సంరక్షణార్థం, ధర్మ సంస్థాపనార్థం ఏరూపంలో అయినా గోచరించగలడు. అదియే భగవదవతార వైశిష్ట్యము. ఈ అవతారవైశిష్ట్యమునందు, విశేషమునందు దేవతలకు విశ్వాసమున్నదో లేదో పరీక్షించుటకే నారాయణుడు ఆప్రశ్న వేశాడు.

భగవంతుని అవతార వైభవము నందు విశ్వాసము లేని ఒకరాజుగారు ఉండేవారు. మంత్రిగారు మహాభక్తుడు. భగవంతుని అవతార విశేషమును విశ్వసించేవాడు. రాజుగారు మాత్రం మంత్రితో వాదిస్తూ ఉండేవాడు. సాధుజన రక్షణానికి భగవంతుడే ఎందుకు అవతరించాలి? ఆయనకు అనుచరులు లేరా? వారిని పంపితే సరిపోదా? అనేవాడు. రాజుగారిని ఎదిరించలేని మంత్రి వింటూ ఊరుకునేవాడు. కానీ ఆంతర్యంలో వ్యధచెందుతూ ఉండేవాడు.

ఒకనాడు రాజుగారు, మంత్రి, సేనాధిపతి, పండితులు గంగానదిలో వినోదానికి నౌకాయానము చేస్తున్నారు. మంత్రి ఆలోచించాడు. నావలో ఉన్న రాజుగారి కుమారుని ప్రక్కగా దాచి, అంతకు ముందే నావలో దాచిపెట్టుకొని యున్న పెద్దబండను నదిలో తోయించాడు. శబ్దమైంది.



"అయ్యో ! రాకుమారుడు నదిలో పడి పోయాడు" అని మంత్రి కేక వేశాడు. మరో ఆలోచనకు తావులేకుండా రాజు గంగలో దుమికాడు. ఈది ఈది అలసిపోయి, బిడ్డ కనిపించలేదనే బాధతో పైకి వచ్చాడు. నావలో హాయిగా కూర్చుని యున్న తన బిడ్డను చూశాడు. ఆనందంతో బిడ్డని ఆలింగనం చేసికొని ఆనందాశ్రువులు రాల్చాడు.

"అయ్యా! మహాప్రభూ! మేము, నీ అనుచరులము, సేవకులము ఇందరము ఇక్కడ ఉండగా, నీ బిడ్డను రక్షించుటకు నీవే గంగలో దూకాలా? భగవంతుడు కూడా అలాగే అవతరిస్తాడు. నీ బిడ్డమీద నీకు ప్రేమ ఉన్నట్లే తన బిడ్డలైన భక్తుల మీద పరమాత్మకి ప్రేమ ఉండదా? ఈసత్యాన్ని తెలుపుటకే నీ బిడ్డ నదిలో పడ్డాడని అసత్యం పలికాను. క్షమించండి" అని మంత్రి పలికాడు.

రాజుగారికి కనువిప్పు అయింది. మంత్రిని అభినందించాడు. తన తప్పును అంగీకరించాడు. ఆనాటినుండి భగవంతుని అవతార వైభవాన్ని పూర్ణంగా విశ్వసిస్తూ, అవతారమూర్తులను అర్చించుటకు ప్రారంభించాడు.

పరమాత్మ భక్తప్రియుడు. భక్త వత్సలుడు. భక్తజన రక్షకుడు. భక్తులకు తానే తండ్రి. తానే తల్లి. గురువు, బంధువు, దైవము అన్నియూతానే. ప్రపంచంలో భగవంతుడు మినహా ఏదీ స్థిరంగాదని విశ్వసించే వారే భక్తులు. అందుచేత వారి ప్రాణాలన్నీ పరమాత్మనే ఆశ్రయించుకొని ఉంటాయి. ఆ ప్రాణాల్ని రక్షించే బాధ్యత పరమాత్మమీదే ఉంటుంది. అందుచేత భక్తులను పరమాత్మ తల్లిలాగా సదా కాపాడుతూ ఉంటాడు.

ఈ సత్యాన్ని సంత్ శిరోరత్నం, జనార్దనుడైన పాండురంగ విఠలుని సేవలో తరించిన భక్త సాధ్వీమణి జనాబాయి ఒక అభంగములో చక్కగా కీర్తిస్తుంది.

**పక్షి జాయ్ దిగంతరా బాళకాఁసి ఆణీచారా**
**ఘూర్ హిండతే ఆకాశీ ఝెప్ ఘాలీ పిల్లాపాశీ ॥**
**మాతా గుంతలీ కామాసీ చిత్ తిచే బాళాపాశీ**
**వానర్ హిండే ఝూడావరీ పిలీ బాంధునీ ఉదరీ ॥**
**తైసియ మాసీ విఠల్ మాయ్ జనీ వేళావేళా పాహే ॥పక్షిజాయ్॥**

"పక్షిపిల్లకు మేత తేవాలని పక్షి దిగంతరాలకు పయనమై పోతుంది. కానీ దాని మనసంతా పిల్లపక్షి మీదనే ఉంటుంది. గ్రద్ద (ఘూర్) ఆకాశంలో సంచరిస్తూ, మధ్యలో క్రిందికి జారి నేలపై నున్న తన బిడ్డను చూసి వెళ్తూఉంటుంది.

బిడ్డను ఊయలలో ఉంచి గృహకృత్యాలలో తల్లి నిమగ్నమై ఉండినా ఆమె మనసు మాత్రం బిడ్డపైనే ఉంటుంది. కోతి తన పిల్లను ఉదరానికి అతికించుకొని చెట్లపై (ఝూడావరీ) ఎగురుతూ దుముకుతూ ఉంటుంది.

అలాగే రంగమ్మ (విఠల్‌మాయి) తన బిడ్డను వేళవేళకు రక్షిస్తూనే ఉంటుంది".

పాండురంగడే తనకు తల్లి అని భావించిన జనాబాయి విఠలుని 'అమ్మ' అని సంబోధిస్తున్నది. నిజమే కదూ! భగవంతుడు భక్తులకు జన్మ జన్మలకు తల్లియై కాపాడుతూ ఉన్నాడు.

రావణుని వధించుటకు ఉపాయమును చెప్పమని నారాయణుడు దేవతలను ప్రశ్నించాడు. మానవశరీరమును ధరించి రావణాసురుని వధించమని దేవతలు బదులు పలికారు. విష్ణువు సంతసించి 'సరే' అన్నాడు. దేవతలు ఆదిదేవుని అర్చించి వారి వారి లోకాలకు వెళ్ళారు.

దశరథుని పుణ్యం ఫలించనుంది. దశరథ మహారాజుకు కుమారుడుగా జన్మించాలని పరమాత్మ నిర్ణయించుకున్నాడు. దశరథుని జన్మ ధన్యమైంది.

దశరథుడు అనగా దశేంద్రియములను జయించినవాడు అని అర్థము. ఎవరు దశేంద్రియాలను జయిస్తారో వారికి రాముడు పుత్రుడుగా జన్మిస్తాడు. అంటే జ్ఞానపుత్రుడు పుడుతాడు. ఆత్మజ్ఞాన పుత్రుడు లభిస్తాడని ·భావము.

## దివ్య ప్రసాదము

పుత్రయేష్టి పూర్తి కావచ్చింది. ఋష్యశృంగుడు హోమకుండంలో నెయ్యిపోసి హోమం చేస్తూ ఉన్నాడు. నేతిని మ్రింగుటకా అన్నట్లు అగ్నిశిఖలు పైకి లేచాయి. ఆ జ్వాలల మధ్యనుండి ఒక మహాపురుషుడు శుభలక్షణ సంపన్నుడై పైకి లేచాడు. అతని తేజము భాస్కర తేజమును పోలియుంది. అతడు తన రెండు చేతులతో వెండి మూత ఉంచిన బంగారు పాత్రను పట్టుకొని దర్శనమిచ్చాడు. దశరథుడు చేతులెత్తి ఆ దివ్యాత్మునకు నమస్కరించాడు.

"దశరథ మహారాజా! నీ సేవలతో తృప్తి చెందిన దేవతలు నీకు ఈ పాయసమును నా ద్వారా పంపారు. ఈ పాయసము నీకు సంతానమును ప్రసాదిస్తుంది. ధనమును ఇస్తుంది. ఆరోగ్యమును పెంపొందిస్తుంది. ఈ పాయసమును నీ రాణులకు ఇమ్ము. వారియందు నీకు పుత్రులు లభించగలరు" అని ప్రాజాపత్య పురుషుడు పలికాడు.

పాయసము నిండిన స్వర్ణపాత్రను దశరథుడు నతమస్తకుడై సవినయంగా అందుకొని ఆనందించాడు. ఆ దివ్యపురుషునికి ప్రదక్షిణ నమస్కారములు సమర్పించాడు.

**బభూవ పరమప్రీతః ప్రాప్య విత్త మివాధనః**

పాయసమును అందుకొనిన దశరథుడు ధనము లభించిన నిరుపేదవలె సంతోషించాడు అంటున్నాడు మహర్షి వాల్మీకి.

కోరికలు చక్రవర్తిని కూడా పేదగా మారుస్తాయి. జీవనవస్త్రాన్ని పీలికలుగా చీరేసేవి కోరికలే. కనుక భక్తులు కోరికలకు దూరంగా ఉండేందుకు ప్రయత్నించాలి.

పాయసమును ప్రసాదించిన పావనాత్ముడు అంతర్ధానమయ్యాడు.

దశరథుడు అమితానందంతో అంతఃపురంలో ప్రవేశించాడు. పసిబిడ్డ నెత్తుకున్నట్లు ప్రసాదపూర్ణమైన పసిడికలశమును చేతులపై పెట్టుకొని రాణులను సమీపించాడు. 'ఇదిగో, పుత్ర సంతానమును ప్రసాదించే ఈపాయసమును దేవతలు అనుగ్రహించారు. ఆరగించండి' అని కౌసల్యతో పలికాడు.

దశరథుడు ఆ పాయసములో సగభాగము కౌసల్యకు ఇచ్చాడు. మిగిలిన సగభాగములో సగమును సుమిత్రకిచ్చాడు. అనగా నాల్గవవంతు అని అర్థము. మిగిలిన నాల్గవవంతులో



సగభాగమును కైకేయి కిచ్చాడు. అంటే ఎనిమిదవభాగము కైకేయికి ముట్టింది. పోగా మిగిలియున్న ఎనిమిదవ భాగమును మరల సుమిత్ర కిచ్చాడు. ఈ విధంగా దశరథుడు పాయసమును భార్యలకు పంచాడు. వాల్మీకంలో ఇలా ఉంది.

స్వర్ణకలశము నందలి పూర్ణ పాయసమును ఎనిమిది భాగాలు చేస్తే, అందులో నాలుగు భాగాలు కౌసల్యకు లభించింది. మూడు భాగాలు సుమిత్రకు ప్రాప్తించింది. ఒక భాగము కైకేయికి సిద్ధించింది. పాయసము లభించినందుకు ముగ్గురు రాణులు సంతసించారు. దివ్యమైన బహుమానముగా స్వీకరించారు.

వాల్మీకి రామాయణంలో ఇలా ఉండగా, ఆ తరువాత వెలుగులోకి వచ్చిన రామాయణ గాథలలో ఈ పాయస పంపకము పలుపలు విధములుగా నడిచింది. అలాగే వ్యాఖ్యాతలు కూడా వాటిని సమన్వయ పరచేందుకు నానా తంటాలు పడి కొన్నిచోట్ల కేంద్ర విషయాన్నే తలక్రిందులయ్యేటట్లు వ్యాఖ్యానించారు.

స్థాలీపులాక న్యాయంగా కొన్ని మీముందు ఉంచుతాను.

### 1. తులసీ రామాయణము :-

పాయసములో సగభాగమును దశరథుడు కౌసల్యకిచ్చాడు. మిగిలిన సగభాగములో సగము కైక కిచ్చాడు. ఇంక మిగిలియున్న నాల్గవవంతు భాగమును రెండు సమభాగములు చేసి కౌసల్యకు ఒకభాగము, కైకేయికి ఒకభాగము ఇచ్చాడు. వారిరువురు తమకు రెండవసారి లభించిన ఆ భాగములను సుమిత్రకు ఇచ్చారు. ఈ విధంగా పంపకము చేయించాడు తులసీదాసు.

తులసీ రామాయణము ప్రకారము సుమిత్రకు దశరథుడు పాయసం పంచలేదు. సుమిత్ర దశరథునికి చిన్నభార్య. కనిష్ఠపత్ని. 'చిన్నభార్యపై ప్రేమ ఎక్కువ ఎవరికైనా'- అనే అపవాదు బహుభార్యలను కలిగిన భర్తలకు ఈలోకంలో ఉందికదూ! బహుశ ఆ అపవాదు తనకు రాకూడదని దశరథుడు భావించాడేమో! లేదా తులసీ మహాత్ముడు ఆయన చేత అలా భావింప చేశాడేమో! ఎలాగైతే నేమి? ఆయన పంచకున్నా సుమిత్రకు పాయసం ముట్టింది.

ఇరువురి నుండి పాయసమును స్వీకరించిన సుమిత్ర "మీ వలన లభించిన ఈ ప్రసాదము వలన నాకు కలిగే ఇరువురు పుత్రులు మీ కుమారులు ఇరువురికి సేవ చేస్తారు" అని కృతజ్ఞతను వ్యక్తం చేసిందట. ఈ కారణంగా లక్ష్మణుడు శ్రీరాముని సేవించగా, శత్రుఘ్నుడు భరతుని సేవించాడు. భావప్రధానమైన విషయం గనుక ఇది బాగానే ఉంది.

దశరథుడు సుమిత్రకు పాయసం ఎందుకు పంచలేదు? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పేందుకు క్రింద మీద పడ్డారు తులసీరామాయణ వ్యాఖ్యాతలు. ఒకరన్నారుగదా, చిన్న భార్యయైన సుమిత్రను జ్యేష్ఠ పత్నులైన కౌసల్యా కైకేయిలు సన్మానించాలి అని దశరథుని అభిప్రాయం అని.

ఏమో! ఇవన్నీ నాకు మ్రింగుడుపడవు. బహుభార్యలున్న వారి పరిస్థితి ఇలాగే ఉంటుందేమో అని సరిపెట్టుకోవడమే నేను చేయగలిగింది. ఇకపోతే,

**2. భావార్థ రామాయణం :-**

ఇది మరాఠీ భాషలో ఉంది. దీని రచయిత సంత్ ఏకనాథ్ మహరాజ్. వీరి పంపకము ఎలా ఉందో వినండి. వీరి రామాయణంలో కైకేయిని ఈ సందర్భములోనే కఠినాత్మురాలిగా చిత్రించడం జరిగింది.

తనకు చివరగ ప్రసాదము ఇచ్చాడని దశరథునిపై కినుకవహించిన కైకేయి కోపంతో ఆ ప్రసాదమును పారవేస్తుంది. ఆ ప్రసాదమును ఒక కాకి గ్రహించి, పర్వతము మీదికి తీసికొనిపోతుంది. అక్కడ అంజనీదేవి తపస్సు చేస్తూ ఉంటుంది. కాకి తాను తెచ్చిన పాయసమును అంజనీకి ఇస్తుంది. ఆమె భుజిస్తుంది. అందువలన ఆమెకు ఆంజనేయుడు పుత్రుడై జన్మిస్తాడు.

కొంతసేపటికి తన తప్పిదమును గ్రహించిన కైకేయి పశ్చాత్తాపము చెందుతుంది. అప్పుడు ఉదారులైన కౌసల్య, సుమిత్రలు తమ భాగములలోని ప్రసాదమునుండి కొంతభాగమును కైకేయికి ఇస్తారు. ఈ విధముగా ముగ్గురు రాణులు ప్రసాదమును స్వీకరించి సంతానవంతులవుతారు. ఇది ఏకనాథుని ఏకాభిప్రాయం. ఇకపోతే,

**3. కంబ రామాయణము :-**

ఇది తమిళ రామాయణం. దీనిని రచించిన కవి కంబరు. మహాభక్త శిఖామణి. అద్భుతమైన కవి.

కంబ రామాయణంలో దశరథుడు పాయసాన్ని సగభాగము కౌసల్యకిచ్చి, మిగిలిన సగభాగంలో కైకేయి, సుమిత్రలకు చెరిసగం పంచిపెట్టాడు. మొత్తానికి కంబరు చాలా ముక్తసరిగ ముగించాడు. కాకపోతే కొంత ***సీనియారిటీని*** దృష్టిలో ఉంచుకొని కౌసల్యకు సగం ఇప్పించాడు తమిళకవి. అంతే. ఇకపోతే,

**4. అధ్యాత్మ రామాయణము :-**

దశరథ మహారాజు సగభాగమును కౌసల్యకు, సగభాగము కైకేయికి ఇచ్చాడు. ఈలోగా సుమిత్ర అక్కడికి రావడం జరిగింది. వెంటనే తనభాగంలో సగభాగమును కౌసల్య సుమిత్రకు ఇచ్చింది. అలాగే తనవాటాలో సగభాగమును కైకేయి కాటా వేసి మరీ ఇచ్చింది. ఈవిధంగా పాయసాన్ని పత్నులకు అందజేసింది అధ్యాత్మ రామాయణం.

సింహపురి ఆడపడుచు కుమారి మొల్ల తన రామాయణంలో అధ్యాత్మ రామాయణము పంచిన విధమునే ధృవపరచింది.

ఆ॥ పాయసమ్ము రెండు భాగముల్ గావించి యగ్రసతుల కీయ నందులోన
సగము సగము దీసి ముగుద సుమిత్రకు నొసగిరంత నామె మెసవె బ్రీతి.

ఇది మొల్ల రామాయణము.

నెల్లూరు మండలమునకు చెందిన గోపీనాథము వేంకటకవి తెలుగులో రచించిన "గోపీనాథ రామాయణము"ను వేంకటగిరి సంస్థానాధీశుడగు సర్వజ్ఞ కుమార యాచేంద్ర భూపతి వెలుగులోకి తెచ్చి విస్తరింపచేశాడు. ఈ గోపీనాథ రామాయణము వాల్మీకిని అనుసరించి పాయసమును వితరణ గావించింది.



తే॥ సగముఁ గౌసల్య కొసఁగి యాసగములోన
సగ మల సుమిత్ర కొసఁగి యా సగములోన
సగముఁ గైకేయి కొసఁగి ప్రసన్న దృష్టి
మిగిలిన సగంబు మరల సుమిత్ర కొసఁగె

ఇది గోపీనాథ రామాయణము. ఇవి వాల్మీకి అడుగుజాడలు.

ఈ విధంగా చెప్పాలంటే చాలా ఉన్నాయి. ఇంతటితో ఆపుతాను ఈ పాయసాల పంపకం. ఎందుకంటే, మరీ పాయసమయిపోయె. వెగటు అవుతుందేమోనని భయం. అంతే.

కానీ ఈ సందర్భములో నేనొక తియ్యని వెగటు పుట్టని మాట చెబుతాను. వాల్మీకము మొదలు ఏ రామాయణమును వీక్షించినను యజ్ఞ పాయసమును పత్నులకు దశరథుడు సమానముగా పంచలేదని మాత్రము స్పష్టమగుచున్నది. ఈవిషయం నిర్వివాదాంశం. ముగ్గురు రాణులలో సపత్నీ కలహము లేదని నిర్ద్వంద్వముగా చెప్పవచ్చు. సవతులలో అసహనము లేదని తెలుస్తూ ఉంది. ఒకరిని చూసి మరొకరు ఆనందించే సుగుణము ముగ్గురు రాణులలో కనిపిస్తూ ఉంది. పరస్పర ప్రేమాను రాగాలు గల బిడ్డలకు తల్లు లయ్యారు. అందుచేతనే వారు దివ్యాంశములు గల పుత్రులను పొందగలిగారు. అసూయలేనివారు మాత్రమే జ్ఞానాన్ని పొందగలరు అనడానికి ఇదొక నిదర్శనము.

ఇదం గుహ్యతమం శాస్త్రం ప్రవక్ష్యా మ్యనసూయవే

"అర్జునా ! అసూయలేనివాడవు. అందుచేత రహస్యమైన ఈశాస్త్రమును నీకు బోధించు చున్నాను" అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత - రాజవిద్యా రాజగుహ్యయోగములో తెలిపియున్నాడు.

అసూయాపరులు ఆత్మజ్ఞానమునకు అర్హులు కారు. ఆధ్యాత్మిక ప్రగతికి అసూయ గొప్ప అవరోధమని సాధకులు గుర్తించాలి. సహనము, ప్రేమ, విశాల దృక్పథమును అలవరచుకొని అసూయను సాధకులు ఉన్మూలించాలి.

దశరథుని ముగ్గురుభార్యలు యజ్ఞ పాయసమును భుజించారు. అగ్ని సూర్య తేజముగల గర్భములను ధరించారు. గర్భవతులైన పత్నులను చూచి దశరథుడు తృప్తి చెందినవాడై, సురపూజితుడైన విష్ణుదేవునివలె శోభించాడు.

## శ్రీరామ జననం

యజ్ఞము పూర్తియైన తరువాత ఒక సంవత్సరానికి, చైత్రశుద్ధ నవమినాడు, పునర్వసు నక్షత్రమున, గురుడు చంద్రునితో కలసియున్న కర్కాట లగ్నంలో, ఐదుగ్రహాలు ఉచ్ఛ స్థానములలో ఉండగా దశరథుని జ్యేష్ఠపత్నియగు కౌసల్య, జగన్నాథుడు, సర్వలోక సంపూజ్యుడు, సర్వలక్షణ సంపన్నుడూ, ఇక్ష్వాకువంశ వర్ధనుడు అయిన శ్రీరామ ప్రభువును ప్రసవించింది.

జై జై శ్రీరామచంద్ర భగవాన్ కీ

సత్య పరాక్రముడు. సమస్త సద్గుణ సంపన్నుడు అయిన భరతుని పుష్యమీ నక్షత్రము మీనలగ్నమున కైకేయి ప్రసవించింది.

సకలశాస్త్ర పారంగతులు, గొప్పవీరులు అయిన లక్ష్మణశత్రుఘ్నులను ఆశ్రేషానక్షత్రము కర్కటక లగ్నమున సుమిత్ర ప్రసవించింది.

దివ్యతేజముగల ఈ నల్వురు ఉదయించిన శుభ సమయాన గంధర్వులు మధుర గానములు ఆలపించారు. అప్సరసలు నాట్యమాడారు. దేవ దుందుభులు మ్రోగాయి. గగనము నుండి పుష్పవర్షం కురిసింది.

అయోధ్యలో గొప్పఉత్సవం జరిగింది. జనులతో క్రిక్కిరిసియున్న అయోధ్యా వీధులు నర్తకులతో, నటులతో నిండిపోయాయి. గాయకులతో, వాద్యశిల్పులతో నగరమంతా ఆనందతాండవం చేసింది.

అమిత ధనాన్ని, లెక్కలేనన్ని గోవులను దశరథుడు దానం చేశాడు. మహదానందాన్ని అనుభవించాడు.

శ్రీరాముని జననవైభవము వాల్మీకి రామాయణములో ఇలా ఉంది. ఇతర గ్రంథాలలో భక్తిరస ప్రధానమైన అనేక అంశాలు చోటుచేసుకొని ఉన్నాయి. ప్రామాణికం కాకపోయినా భావస్పందనతో ప్రసన్నతను పొందుటకు అవికూడా కొన్ని పేర్కొంటూ ఉన్నాను.

శ్రీరాముడు చతుర్భుజుడై జన్మించినట్లు రామచరితమానసము నందు, భావార్థ రామాయణము నందు, అధ్యాత్మ రామాయణమునందు కూడా ఉన్నది. తల్లి కోర్కెపై అలౌకికమైన ఆ దివ్య రూపమును ఉపసంహరించినట్లు రచించారు.

శ్రీకృష్ణ పరమాత్మ జననము వలె రామప్రభువు జననమును వీరు అనుకరించి వ్రాసినట్లు తెలియుచున్నది. అందుచేత రామజననమునకు ముందు, వెనుక కొన్ని అప్రమాణ సన్నివేశాలను అందంగా అల్లినారు అనిపిస్తుంది. వినండి.

శ్రీరాముడు గర్భంలో జీవించునపుడు కౌసల్య సదా ధ్యానమగ్నమై ఉండేదట. ప్రభువు గర్భంలో ఉండుటచేత ఆమెలో ధ్యానావేశం గోచరిస్తూఉండేదట.

ఒకనాడు గర్భవతియైన కౌసల్యవద్దకు దశరథుడు వస్తాడు. గర్భవతులు తీరనికోరికలతో ఉండకూడదని చెబుతుంటారుగదా! అందుచేత "మహారాణీ! నీకు కోరిక లేమైనా ఉంటే చెప్పు. సఫలీకృతం చేస్తాను" అంటాడు దశరథుడు.

కౌసల్య దశరథునితో, "నేను తృప్తిగా, ఆనందంగా ఉన్నాను. నాకు ఏ కోరికయూలేదు. కోరికలే దుఃఖానికి కారణము. నాకు ఒంటరిగా ధ్యానం చేసుకోవాలని ఉంది" అంటుంది.

పరమాత్మ గర్భంలో ఉన్నందున కౌసల్యకు వాంఛలు తలెత్తలేదు. ఎవరి హృదయంలో భక్తి ఉంటుందో, వారికి కోరికల సంతగోల రుచించదు.

రాముడు జన్మించినపుడు కౌసల్యకు సేవచేయు దాసి అంతఃపురంలో ప్రవేశిస్తుంది. రాముని చూసి ఆనందంతో పరవశించి పోతుంది. అప్పుడు కౌసల్య ఆదాసికి ఒక రత్నహారమును బహుమానంగా ఇస్తుంది. మణిహారమును దాసి గ్రహించదు. "అమ్మా! నాకు బహుమానాలు



అవసరం లేదు. కొన్ని నిముషాలు ఈ బంగారు శిశువును ఎత్తుకోవడానికి అనుమతిని ప్రసాదించండి చాలు" అంటుంది. పరమాత్మను గాంచిన తరుణంలో పసిడి విలువలేనిదై, వెలవెల పోయింది. కౌసల్య అనుమతిస్తుంది. రాముని ఎత్తుకోగానే దాసి దేహధ్యాస మరచి పోతుంది.

మరొక సన్నివేశం. రామజననం జరిగింది. దశరథుడు వసిష్ఠుని వెంటబెట్టుకొని రాముని దర్శించుటకు అంతఃపురానికి వెళ్తాడు. రాముని చూడగానే పట్టరాని ఆనందంతో ఊగిపోతాడు దశరథుడు. వసిష్ఠుని చూచి స్వస్తి పలుకమని చెప్తాడు. వసిష్ఠు డంటాడు, "ఈ పిల్లవానిని చూడగనే నేను నా పేరును కూడా మరచిపోయాను. ఇక మంత్రాలు ఎలా చెప్పేది" అని.

రాముడే మంత్రస్వరూపుడు. భగవంతుడైన రాముని దర్శించగనే తనపేరు కూడా వసిష్ఠునికి జ్ఞాపకం రాలేదట. నిజమే కదూ! పరమాత్మ దర్శనంలో నామ రూపాలు ఎలా గోచరిస్తాయి?

తన వంశంలో రాముడు ఉదయించాడనే సంతోషములో సూర్యుడు అస్తమించలేదట. రాముడు పుట్టినది మొదలు నెలరోజులు సూర్యుడు అస్తమించ లేదని తులసీదాసు రామచరితమానసంలో వ్రాశాడు. మాసం రోజులు అయోధ్యలో రాత్రి లేదని వ్రాశాడు.

రామ జననంతో దేవత లందరూ పరవశిస్తూ, ఆనందిస్తూ ఉంటే చంద్రుడు దిగులుతో దుఃఖిస్తూ ఉంటాడు. సూర్యుడు అస్తమించక పోవడం చేత చంద్రోదయమునకు అవకాశము కలుగుటలేదని ఆవేదన చెందుతాడు.

చంద్రుని ఆవేదనను గమనించి రాముడు చంద్రునికి దర్శనమిస్తాడు. తనకొరకు దుఃఖించిన చంద్రుని యొక్క నామమును తన నామానికి తగిలించుకొని రామచంద్రుడుగా పిలిపించుకుంటానని రాముడు చంద్రునికి అభయమిస్తాడు. అంతే గాదు, రాబోవు అవతారములో అందరికంటె ముందు దర్శించే భాగ్యాన్ని చంద్రునికి ప్రసాదిస్తానని అంటాడు. ఈ మాటను కృష్ణావతారంలో నిలబెట్టుకుంటాడు.

వాల్మీకంలో లేని ఇలాంటి ఎన్నో ఘట్టాలు ఇతర గ్రంథాలలో శోభిస్తున్నాయి. ఆనందించడానికి అన్నీ చదువవచ్చు. తప్పులేదు. కానీ రామాయణానికి ప్రామాణికం వాల్మీకి రామాయణమే.

## నామకరణము - బాల్యము

పదకొండు రోజుల తరువాత నలుగురు పిల్లలకు నామకరణము జరిగింది. కౌసల్యా తనయునికి రాముడని, కైకేయికుమారునికి భరతుడని, సుమిత్రాపుత్రులకు లక్ష్మణ శత్రుఘ్నులని వసిష్ఠుడు నామకరణం చేశాడు.

**రమన్తే సర్వేజనాః గుణైః అస్మిన్ ఇతిరామః**

సుగుణాలరాశి యగు ఎవనియందు సమస్తజనులు సుఖవంతులగుదురో ఆతడే రాముడు.

**లక్ష్మీః అన్య అస్తీతి లక్ష్మణః**

ఐశ్వర్య, వైభవము కలవాడు లక్ష్మణుడు. లక్ష్మీ సంపన్నుడు.

**బిభర్తీతి భరతః**

రాజ్యమును భరించువాడు భరతుడు.

**శత్రూన్ హన్తీతి శత్రుఘ్నః**

శత్రువులను వధించువాడు శత్రుఘ్నుడు. వారి నామముల శబ్దార్థములు ఈ విధంగా భాసిస్తున్నాయి.

సర్వులకు రాముడు శాంతిని ప్రసాదించును. భరతుడు దానిని పోషించును. శత్రుఘ్నుడు పతనం గాకుండా రక్షించును. సర్వలక్షణ సంపన్నుడు, ఉదారుడైన లక్ష్మణుడు సర్వ లక్షణములను కాపాడు చుండును. ఇలా తులసీదాసు అభిప్రాయపడినాడు.

దశరథుడు పుత్రులకు జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన,చౌల, ఉపనయనాది సంస్కారములు అన్నిటిని సకాలమునకు నిర్వహించాడు.

కాలక్రమాన రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు పెరుగుతూ ఉన్నారు. బిడ్డలందరూ వేదవిదులైనారు. శూరులైనారు. జ్ఞానులైనారు. సద్గుణవంతులైనారు. అందరూ లోకకళ్యాణమును వాంఛించువారే.

రామునికి పితృసేవయందు అభిరుచి మెండుగా ఉండేది. లక్ష్మణునికి చిన్నతనము నుండి రామునియందు తీవ్రమైన ఆసక్తి ఉండేది.

**సర్వప్రియ కరస్తస్య రామస్యాపి శరీరతః**
**లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిః ప్రాణ ఇవా పరః**

లక్ష్మణుడు రామసేవయందే తృప్తి చెందెడివాడు. రాముని తృప్తిపరచుటలో తన శరీరమును అర్పించుటకుకూడా వెనుకాడేవాడు కాడు. రామునికి బహిఃప్రాణంగా వ్యవహరించేవాడు.

పరమాత్మ సేవలో లక్ష్మణుని వలె తృప్తి చెందే అంతఃకరణను సాధకులు తయారు చేసుకోవాలి. జ్ఞానము ఒక్కటే సరిపోదు. భక్తితో భగవంతుని సేవించినపుడే బ్రతుకు పునీతమవుతుంది.

ఈనాడు భగవంతునిగూర్చి వినడానికి జనులు తండోపతండాలుగా వస్తున్నారు. వింటున్నారు. వారిలో ఎక్కువ శాతం శాంతిని పొందలేకపోతున్నారు. సేవ లోపించడమే దీనికి ప్రధాన కారణము. ఆచరణ లేని జ్ఞానము శాంతి నివ్వదు.

భగవంతునిగూర్చి నీకెంత తెలుసు అని పరమాత్మ ఆలోచించడు. పరమాత్మ కొరకు నీవెంతగా పరితపిస్తున్నావా! అనేదే ఆయన వీక్షణం. నీవు భగవంతుని గూర్చి ఆలకించింది భక్తిచేయడానికే గాని కాలక్షేపానికి కాదు. లక్ష్మణునిలాగా సేవలో తృప్తి చెందు వారిని పరమాత్మ క్షణం కూడా వదలడు.

**న చ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః**
**మృష్టమన్న ముపానీత మశ్నాతి న చ తం వినా!**



లక్ష్మణుడు ప్రక్కన లేకుంటే రాముడు నిద్రపోయేవాడుకాడు. మధుర పదార్థములు వడ్డించినను లక్ష్మణుడు లేనిచో రాముడు తినేవాడుకాడు.

మన విషయంలో భగవంతుడు సదా మేల్కొని యుండేటట్లు మన భక్తి సాగాలి. మనం భక్తిలో మేల్కొని ఉంటే పరమాత్మ మనల్ని సదా వీక్షిస్తూ ఉంటాడు.

లక్ష్మణునకు రాముడెంత ప్రియుడైనాడో, అలాగే శత్రుఘ్నునకు భరతుడు అంత ప్రియుడైనాడు. ప్రియలక్షణములుగల ఈనలుగురు పుత్రులతో దశరథుడు దేవతల మధ్య కొలువు దీరిన బ్రహ్మదేవుని వలె శోభించసాగాడు.

రాముడు సోదరులను అమితంగా ప్రేమించేవాడు. వారుకూడా రాముని ప్రాణసమానంగా ప్రేమించేవారు. బాల్యక్రీడలయందు రాముడు తరచుగ ఓడిపోతూ ఉండేవాడట. భరత లక్ష్మణులు విజయాన్ని సాధించాలని ఉబలాటపడుతూ ఉండేవాడు రాముడు. తన సోదరుల విజయమే తన విజయంగా భావించేవాడు.

"అమ్మా! భరతుడు గెలిచాడు. నేను ఓడిపోయాను. ఈరోజు నాకు చాలా ఆనందంగా ఉంది" అని తల్లి కౌసల్యతో రాముడంటాడు.

కొంతసేపటికి భరతుడు కౌసల్య దగ్గరికి వచ్చి, "అమ్మా! నన్ను గెలిపించాలని అన్న రోజూ ఓడిపోతూ ఉంటాడు. నాకు బాధగాఉంది" అని అంటాడు.

ఆదర్శమైన బిడ్డలు మాకు కలిగారు అని కౌసల్య ఆనందంతో ఊగిపోతుంది. సోదరుల మధ్య ఎలాంటి ప్రేమానుబంధాలు ఉండాలో రామాయణాన్ని చదివి మనం గ్రహించవచ్చు. నీవు నీ సోదరులను ప్రేమిస్తే వారూ నిన్ను ప్రేమిస్తారు. సోదరప్రేమలో త్యాగం ఉండాలే గాని స్వార్థం చోటుచేసుకోకూడదు. అన్నదమ్ములనే ప్రేమించలేనివాడు అచ్యుతుని ఎలా ప్రేమిస్తాడు?

రాముడు సోదరులను ఎంతగా ప్రేమించేవాడో అయోధ్యలో ప్రజలను కూడా అంతగా ప్రేమించేవాడు అంటాడు తమిళ రామాయణంలో కంబరు కవి. రాముడు రాజవీధులలో సంచరించునపుడు, ఎదురైన ప్రజలను మనసంతా నిండిన ప్రేమతో, నవ్వుతో పలకరించేవాడట. ఆయనే ముందుగా పలకరించి యోగ క్షేమాలు అడిగేవాడట. రాముని మర్యాదను, ప్రేమను గాంచి సంతసించిన ప్రజలు "రామా! నీవు మా పుణ్యాల పంటవు" అని పలికి మురిసిపోయేవారట.

రామలక్ష్మణ భరత శత్రుఘ్నులకు బాల్యకౌమార దశలు దాటిపోయాయి. యౌవనం ప్రవేశించింది. వారికి వివాహములు చేయాలని దశరథుడు సంకల్పించాడు. పురోహితులతో, బంధువులతో ఆలోచించసాగాడు.

ద్వారపాలకులు ఈలోగా దశరథుని మందిరానికి శీఘ్రంగా వచ్చారు. విశ్వామిత్ర మహర్షి వచ్చినాడని చెప్పారు. ఆ మాటకు సంతసించిన దశరథుడు పురోహితులను వెంటబెట్టుకొని బ్రహ్మదేవుని ఆహ్వానించు ఇంద్రునివలె ఎదురేగినాడు.

# విశ్వామిత్రుని ఆగమనం

దశరథుడు ఎదురుగవెళ్ళి మహాతపస్సంపన్నుడు, తేజోవంతుడు అయిన విశ్వామిత్ర మహర్షిని సాదరముగా ఆహ్వానించాడు. అర్ఘ్యపాద్యాదులు సమర్పించాడు. విశ్వామిత్రుడు సంతసించాడు.

"మహర్షీ! మీ ఆగమనం మాకు అమృతప్రాప్తి వంటిది. నీళ్ళు లేని చోట వాన కురియుట లాంటిది. సంతాన హీనులకు సంతానప్రాప్తి వంటిది. పోగొట్టుకొనిన వస్తువు తిరిగి ప్రాప్తించుట లాంటిది. మీకు స్వాగతము.

"మునిపుంగవా! ఈనాడు మా అదృష్టం వల్ల నీవు లభించావు. నాజన్మ సఫలమైంది. నాబ్రతుకు సార్థకమైంది. మీరాకచే నాగృహము పుణ్యక్షేత్రముగ మారింది.

"ద్విజోత్తమా! నానుండి ఏమి ఆశించి మీరు అరుదెంచితిరో చెప్పండి. మీరు గొప్ప కార్యమును వెంటబెట్టుకొని వచ్చివుండొచ్చు. అలాగని సంశయించకండి. దానిని మహాప్రసాదంగా భావించి నెరవేర్చుతాను," అని దశరథుడు విశ్వామిత్రునితో వినమ్రుడై పలికాడు.

దశరథుని వినయ వచనములను ఆలకించి విశ్వామిత్రుడు సంతోషించాడు. విస్మయమొందించు దశరథుని వాక్కులచే తృప్తి చెందిన గాధినందనుడైన విశ్వామిత్రుడు దశరథునితో ప్రేమ వచనములు పలికాడు.

"మహారాజా! నీవు సద్వంశములో జన్మించావు. బ్రహ్మర్షి అయిన వసిష్ఠ మహర్షిని సేవించావు. ఆయన ఉపదేశములతో ఉన్నతిని సాధించుచున్నావు. నీ మీద, నీ మాట మీద నాకు విశ్వాసముంది. ఆ విశ్వాసంతోనే నా మనస్సులో ఉన్న అభీష్టమును నీముందు ఉంచుతున్నాను.

"రాజా! నేను ఒక సిద్ధికొరకు యజ్ఞం తలపెట్టినాను. ఇద్దరు రాక్షసులు ఆ యజ్ఞమునకు విఘ్నము కలిగిస్తున్నారు. ఒకని పేరు మారీచుడు. రెండవవాని పేరు సుబాహుడు.

"దశరథ మహారాజా! యజ్ఞము సమాప్తి చెందు సమయానికి వారు యజ్ఞవేదికను అపవిత్రం చేస్తున్నారు. రక్తమాంసాలను వర్షింప జేయుచున్నారు. నా యజ్ఞం విఘ్నమైపోతూ ఉంది. ఆ బాధను భరించలేక ఇక్కడికి వచ్చాను.

"రాజా! వారిని శపించే శక్తి నాకు లేకపోలేదు. కానీ ఆ యజ్ఞములో శాపం ఇవ్వకూడదు. అందుచేత నీ సహకారం అర్థించి వచ్చాను. నీవు అంగీకరిస్తే యజ్ఞ సంరక్షణ కోసం నీ కుమారుడగు రాముని తీసుకొని పోదలచాను. నా శిక్షణలో రాముడు వారిని తప్పక వధించగలడు. దాని వలన అతని కీర్తి ముల్లోకములకు వ్యాపిస్తుంది.

"రాజా! వారు రాముని ఎదిరించలేరు. రాముడు తప్ప మరెవ్వరు వారిని చంపలేరు. పుత్రవాత్సల్యముతో నీవు వెనుకాడకు. రాముని పరాక్రమము నాకు తెలుసు. వసిష్ఠునికి తెలుసు. ఈ మహర్షులందరికీ తెలుసు. ఆలస్యము చేయకుండా రాముని నాతో పంపు. నీకు మేలు జరుగుతుంది" అని ముగించాడు విశ్వామిత్రుడు.



విశ్వామిత్రుని వాక్కులు దశరథునికి పిడుగుపాట్ల వలె వినిపించాయి. హృదయాన్ని, మనసును చీల్చివేశాయి. భయంతో క్రుంగిపోయాడు దశరథుడు. కొంతసేపు నోట మాట రాలేదు. ఆ సమయంలో తన ప్రాణమును కోరే యమునివలె విశ్వామిత్రుడు దశరథునికి కనిపిస్తున్నాడు.

ప్రాణతుల్యంగా చూసుకుంటున్న రాముని రాక్షసులకు అప్పగించవలసి వచ్చినదే అని దశరథుడు దుఃఖించసాగాడు. ఒకవేళ నిరాకరిస్తే విశ్వామిత్రుని శాపానికి గురికావలసి వస్తుందేమో! ఏది చేయాలో, ఎలా చేయాలో తెలియని మహారాజు వినమ్రుడై విశ్వామిత్రునితో పలికాడు.

"మహర్షీ! నా రామునికి పదహారు సంవత్సరాలు కూడా నిండలేదు. చిన్నవాడు. అస్త్ర శస్త్రములను ఉపయోగించుటలో పూర్ణప్రజ్ఞ లేనివాడు. శత్రువుల పరాక్రమమును అంచనా వేయలేడు. యుద్ధమున కౌశల్యము లేనివాడు. కపట యుద్ధము చేయు రాక్షసులతో పోరాడుటకు సరిపోడు.

"విశ్వామిత్రా! జీవిత సాయంసమయంలో నాకు పుత్రులు కలిగారు. రాముడు నాకు ప్రాణంవంటివాడు. రాముడు లేకుండా నేను క్షణం కూడా బ్రతుకలేను. నా రాముడు అమాయకుడు. నీరు లేకుండా చేప జీవించగలదేమోగాని రాముడు లేకుండా నేను జీవించలేను.

"మహర్షీ! నన్ను అనుగ్రహించు. నా సైనికులతో కలిసి నేను వస్తాను. యాగ సంరక్షణము చేస్తాను. మునివర్యా! ఇంతకీ ఆ రాక్షసులు ఎలాంటి వారు? వారి పరాక్రమము ఏపాటిది? వారి వెనుక నిలిచియున్న శక్తివంతు లెవరు?" అని ప్రశ్నల వర్షం కురిపించాడు దశరథుడు.

"దశరథా! పౌలస్త్య వంశమున రావణుడు అనే రాక్షసుడు ఉన్నాడు. అతడు గొప్ప పరాక్రమ వంతుడని ప్రతీతి. అతనిచే ప్రేరేపింపబడి, ఈ మారీచసుబాహువులు అనే రాక్షసులు యజ్ఞమును విఘ్నము చేస్తూ ఉంటారు," అన్నాడు విశ్వామిత్రుడు.

విశ్వామిత్రుని మాటల నాలకించిన దశరథుడు, "మహర్షీ! క్షమించు. నేను ఆ దురాత్ములను సమరంలో ఎదుర్కోలేను. నా యందు, చిన్నవాడైన నా రాముని యందు దయపెట్టి మమ్మల్ని వదలిపెట్టు. రావణుని ఎదిరించే శక్తి నాకుగానీ, నా బిడ్డకు గానీ, నాసైన్యానికి గాని లేదు. కనుక నా రాముని నీకివ్వలేను. నా కుమారుని నీతో పంపలేను," అన్నాడు.

దశరథుని మాటలను ఆలకించిన విశ్వామిత్రుడు క్రోధావిష్టుడయ్యాడు. "రాజా! ముందు మాట ఇచ్చావు. ఇప్పుడు తప్పుతున్నావు. రఘువంశీయులలో మాట తప్పినవారు లేరు.ఆ పనికి నీవు ఉపక్రమిస్తున్నావు. నీకు నీమాటే సమంజసమైతే నేను వచ్చిన దారిని తిరిగి వెళ్తాను. ఇచ్చిన మాటను నిలబెట్టుకోలేని నీవు నీ బంధువులతో గూడి సుఖంగా బ్రతుకు," అని మహర్షి క్రుద్ధుడై పలికాడు.

విశ్వామిత్రుడు క్రోధావిష్టుడు కాగానే భూమి అంతయు కంపించింది. దేవతలు భీతిచెందారు. ఈ భయభ్రాంతులను గుర్తించి గ్రహించిన వసిష్ఠుడు దశరథునితో పలికాడు.

"మహారాజా! నీవు ఇక్ష్వాకు వంశమున ఉద్భవించావు. ధర్మమును రక్షింపవలసిన వాడవు. నీవు ధర్మమును పరిత్యజించుట మంచిది కాదు. ఇది నీ వంశప్రతిష్ఠకు భంగం కల్గిస్తుంది.

"ముందు మాట ఇచ్చావు. ఇప్పుడు కాదనటం ధర్మంకాదు. దానివలన నీవు యజ్ఞ, దానాది కర్మల వలన సాధించిన పుణ్యమును పోగొట్టుకుంటావు.

**త్రిషు లోకేషు విఖ్యాతో ధర్మాత్మా ఇతి రాఘవ**
**స్వధర్మం ప్రతిపద్యస్వ నా ధర్మం వోఢు మర్హసి ॥**

"దశరథా! త్రిలోకముల యందు ధర్మాత్ముడ వని పేరొంది యున్నావు. స్వధర్మమును ఆచరించు. అధర్మమును చేయకు.

"విశ్వామిత్రుడు ధర్మస్వరూపుడు. గొప్ప పరాక్రమవంతుడు. బుద్ధిశాలి. తపోధనుడు. రామునికి అస్త్ర శస్త్ర విద్యల యందు నైపుణ్యము లేదని నీవు ఆలోచింప పనిలేదు. అగ్నిచేత అమృతము రక్షింపబడునట్లు, విశ్వామిత్రునిచే రాముడు రక్షింపబడుతాడు.

"అస్త్రవిద్య యందు విశ్వామిత్రునితో సాటియైన వారు లేరు. అతనికి తెలిసిన అస్త్రములు దేవతలకు కూడా తెలియవు. అంతేగాదు. అతడు నూతన అస్త్రములను కూడా సృష్టించగలడు.

"రాజా! సందేహించకు. ఆడినమాట తప్పకు. రాముని విశ్వామిత్రునితో కూడా పంపు. ఆ రాక్షసులను విశ్వామిత్రుడే వధించగలడు. నీ పుత్రులకు మేలు చేయుటకే అతడు అడుగుతున్నాడు. నా మాట విని మహర్షి వెంట రాముని పంపు".

"రాజా! పెద్దగా వానలు పడినప్పుడు వాగులు, వంకలు, నదులు పరుగులిడి సాగరాన్ని చేరుతాయి. అలాగే సమస్త విద్యలు నీ కుమారుని చేరే శుభ తరుణం ఆసన్నమైంది. తల్లిచెట్టు మొదలును వాటేసుకొని పుట్టిన మొక్క చక్కగా ఏపుగా పెరగదు. దానిని తీసి వేరే చోట నాటితే అది చక్కగా వృద్ధి చెందుతుంది. అలాగే నీ బిడ్డల ప్రగతికి స్థలమార్పు కూడా ప్రస్తుతం అవసరమే. నా మాటవిని రాముని విశ్వామిత్రునికి అప్పగించు" అన్నాడు వసిష్ఠుడు.

**To accept good advice is but to increase one's own ability.**

"సముచిత సలహాను సమ్మతించడమంటే తన సమర్థతను పెంపొందించుకోవడమే" అంటాడు గోథే.

వసిష్ఠుని సలహాను దశరథుడు అంగీకరించాడు. అమృతమయమైన వసిష్ఠుని వచనములు దశరథుని హృదయావేదనను తొలగించాయి. ఇచ్చిన మాటను నిలబెట్టుకొనే ధైర్యాన్ని ప్రసాదించాయి. ప్రసన్న మనస్కుడైన దశరథుడు రాముని పంపాలని నిర్ణయించు కున్నాడు.

దశరథుడు స్వయంగావెళ్ళి రాముని వెంటబెట్టుకొని వచ్చాడు. మంగళవచనములు పలికారు కౌసల్యాదశరథులు. వసిష్ఠుడు రాముని ఆశీర్వదించి అభిమంత్రించాడు. శిరస్సును ముద్దిడుకొని రాముని విశ్వామిత్రునికి అప్పగించాడు దశరథమహారాజు.

విశ్వామిత్రునివెంట రాముడు బయలు దేరాడు. ఆ సమయాన ప్రకృతి పరవశించింది. పులకరించింది. గాలి హాయిగా వీచింది. పైనుండి పుష్పవర్షం కురిసింది. దేవతలు దుందుభులు మ్రోగించారు. ముందు విశ్వామిత్రుడు నడుస్తున్నాడు. వెనుక రాముడు, లక్ష్మణుడు బయలుదేరారు. సూర్యాస్తమయ సమయానికి ముగ్గురూ సరయూనదీ తీరమును చేరారు.



విశ్వామిత్రునితో కూడా రాముని పంపుటకు మొదట దశరథుడుససేమిరా అంగీకరించలేదు. వసిష్ఠ మహర్షి చెప్పిన తరువాత ఆనందంగా అంగీకరించాడు. గురువచవము మనోభిప్రాయము కన్నా గొప్పది. గురువు చెప్పిన దానిని ఆచరించుటకు వెనుకాడని వారే శిష్యులు. గురువు కన్నా మనకు మేలు చేసేవారెవరుంటారు? అందుచేతనే మన సంస్కృతిలో గురువును దైవంతో పోల్చారు.

ఒక అరణ్యంలో గురుశిష్యు లిద్దరూ నిద్రిస్తూ ఉన్నారు . ముందు గురువుగారు నిద్రలేచారు. అక్కడ ఒక విషసర్పము శిష్యుడు పడుకున్న చోటికి వెళ్తూ ఉంది. గురువు ఆ సర్పాన్ని ఆపి ఎక్కడికి వెళ్ళుచున్నదో చెప్పమంటాడు.

నిద్రించుచున్న ఆ శిష్యుడు తనకు గతజన్మలో శత్రువు అనియు, అతనిని కాటువేసి చంపుటకు వెళ్ళుచున్నట్లు ఆ విషసర్పం చెబుతుంది.

గురువు సర్పంతో అంటాడు; "సర్పరాజా! క్షమించు. నా బిడ్డకు బదులుగా నేను క్షమాపణ చెప్పుకుంటాను. అతనిని కరవకు. ఒకవేళ తప్పనిసరి అయితే నన్నుకరచి నీ పగదీర్చుకో".

గురువుగారి విశాల హృదయానికి, దివ్యప్రేమకు స్పందించిన సర్పము వెనుదిరిగి వెళ్తుంది. ప్రేమ జయించలేనిది ఈ ప్రపంచంలో ఏదీ ఉండదు.

కానీ మనం ఒక్క విషయం ఆలోచించాలి. "నన్ను కరచి పగదీర్చుకో" అని గురువు చెప్పినట్లు తండ్రి గాని, భర్తగాని, బిడ్డగాని, మిత్రుడు గాని ఈ ప్రపంచంలో చెబుతారా?

విశ్వామిత్రుడు గొప్పమహర్షి. మిత్రుడు ఎప్పుడూ మేలే చేస్తాడు. విశ్వానికే మేలు చేయువాడు కనుక మహర్షి విశ్వామిత్రు డయ్యాడు. విశ్వానికి మేలు చేయువాడు యజ్ఞం చేయకుండా ఎలా ఉంటాడు? లోకకళ్యాణము కొరకు చేసే ప్రతి కార్యమూ యజ్ఞమే.

లోకకళ్యాణము కొరకు కొందరు పాటుపడుతూ ఉంటే దానిని పాడుచేసే లోక కంటకులు కూడా కొందరు ఉంటారు. వారే తాటక మారీచాదులు. అసుర స్వభావం కలవారు అంతకన్నా గొప్పగా ఎలా చరించగలరు?

యాగమును భగ్నం చేస్తున్న తాటక మారీచాదులను సంహరించే శక్తి తనకున్నా తాను ఆపనిని చేయకుండా దశరథుని వద్దకు వెళ్తాడు విశ్వామిత్రుడు. శ్రీరాముని సహాయమును అర్థిస్తాడు. తన శక్తిపైన గాకుండా పరమాత్మ శక్తిపైన ఆధారపడి జీవించువాడే భక్తుడు. అతడే మహర్షి అవుతాడు.

దైవకార్యాలకు వచ్చే విఘ్నాలను దైవమే పోగొట్టాలి. పరమాత్మ యొక్క అమృతమయ దృష్టి పడనిదే లోకకళ్యాణము కొరకు జరుగు కార్యములు జయప్రదము కాలేవు. విశ్వామిత్రుని వలె లోకకళ్యాణమును వాంఛించి కార్యక్రమములు చేయువారిని రాముడు అనుసరించి నడుస్తూ ఉంటాడు.

రాజు యజ్ఞమయ జీవనాన్ని జనజీవనంలో ఆవిష్కరించాలి. రాజు యజ్ఞాలను ప్రోత్సహించాలి. ఒకవేళ రాజు దారితప్పితే పెద్దలు రాజును ఋజు మార్గంలో నడపాలి. వసిష్ఠుడు దశరథుని విషయంలో అదే చేశాడు.

కానీ ఈనాడు ఆ అవకాశమే లేకుండా పోయింది. దేశ శ్రేయస్సు పరిపాలించేవారికి అవసరం లేదు. వారికి సముచిత సలహాలిచ్చే వారు కూడా లేరు. ఇచ్చినా ప్రభువుల అహంకారం పుచ్చుకొనే స్థితిలో కూడా లేదు.

విశ్వామిత్ర రామలక్ష్మణులు సరయూనదీ దక్షిణ తీరము చేరారు. "కుమారా! ఆచమనము చేయి. మంత్రములను, బల, అతిబల అనెడి విద్యలను నీకు ప్రసాదిస్తాను" అన్నాడు రామునితో విశ్వామిత్ర మహర్షి.

రాముడు ఆచమనము చేసి, శుచిగా మహర్షిని సమీపించి బల, అతిబల విద్యలను గ్రహించాడు. దివ్యానందమును పొందాడు.

విశ్వామిత్రుడు శ్రీరాముని ఆశీర్వదిస్తూ "రామా! ఈ విద్యలు అద్భుతమైనవి. వీటివలన నీకు శ్రమ తెలియదు. అనారోగ్యం ఉండదు. జ్వరాదులు నిన్ను సమీపించవు. రాక్షసులు నిన్ను జయించలేరు. ఇపుడు ఈ ప్రపంచములో నీకు సమానులు లేరు. భవిష్యత్తులో కూడా ఉండబోరు. రామా! మార్గమధ్యమున ఈ ఉభయ విద్యలను నీవు జపించినచో నీకు ఆకలిదప్పులుకూడా తెలియవు."

**తపసా సంభృతే చైతే బహురూపే భవిష్యతః**

"ఈ విద్యలను తపస్సు ద్వారా వృద్ధి చేసినచో వివిధ ఫలములను పొందగలవు" అన్నాడు.

ప్రేమతో గురువు విద్యను ప్రసాదించవచ్చు. గురువు ప్రసాదించిన విద్యలను శిష్యుడు వృద్ధి చేసుకోవాలి. స్వాధ్యాయముతో పాటు తపస్సు కూడా ఉండాలి. అప్పుడే ప్రగతి సాధించబడుతుంది.

రాముడు గురువునుండి విద్యలను గ్రహించాడు. ఆ రాత్రి ముగ్గురు సరయూ తీరమున సుఖంగా నిద్రించారు.

**దశరథ నృపసూను సత్తమాభ్యాం తృణ శయనేఽనుచితే సహోషితాభ్యాం**
**కుశిక సుత వచోఽను లాలితాభ్యాం సుఖమివ సా విబభౌ విభావరీచ ॥**

"రామలక్ష్మణులు పూర్వము ఎప్పుడూ అలవాటులేని గడ్డిపాన్పుపై శయనించినారు. విశ్వామిత్రుని లాలింపు వాక్కుల నాలకిస్తూ ఆ రాత్రి వారిరువురు సుఖముగా నిద్రించారు"

ఇచ్చట మన సంస్కృతిలో అనుస్యూతంగా వచ్చుచున్న గురుశిష్య పరంపర వైభవమును వాల్మీకి మనముందు ఉంచుతున్నాడు.

రామలక్ష్మణులు రాజకుమారులు. పైగా మంచి యవ్వనమున ఉన్నవారు. వారికి రథములు, వాహనములు ఎన్నో ఉన్నాయి. కాలినడక నెరుగరు. అయినా విశ్వామిత్రుని వెంట నడచి వెళ్తున్నారు.

అంతేగాదు. మెత్తని పరుపులపై పరుండే రాకుమారులు ఈనాడు తృణశయనులైనారు. సాధారణంగా ఈ మార్పువలన వారికి నిద్రాభంగమై ఉండాలి. కానీ అలాజరుగలేదు. వారు సుఖంగా నిద్రించారు అంటున్నాడు వాల్మీకి.

గురువును అనుసరించు నపుడు తన వ్యక్తిగత సుఖాలకు శిష్యుడు ప్రాధాన్య మివ్వకూడదు. గురు సాన్నిధ్యము లభించగనే పూర్వజీవితమును మరచిపోవాలి. అనుకూల



పరిస్థితుల కొరకు శిష్యుడు అర్రులు చాచకూడదు. గురువుకు అనుకూలంగా జీవించడంలోనే ఆనందం ఉందని భావించాలి. ప్రతికూల పరిస్థితులను కూడా అనుకూలంగా మలచుకోవాలి. ఇది మన సంప్రదాయంలో శిష్యులు అనుసరించ వలసిన, ఆచరించవలసిన ధర్మము.

**విశియాతే జే ఉపదేశితీ తే అపవిత్ర ఉపదేశస్థితి**
**జే విశ్వాన చర్మపాత్రా ప్రతీ గోక్షీర భరతీ ధారోష్ణ ॥**

"శిష్యునికి ఉండవలసిన లక్షణములు లేనిచో అట్టి శిష్యునికి ఉపదేశించడం వ్యర్థము. కుక్క తోలుతో తయారైన సంచిలో గోక్షీరమును నింపినట్లు ఉపదేశము అపవిత్రమవుతుంది." అంటారు భావార్థ రామాయణంలో సంత్ ఏకనాథ్ మహరాజ్.

రాముడు ధర్మస్వరూపుడు. మనము ఆచరించవలసిన ధర్మములను ముందుగా తాను ఆచరించి చూపుతాడు. రాక్షస సంహారము గావించి, యజ్ఞ సంరక్షణ చేయమని దశరథుడు చెప్పినపుడు రాముడు బదులు చెప్పకుండా సంతోషంగా విశ్వామిత్రుని అనుసరించాడు. ఇక్కడ పుత్ర ధర్మాన్ని నెరవేర్చినాడు.

విశ్వామిత్రుని వెంట కాలినడకన పయనించి, తృణశయనమున పవ్వళించి ఆదర్శ శిష్యుడుగా శోభిస్తున్నాడు. ఇక్కడ శిష్యధర్మాన్ని పాటిస్తున్నాడు.

తృణశయను లైనను విశ్వామిత్రుని బుజ్జగింపు మాటలచే రామలక్ష్మణులు హాయిగా నిద్రించినారని పైశ్లోకంలో వాల్మీకి పలికాడు.

గురువచనములు కష్టాల్ని, నష్టాల్ని మరపింపజేస్తాయి. ఆవేదనలు ఆనందాలుగా మారిపోతాయి. విషాదాలు వినోదాలవుతాయి. ప్రతికూలాలు అనుకూలాలవుతాయి.

## పూర్వా సంధ్యా ప్రవర్తతే

ఆ రాత్రి గురుశిష్యులు హాయిగా నిద్రపోయారు. తెల్లవారుతూ ఉంది. పెద్దవాడు కనుక విశ్వామిత్రుడు ముందుగా నిద్రలేచాడు. నదికి వెళ్ళి స్నానాదులు పూర్తి చేసికొని వచ్చాడు. నిద్రించుచున్న రామలక్ష్మణులను చూశాడు.

రాముని రూపము మనోహరంగా ఉంది. ఇలాంటి బిడ్డను కనిన తల్లి జన్మ ధన్యమైంది అని భావించాడు విశ్వామిత్రుడు. రాముని నిద్రలేపబోతూ, ముందుగా రాముని మాతృదేవి యగు కౌసల్యను మనసులో నిలుపుకుంటున్నాడు.

**కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే**
**ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్**

"కౌసల్య యొక్క సత్పుత్రుడవగు ఓ రామా! తెల్లవారుతోంది. ఓ నరశ్రేష్ఠుడా! లెమ్ము. భగవత్ప్రీతి కరమైన కార్యములు ఆచరించవలసి యుంది" అన్నాడు విశ్వామిత్రమహర్షి.

పుత్రుడు సద్బుద్ధి అయితే తల్లిదండ్రులకు సత్కీర్తి లభిస్తుంది. బిడ్డలు ఆచరించు సత్కార్యములు తల్లిదండ్రులను స్మృతికి తెస్తాయి. రాముని చూడగనే విశ్వామిత్రునకు కౌసల్య స్మృతిలో మెదిలింది.

కౌసల్య మంచి బిడ్డను కన్నది. ఆమె కడుపు చల్లగ ఉండుగాక! అనుకుంటున్నాడు విశ్వామిత్రుడు.

కర్తవ్యాన్ని తెలిపేందుకు నిద్రలేపేవాడేసద్గురువు. కర్తవ్యాన్ని విస్మరించి విషయవాసనా నిద్రలో మగ్నమై యున్నవారిని నిద్రలేపుతాడు గురువు. కర్తవ్యాన్ని తెలుపుతాడు. అజ్ఞాన నిద్రనుండి నిద్రలేపువాడే నిజమైన గురువు..

బ్రతుకుకు గమ్యం భగవంతుడు. భగవత్సాక్షాత్కారమే జీవిత లక్ష్యము. లక్ష్యమును అలక్ష్యము చేయువారికి, నిర్లక్ష్యము చేయువారికి సుఖశాంతులు మిగలవు. లక్ష్యమును శిష్యునకు గురువు అందిస్తాడు. అందుచేతనే విశ్వామిత్రుడు **"కర్తవ్యం దైవ మాహ్నికమ్"** దైవ సంబంధమైన కార్యమును ఆచరించవలసి ఉంది అంటున్నాడు.

ఈవిధంగా విశ్వామిత్రమహర్షి ఆనాడు సరయూనదీ తీరాన రామునికి సుప్రభాతం పలికాడు. ఈనాడుకూడా కలియుగ అవతార దైవం శ్రీవేంకటేశ్వరునికి వినిపించే సుప్రభాతంలో కూడా విశిష్టమైన ఈ శ్లోకమే ప్రథమ శ్లోకం.

భగవంతుని నిద్రలేపడము అనేది భక్తి మార్గంలో విశిష్టమైన ప్రథమ సాధనగా తెలియుచున్నది. లేపడానికి భగవంతుడు నిద్రించేవాడా? భగవంతునికి సుప్రభాతం వినిపిస్తూ, మనలో నిద్రాణమై యున్న ఆధ్యాత్మిక శక్తిని జాగృతం చేయడమే ఇక్కడ గమనించదగిన విశేషము. కర్తవ్యాన్ని మనసుకు స్ఫురింప చేయడమే ఇచ్చట కేంద్ర విషయము. విశ్వామిత్రుడు కూడా ఒకవైపు రాముని నిద్రలేపుతూ, మరొకవైపు తనలోతాను మేలుకొంటున్నాడు.

త్యాగరాజస్వామి కూడా అలాగే పరవశించి రాముని ఒక కీర్తనలో నిద్రలేపుతాడు.

**మేలుకో దయానిధీ మేలుకో దాశరథీ**
**మేలుకో దయానిధీ మిత్రోదయమౌవేళ ॥**

అంటాడు. విశ్వామిత్రునికి రాముని గాంచగనే కౌసల్య మనసులో మెదిలితే, త్యాగరాజస్వామికి దశరథుడు హృదయంలో కదుల్తాడు. ముందుగానే నేను మనవి చేసినట్లు సత్పుత్రుడు తల్లిదండ్రులను స్మృతికి తెస్తాడు అనేది అక్షర సత్యం. అక్షయసత్యం.

## మన్మథాశ్రమంలో మకాము

విశ్వామిత్రుని సుప్రభాతంతో రామలక్ష్మణులు నిద్రలేచారు. స్నానం చేసి, సూర్యునకు అర్ఘ్యము నొసగి, జపాదులు పూర్తిచేసుకున్నారు. గురుదేవుడైన విశ్వామిత్రునకు నమస్కరించారు.

రామలక్ష్మణులను వెంటబెట్టుకొని విశ్వామిత్రుడు బయలుదేరాడు. కొంత దూరము ప్రయాణం చేసి సరయూనది గంగానదిలో సంగమించే స్థానాన్ని చేరారు.

శిష్యుడు సరయూనది లాంటివాడు. గురువు గంగానది వంటివాడు. సరయూనది గంగలో సంగమించినట్లు శిష్యుడు గురువును చేరుతాడు. తనలో కలిసిన సరయూనదిని గంగ సాగరమున చేర్చునట్లు, తన నాశ్రయించిన శిష్యుని గురువు పరమాత్మతో చేర్చుతాడు.



ఆ సంగమస్థానంలో అనేక ఋష్యాశ్రమా లున్నాయి. వాటిలో ఒకదానిని రామలక్ష్మణులు చూశారు. వెంటనే విశ్వామిత్రునితో ఇలా పలికారు.

"మహాత్మా! ఈ పుణ్యాశ్రమం ఎవరిది? దీనిలో ఎవరు వసిస్తున్నారు?" అని కుతూహలంతో ప్రశ్నించారు.

వారిమాటలు వినిన విశ్వామిత్రుడు మందహాసమును చిందించి, "ఈ ఆశ్రమ మెవ్వరిదో చెబుతాను వినండి," అన్నాడు. శిష్యులు అడగగనే గురువు నవ్వుతూ చెబుతున్నాడు. శిష్యులు అడిగి తెలుసుకుంటూ ఉంటే గురువుకు ఆనందంగా ఉంటుంది.

"రామా! విను. మన్మథుడు సశరీరుడై ఉండేటప్పుడు అతడిని కాముడు అని పిలిచేవారు. ఇది ఒకనాడు పరమ శివుని ఆశ్రమం. మహేశ్వరుడు ఈ ఆశ్రమంలో తపస్సు చేసుకొంటూ ఉండేవాడు. మతిహీనుడైన మన్మథుడు శివునిపై పూలబాణాలు విసిరాడు. క్రుద్ధుడైన శంకరుడు హుంకరించి మూడవ నేత్రము తెరిచాడు. మన్మథుడు వెంటనే భస్మమయ్యాడు. అతని శరీరము నశించింది. ఆనాటి నుండి మన్మథుడు అనంగు డయ్యాడు. మన్మథుడు అంగత్యాగం చేసిన ప్రదేశము కనుక దీనికి అంగదేశము అనే పేరు వచ్చింది.

"రామా! ఈ ఆశ్రమము శివుడు తపస్సు చేసిన పుణ్య ప్రదేశము. ప్రస్తుతము ఇక్కడ ఉన్న మునులందరు ఈశ్వరుని శిష్యులే. పూర్వము శంకరుడు ఈ ఆశ్రమంలో ఉన్నప్పుడు వీరంతా ఆయనను ఆశ్రయించి ఉన్నవారే. ఈ ఋషులందరూ ధర్మపరాయణులు. పాపరహితులు. ఈ రాత్రికి మనము పవిత్రమైన ఈ ఆశ్రమంలో గడిపి రేపు గంగను దాటుతాము" అన్నాడు విశ్వామిత్రుడు.

తపోనిష్ఠలోయున్న శివునిపై మన్మథుడు బాణాలు విసిరాడు. తపోభంగము చేయాలని యత్నించాడు. ఆధ్యాత్మిక సాధనలకు అవరోధాలు మెండు. కాముని జయించిన వానికే రాముడు లభిస్తాడు. శంకరుడు మూడవ నేత్రాన్ని తెరిచాడు. మన్మథుడు కాలిపోయాడు.

మూడవ నేత్రము ముక్కంటికే గాదు. మనుష్యులందరికీ ఉంది. అదియే జ్ఞాన నేత్రము. ఎవరికి జ్ఞాన నేత్రము తెరచుకుంటుందో వారు కాముని దగ్ధం చేయగలరు.

**సర్వం జ్ఞాన ప్లవే నైవ వృజినం సంతరిష్యసి**

"జ్ఞానమనే తెప్పచే పాపరాశిని దాట గలవు" అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో అర్జునునికి బోధించి యున్నాడు.

గురుశిష్యులు స్నానాదులు ముగించుకొని ఆ పుణ్యాశ్రమంలో ప్రవేశించారు. ఆశ్రమంలోని మునులు విశ్వామిత్రుని ఆహ్వానించారు. అర్ఘ్య పాద్యములను సమర్పించారు. రామలక్ష్మణులకు అతిథి మర్యాదలు చేశారు.

ఈ మన్మథాశ్రమము పూర్వము పరమశివుడు తపస్సు చేసిన ప్రదేశము. ఈనాడుకూడా పాపరహితులైన మహర్షులు అక్కడ తపస్సు చేయు చున్నారు. వారి తపఃఫలితమే ఈనాడు ఆహ్వానం లేకుండా రాముడు ప్రవేశించడం.

చేసిన సాధన ఎన్నడూ వృథాగాదు. పవిత్ర సాధనలు పరమాత్మను నీవద్దకు నడిపించి తీసుక వస్తాయి. **"నను పాలింప నడచి వచ్చితివో నా ప్రాణనాథ"** అని మోహనరాగంలో మనోహరంగా గానం చేశారు త్యాగరాజస్వామి.

సత్కారములు అందించిన తరువాత చక్కని కథలను చెప్పి విశ్వామిత్ర రామలక్ష్మణులను ఋషులు ఆనందింప జేశారు.

అతిథి సత్కారములో ఈవిషయమును ముఖ్యంగా గమనించాలి. అతిథులకు ఆతిథ్యమివ్వడమే ప్రధానం కాదు. ఆతిథ్యం వల్ల దేహానికి ఉపశమనం కల్గుతుంది. అతిథి మనసును కూడా సంతోష పరచాలి. మృష్టాన్నాల కన్నా మంచిమాటలు మనసుకెంతో తృప్తినిస్తాయి.

కొందరు ఇంటికి వచ్చిన వారికి ఆతిథ్య మిచ్చి, ఆ తరువాత **తడిసిన మంచం బిగుసుకున్నట్లు**, ఏదో పోగొట్టుకున్న వారి వలె ఒక పాత్రను అభినయిస్తూ ఉంటారు. వచ్చిన అతిథి పూడిక తెలియని అగాథంలో పడ్డట్లు నానా తంటాలు పడుతూ వుంటాడు.

విశ్వామిత్రుడు కూడా మనోహరములైన అనేక కథలను చెప్పి రామలక్ష్మణులను, మునులను సంతోష పరుస్తాడు.

ప్రాతఃకాలమున లేచి సంధ్యావందనాది పవిత్ర కార్యాలను పూర్తి చేసుకున్నారు రామలక్ష్మణులు. ప్రయాణానికి సిద్ధమయ్యారు. విశ్వామిత్రుడు ముందు నడుస్తూ ఉండగా గంగా తీరము చేరారు.

ప్రయాణం చేయునపుడు గురువుతో సమానంగా నడవకూడదు. గురువు వెనుక నడవడం అలవరచుకోవాలి. స్నేహితులతో నడుస్తున్నట్లు, లేదా వివాహ సమయంలో దంపతులు నడుస్తున్నట్లు గురువు ప్రక్కన నడవకూడదు. దశరథ మహారాజు కుమారుడైనను రాముడు అహంకారము లేనివాడు. అందుచేత ఆచార్యుడైన విశ్వామిత్రునికి వెనుకగా నడుస్తున్నాడు.

మన్మథాశ్రమములోని మునులందరు విశ్వామిత్ర రామలక్ష్మణులను సాగనంపుటకు గంగానదిని చేరారు. ఒక అందమైన నావను మునులు తీసికొని వచ్చారు. "మునిశ్రేష్ఠా! శిష్యులతో గూడి ఈ నావ నెక్కండి. శుభంగా వెళ్ళిరండి" అన్నారు.

విశ్వామిత్రుడు "అలాగే" అని పలికి మునులకు నమస్కరించాడు. నావ కదిలింది. ప్రయాణం సాగుతూ ఉంది.

ఉదయాన్నే ప్రయాణమైన విశ్వామిత్రాదులను ఋషులు తోడుగా వచ్చి సాగనంపారు. అంతేగాదు. వారే నావను తెచ్చి ఎక్కించారు. పూర్వపు రోజుల్లో మన ఆచార వ్యవహారాలు ఇలా ఉండేవి.

అతిథులను సాదరంగా సాగనంపాలి. బండి ఎక్కించి పంపే బాధ్యత కూడా ఆతిథ్యమిచ్చినవాడి మీదనే ఉండేది. ఈ రోజుల్లో దానికి కూడా కాలదోషం పట్టింది. ప్రయాణ సమయంలో అతిథే వెళ్ళి రిక్షా కట్టించుకొని తీసుకువచ్చి, సామాను ఎక్కించుకొని ఒంటరిగా వెళ్ళాలి. అద్దె తానే చెల్లించుకోవాలి. మారేకాలం, మారుతున్న కాలం మార్గంలో పరుస్తున్న ముళ్ళు ఇవే.

## తాటక వన ప్రవేశం

నావ నదీమధ్యమునకు రాగానే ఒక పెద్ద ధ్వని వినిపించింది. ఆధ్వని ఏమిటని రాముడు అడుగుతాడు. సరయూనది గంగానదిలో ప్రవేశించు చున్నదనియు, జలసంక్షోభము వలన ఆ శబ్దము ఏర్పడుచున్నదనియు పలికి, ఆ రెండు నదులు సంగమించే స్థానమునకు నమస్కరించమని విశ్వామిత్రుడు రామునితో చెబుతాడు.



గంగానది ప్రవహించు ప్రదేశములు జ్ఞాన స్వరూపములు. యమున భక్తి స్వరూపము. అయోధ్య వైరాగ్య స్వరూపము. బృందావనము ప్రేమ స్వరూపము.

నదిని దాటి మువ్వురు జన సంచారములేని ఒక భయంకర అరణ్యములో ప్రవేశించారు. ప్రవేశించుటకు సాధ్యపడని ఆ వనమున భయంకర మృగాలు, భయమును పుట్టించు రోదనము చేయు భాసపక్షులు నిండి వున్నాయి. "దారుణమైన ఈ వనము ఎవరిది?" అని రాముడు ప్రశ్నించాడు.

విశ్వామిత్రుడు రామునితో చెప్పుచున్నాడు.

"నాయనా! రామా! పూర్వము మలదము, కరూశము అనే రెండు విశాలమైన దేశములు ఈప్రాంతమున ఉండేవి. వాటిని దేవతలు నిర్మించారు. ఈరెండు దేశములు ధనధాన్య సమృద్ధములై, సిరిసంపదలతో తులతూగు తుండేవి.

ఇలా ఉండగా తాటక అనే యక్షస్త్రీ ఇక్కడ ప్రవేశించింది. అది కామరూపిణి. వెయ్యి ఏనుగుల బలం కలది. పైగా సుందోప సుందులలో ఒకడైన సుందుని భార్య. దానికి మారీచుడు అనే ఒక కుమారుడు గలడు. వాడు రాక్షసుడు.

**తాటక నామ భద్రం తే భార్యా సున్దస్య ధీమతః**
**మారీచో రాక్షసః పుత్రో యస్యాః శక్ర పరాక్రమః**

"తాటక అనే ఆ యక్షస్త్రీ సుందుని యొక్క భార్య. రామా! నీకు క్షేమమగుగాక! ఇంద్రునితో సమానమైన శక్తి గల మారీచుడు అనే కుమారుడు కూడా తాటకకు గలడు." అన్నాడు విశ్వామిత్రుడు.

పైశ్లోకంలో తాటక పేరు చెప్పగనే విశ్వామిత్రుని హృదయంలో కూడా భయం చెలరేగింది. "రామా! నీకు శుభమగు గాక!" అని విశ్వామిత్రుడు శుభవచనం పలికాడు.

దశరథునిసభలో కూడా మారీచసుబాహుల పేర్లు చెప్పాడే గానీ తాటక పేరును ఉదహరించలేదు. తాటక పేరు చెబితే రాముని పంపుటకు బహుశ దశరథుడు అంగీకరించక పోవచ్చునని విశ్వామిత్రుడు అభిప్రాయపడి ఉంటాడు.

విశ్వామిత్రుడు రామునితో చెప్పుచున్నాడు.

"రామా! మారీచుడు భయంకరమైన వాడు. ప్రజలను తీవ్రంగా బాధిస్తూ ఉంటాడు. దుర్మార్గురాలగు తాటక ఈ వనంలో వసించుచున్నది. అందుచేత భయపడి ఈ వనంలో ఎవ్వరూ ప్రవేశించరు. నీ బాహుబలముచే ఆ తాటకను సంహరించు. ఈ దేశమున బాధలను నివారించు," అన్నాడు విశ్వామిత్రుడు.

"మహర్షీ! యక్షులు అల్ప బలవంతులు అని వింటూ ఉంటాము. మరి ఈ తాటకకు అంతటి బలము ఎలా సమకూరినది?" అని రాముడు ప్రశ్నించాడు.

విశ్వామిత్రుడు రామునితో, "వత్సా! పూర్వము సుకేతువు అనే గొప్ప యక్షుడుండేవాడు. అతనికి సంతానప్రాప్తి కలుగలేదు. నియమనిష్ఠలతో అతడు కఠోర తపస్సును చేశాడు. బ్రహ్మదేవుడు తృప్తిచెంది అతనికి తాటక అనే కుమార్తెను ప్రసాదించాడు.

"వెయ్యి ఏనుగుల బలముతో పుట్టిన తాటకను సుందునకిచ్చి సుకేతువు వివాహము చేశాడు. కొంతకాలానికి వారికి పుత్రుడు కలిగాడు. అతడే మారీచుడు.

"అగస్త్యమహర్షి శాపం వల్ల తాటకభర్త సుందుడు మరణించాడు. తాటకమారీచులు అగస్త్యుని ఎదిరించారు. అగస్త్యుడు తల్లిని, కుమారుని రాక్షసులగునట్లు శపించాడు. మహాత్ముడైన అగస్త్యమహర్షి శాపఫలితంగా తాటక భయంకర రూపమును పొందింది. మనుష్యులను భక్షించ సాగింది. అగస్త్యునిపై కోపముచే అతడు చరించిన ఈప్రదేశము నంతటిని నాశనము చేయుచున్నది.

"రాఘవా! దుర్మార్గురాలు, దుష్టురాలు అగు ఈ తాటకను వధించు. గోవులకు, సుజనులకు మేలును చేకూర్చు. నీవు తప్ప మరొకరు దీనిని చంపలేరు.

"రామా! స్త్రీని వధించుట ఎలా అని సందేహించకు. రాజకుమారుడవైన నీవు నిన్ను ఆశ్రయించియున్న ప్రజల కొరకు ఏపని అయినను చేయవచ్చును. దీని పేరు వింటే వీరులైన రాజులే వణికిపోతున్నారు. దీనిని ఆడది అని సంకోచింప పనిలేదు. దానికి మీసం లేదు. అంతే. రోషంలో పురుషుల కన్నా గొప్పదియే.

"ధర్మవిరుద్ధాచరణము గల ఈ స్త్రీని వధించుటలో తప్పులేదు. **"ధర్మో హ్యస్యా న విద్యతే"** ఆమెయందు ధర్మమనేది ఇసుమంతైనా లేదు.

"రామా! అధర్మరూపులైన స్త్రీలను గతంలో వధించియున్న సన్నివేశాలు అనేకములు గలవు. విరోచనుని కుమార్తె యగు మంధరను ఇంద్రుడు వధించినాడు. భృగుమహర్షి భార్యను విష్ణువు చంపినాడు. ధర్మ విరుద్ధముగా ప్రవర్తించు స్త్రీలను మరి ఇంకెందరో వధించి యున్నారు. ఆవిషయములో దోషముండదు. నామాటవిని, సంకోచమును తొలగించుకొని మాయారూపిణి, దుష్టురాలు అగు ఈ తాటకను వధించి లోకానికి మేలు చేయి" అని విశ్వామిత్రుడు రామునితో పలికాడు.

## తాటక సంహారము

విశ్వామిత్రుని పలుకుల నాలకించిన రాముడు దృఢ నిశ్చయముతో నమస్కరిస్తూ పలికాడు; "మహర్షీ! తమరు ఏది చెబితే దానిని ఆచరించమని మా తండ్రి సభలో నన్ను ఆజ్ఞాపించారు. మీ మాటను శిరసా వహిస్తాను. తాటకను తప్పక వధిస్తాను.

**గోబ్రాహ్మణ హితార్థాయ దేశస్యాస్య సుఖాయ చ**
**తవ చై వాప్రమేయస్య వచనం కర్తు ముద్యతః ॥**

"గోబ్రాహ్మణులకు మేలు చేయుటకు, ఈ దేశ క్షేమము కొరకు, అప్రమేయుడవైన నీ ఆజ్ఞను పాలించుటకు సిద్ధంగా యున్నాను" అని పలికి ధనుస్సు ఎక్కుపెట్టి ధనుష్టంకారం చేశాడు.

ఆ శబ్దానికి తాటకవనములోని ప్రాణులన్నియు భీతి చెందాయి. ఆ శబ్దము విని క్రుద్ధురాలైన తాటక క్షణకాలము ఆగి, వెంటనే ఆశబ్దము వచ్చిన చోటికి వేగంగా పరుగెత్తింది.



రామలక్ష్మణులు తాటకను చూశారు. దాని ముఖం వికారంగా ఉంది. దేహము పెద్దదై అసహ్యంగా ఉంది. తాటకను చూడగనే రాముడు లక్ష్మణునితో ఇలా పలికాడు.

"లక్ష్మణా! ఈ యక్షిణి ఎంత ఘోరంగా ఉందో చూడు. **"భిద్యేరన్ దర్శనాదస్యా భీరూణాం హృదయానిచ"** ఈమెను చూడగనే పిరికి వాళ్ళయితే, వారిగుండెలు పగిలిపోతాయి. లక్ష్మణా! చూడు. ఎదిరించుటకు వీలుపడని ఈమెను ముక్కు, చెవులు ఖండించి వెనుకకు పంపుతాను. స్త్రీ కనుక వధించను." అన్నాడు.

రాముడు ఇలా పలుకుచుండగనే తాటక క్రోధ పరవశురాలై, చేతులెత్తుకొని గర్జిస్తూ రాముని మీదికి ఉరికింది. అది చూచిన విశ్వామిత్రుడు హుంకారముతో దానిని మందలించి, "రామలక్ష్మణులకు స్వస్తి కలుగుగాక - జయము కలుగుగాక" అని పలికాడు.

తాటక దుమ్మెత్తిపోస్తూ రామలక్ష్మణులకు ఏమి తోచకుండా చేసింది. అంతేగాక వారిపై రాళ్ళవర్షం కురిపించింది. రాముడు క్రుద్ధుడయ్యాడు. శిలావర్షాన్ని శరవర్షముచే ఎదుర్కొన్నాడు. అయినా తాటక ఆగలేదు. ఇంకా ముందుకు ఉరకసాగింది. వెంటనే రాముడు ఆమె చేతులను బాణములతో ఖండించాడు.

చేతులు తెగిన తాటక అలసినదియై బిగ్గరగా రోదిస్తూ క్రిందపడింది. లక్ష్మణుడు కోపించిన వాడై ఆ రాక్షసి ముక్కు చెవులను కోసేశాడు. వెంటనే కామరూపిణియైన తాటక గర్జిస్తూ మళ్ళీ రాళ్ళవర్షం కురిపించడం ప్రారంభించింది.

విశ్వామిత్రుడు రామలక్ష్మణులను సమీపించి; "రామా! ఈమెపై ఇంతవరకు నీవు చూపిన జాలి చాలు. ఈ తాటక పాపాత్మురాలు. యజ్ఞములను పాడు చేయుటలో అందెవేసిన చేయి. దుష్టురాలు. దీనిని త్వరగా వధించు. సాయంకాలము కాబోతోంది. సంధ్యాకాలమున రాక్షసులు శక్తివంతంగా ఉంటారు. ఈ లోగానే చంపేయి" అన్నాడు.



ఆ మాటలు వినిన రాముడు తాటక కనబడకున్నను శబ్దమునుబట్టి శరములను ప్రయోగించి తాటకను నిరోధించాడు. తాటక వెంటనే గర్జిస్తూ రామలక్ష్మణుల మీదికి పరుగెత్తుకొని వచ్చింది.

పిడుగువలె పైకి దుముకుచున్న తాటకను రాముడు బాణంతో గుండె మీద కొట్టాడు. రాముడు వేసిన బాణం తాటక వక్షస్థలాన్ని ఛేదించి, మూర్ఖుడైన వానికి చెవిలో చెప్పిన గురుమంత్రంవలె అవతలకి దూసుకొని పోయింది. దాంతో తాళలేక భీకరంగా గర్జిస్తూ, సుడిగాలిలా గిరగిర తిరుగుతూ క్రిందబడి మరణించింది.

దేవతలు తాటక మరణమును చూచి "బాగు-బాగు" అని రాముని ప్రశంసించారు.

దేవేంద్రుడు దేవతలతో గూడి వచ్చి, విశ్వామిత్రుని సమీపించి, "మహర్షీ! నీకు శుభం కలుగుగాక! ఈకార్యము మాకు ఆనందమును కల్గించింది. నీవు రాముని అనుగ్రహింపుము. నీవు పూర్వము తపస్సు ద్వారా సాధించిన అస్త్రాలను రామునికి ప్రసాదించు. అందులకు అతను తగినవాడు. ఈ రాముడు గొప్ప కార్యములు చేయవలసి ఉంది" అని పలికి అంతర్హితులయ్యారు.

పిమ్మట విశ్వామిత్రుడు రాముని దగ్గరగా తీసికొని, శిరస్సు మూర్కొని, "రామా! ఈ రాత్రికి ఈవనమునందే విశ్రమించి రేపు ఆశ్రమానికి వెడదాము" అన్నాడు. రాముడు అలాగే నన్నాడు.

తాటక మరణించడంతో ఆ వనము కుబేరుని ఉద్యానవనమైన చైత్రరథం వలె శోభించింది. ఆ రాత్రి విశ్వామిత్రునితో కూడి రామలక్ష్మణులు ఆ వనము నందే విశ్రమించారు.

"తాటక సంహారము" అనెడి ఈ సన్నివేశమును విశ్లేషించి రాముని స్వభావ స్వరూపాలకు దగ్గరయ్యేందుకు ప్రయత్నిద్దాం.

తాటక రామునికి ఏ విధమైన అపకారము చేయలేదు. తాటక వల్ల రామునికి వ్యక్తిగతంగా కూడా నష్టమేమి వాటిల్లలేదు. అలాంటప్పుడు రాముడు తాటకను వధించుట ఎంతవరకు సమంజసము? ఇది న్యాయమా?

తాటకను వధించమని విశ్వామిత్రుడు రామునికి చెబుతాడు. అంతేకాదు. ఎందుకు చంపాలో చెబుతాడు. గతంలో స్త్రీలను వధించియున్న సన్నివేశాలను ఉటంకిస్తాడు. చివరగ రాముడు తాటకను నిస్సందేహంగా వధిస్తానని మహర్షికి చెప్తాడు.

ఆతరువాత తాటక ఎదురు నిలిచినపుడు దానిని వికృతంగా మార్చి, గమనమును నిరోధించుటకు నిర్ణయించుకొని ఆవిషయాన్ని రాముడు లక్ష్మణునకు చెప్తాడు. బాణములను ప్రయోగించి తాటక చేతులను ఖండిస్తాడేగాని చంపడు.

తాటకను ఎందుకు వధించాలి? అనే సందేహం మనకేగాదు. రామునికి కూడా ఉంది. లేకపోతే నిస్సందేహంగా వధిస్తానని విశ్వామిత్రునికి మాట ఇచ్చినవాడు చంపకుండా కాలయాపన ఎందుకు చేస్తున్నట్లు?

తాటక వలన విశ్వామిత్రుని యజ్ఞానికి విఘ్నం కల్గుతుంది. అట్టి విఘ్నము కలుగకుండా తాటక గమనాన్ని నిరోధిస్తే సరిపోతుంది. చంపవలసిన అవసర మేముంది? అని రాముడు ఆలోచిస్తాడు. గురువు మాటను స్వీకరించినా ధర్మమీమాంస తలెత్తే పెద్దపెద్ద విషయాలలో శ్రీరాముడు తనపైనే తాను ఆధారపడతాడు. సాయంత్రం వరకు వధించకుండా యుద్ధము చేస్తూ కాలయాపన చేయడం వెనుక రాముని ఆంతర్యం ఇదియే.

సాయంత్రము సమీపిస్తుండగా విశ్వామిత్రుడు తాటకను కాలయాపన చేయకుండా వధించమంటాడు. రాముడు మారుమాటాడకుండా తాటకను సంహరిస్తాడు. గురువు ఆజ్ఞను పాటిస్తాడు.

గురువు చెప్పినట్లు వినమని బయలుదేరేటప్పుడు తండ్రి చెప్పాడు. తాటకను వధించమని గురువు ఉత్తరువు జారీ చేశాడు. గుర్వాజ్ఞను ధిక్కరించుట అధర్మం కాదా? ఒకవేళ తాటకను సంహరించడం అన్యాయమే అయితే ఆ అపవాదు విశ్వామిత్రునికి చెందాలే గాని రామునికి గాదు. రాముడు విశ్వామిత్రుని ఆజ్ఞను పాలించాడు. అంతే.



కానీ తాటకను వధించమని విశ్వామిత్రుడు చెప్పుట కూడా అధర్మం కాదు. యజ్ఞ యాగాదులను ధ్వంసం చేస్తూ, తాపసులను పీడిస్తూ, లోక కంటకు రాలైన తాటక వధార్హురాలే గదా? పాపాత్ములకు ఇతరులను బాధించుటే తెలుసు. చేసిన పాపాలు ఊరకే పోతాయా? కర్మఫలాలు అందకుండా ఉంటాయా? మరి తాటకమాత్రం ఎలా తప్పించు కుంటుంది? అందుకే ఘోర మరణం పాలైంది.

సరే. ఇంతవరకు బాగుంది. తాటక సాధువుల్ని హింసించింది. మరి తపశ్శక్తి గల మహర్షులు శాపంపెట్టి తాటకను నిర్మూలించుకోవచ్చు గదా! సాధారణఋషులు ఆ విషయంలో బలహీనులు కావచ్చు. విశ్వామిత్రుడు ఎందుకు సంహరించకూడదు? రామునే ఎందుకు ఉపయోగించుకోవాలి?

ఈ విషయమును దశరథుని ఎదుట విశ్వామిత్రుడే ప్రస్తావించాడు. రాక్షసులను వధించేశక్తి తనకున్నా యజ్ఞములో నిమగ్నమైయున్న తాను శాపాలు ఇవ్వకూడదని దశరథునికి చెప్పాడు. ఈ విషయం సత్యమే. కానీ కేవలం ఈ సమాధానంతోనే మనం తృప్తి పడగలమా? ఇక్కడే కాస్త జాగ్రత్తగా ఆలోచించాలి.

యాగసంరక్షణమే మహర్షికి ప్రధానం కాదు. అదే వాస్తవమైతే, యాగసమాప్తి కాగానే తిరిగి నేరుగా అయోధ్యకు వచ్చి రామలక్ష్మణులను దశరథునికి అప్పగించి ఉండాలి. అలాచేయలేదు.

విశ్వామిత్ర మహర్షి యొక్క పథకము వేరేగా ఉంది. నాలుగు విధాలైన ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని విశ్వామిత్రుడు రాముని గ్రహించాడు. తాటక వధ అనేది మహర్షి దృష్టిలో ముఖ్య ప్రయోజనం కాదు. బాల్యము నందే రాముని వైభవము లోకానికి తెలియాలి అనేదే ఆయన ముఖ్యోద్దేశ్యము. రాముని వైభవము విశ్వానికి తెలిస్తే విశ్వము లబ్ధిని పొందుతుంది. విశ్వానికి మిత్రుడై లోక కళ్యాణమును వాంఛించే విశ్వామిత్ర మహర్షి అంతకన్నా వాంఛించే దేముంటుంది?

శాపగ్రస్తురాలై పడియున్న అహల్యను ఉద్ధరించే శక్తి సంపన్నుడు, దయామయుడు శ్రీరాముడు అని లోకానికి తెలియాలి. అంతేకాదు. మిథిలలో శివధనుర్భంగము జరిగితే రాముని దివ్యశక్తి చెప్పకనే లోకానికి తెలుస్తుంది. ధనుర్భంగము గావించిన దానికి ఫలితంగా జానకితో పరిణయమై, ఒక ఆదర్శ దాంపత్యమును విశ్వము వీక్షించగల్గుతుంది.

శ్రీరాముని విశ్వామిత్రుడు ఆశించడం వెనుక ఇలాంటి ఎన్నో విషయాలు దాగి ఉన్నాయి. కనుక తాటక సంహారము విషయంలో రామునే గాదు, ప్రేరేపించిన మునిపుంగవుని కూడా తప్పుపట్టాల్సిన పనిలేదు.

ఇక ఆధ్యాత్మికంగా చూస్తే తాటక అజ్ఞానము. తాటకను రాముడు బాణంతో కూల్చివేశాడు. తాటక అనెడి అజ్ఞానమును ప్రతి ఒక్కరు రామబాణము అనెడి ఆత్మాన్వేషణము ద్వారా నిర్మూలించాలి.

**'ఆత్మా సత్యం తదన్యత్ సర్వం మిథ్యేతి'**

ఆత్మ ఒక్కటే సత్యము. దానికి అన్యమైన దంతయు మిథ్య లేక మాయ.

రామునికి ఒకేబాణము. తత్త్వ వివేకమున ఆత్మ ఒక్కటియే సత్యము. అజ్ఞానము తొలగితే **"ఏకమేవ అద్వితీయం బ్రహ్మ"** అనెడి అనుభవము జ్ఞానరూపముగా మిగుల్తుంది. తాటకను రాముడు వధించుటలోని అంతర్భావము ఇదియే.

## సిద్ధాశ్రమ ప్రవేశం

తాటకవనములో రాత్రి విశ్రమించారు విశ్వామిత్ర రామలక్ష్మణులు. మరునాడు విశ్వామిత్రుడు రామునితో నవ్వుతూ ఇలా పలికాడు; "రామా! నాకు చాలా ఆనందంగా ఉంది. నీకు శుభము కలుగుగాక! నీకు అస్త్రములను పూర్తిగ ప్రేమతో ప్రసాదిస్తాను. నేను నీకు దివ్యాస్త్రములను ఇచ్చుచున్నాను. వీటి సహాయముచే నీవు దేవ, అసుర, గంధర్వ, ఉరగాదులను నిగ్రహించగలవు" అని పలికి విశ్వామిత్రుడు పూర్వాభిముఖుడై అత్యుత్తమమైన అస్త్రసమూహమును రామునకిచ్చాడు.

అస్త్రదేవతలు రామునికి ప్రత్యక్షమై, "రామా! మేము ఈక్షణం నుండి నీ సేవకులము" అని పలికారు. గురువు అనుగ్రహము లభించిన వారికి సర్వశక్తులు దాసోహ మంటాయి.

రాముడు అస్త్రములను స్వీకరించాడు. హస్తముచే అస్త్ర దేవతలను స్పృశించి, "మీరు నా మనసులో చరించు చుందురు గాక" అని ఆజ్ఞాపించాడు.

రాముడు సంతసించిన వాడై విశ్వామిత్రునికి నమస్కరించాడు. గురువు అందించు జ్ఞానమును నమస్కరిస్తూ అందుకోవడం మన ఆచారం.

ప్రయాణ మయ్యారు ముగ్గురు అరణ్యములో. దారిలో రాముడు, "గురువర్యా! మీ అనుగ్రహముచే అస్త్రములను పొంది నేను అజేయుడ నయ్యాను. పూజ్యుడా! వాటిని ఉపసంహరించే పద్ధతిని కూడా తెలియ గోరుచున్నాను".

మహర్షి అస్త్రముల ఉపసంహారమును కూడా ఉపదేశించాడు. అరణ్యములో నడుస్తున్నారు. ఒక పర్వతమునకు కొంచెము దూరమున వృక్షసమూహము మేఘసరమువలె అందముగా శోభిస్తూ వుండింది. ఆ వనమంతయు మనోహరముగ గోచరిస్తోంది.

"మహర్షీ! ఈప్రదేశము చూచుటకు ప్రసన్నముగా యున్నది. భయంకరమైన తాటకవనమును దాటి వచ్చినామని భావిస్తున్నాను. ఆ ఆశ్రమ మెవరిది? మహాత్మా! దుష్టులైన రాక్షసులు విఘ్నముచేయు ప్రదేశమెక్కడ? నేను యాగ సంరక్షణము ఎక్కడ చేయాలి? రాక్షసులను ఎక్కడ వధించాలి?" అని రాముడు కుతూహలముతో మహర్షిని ప్రశ్నించాడు.

విశ్వామిత్రుడు రామునికి చెప్పుటకుపక్రమించాడు.

"రామా! దేవతాశ్రేష్ఠుడగు శ్రీమహావిష్ణువు ఈ వనము నందు చాలాకాలము వసించినాడు. వామనావతారమునకు ముందు విష్ణువు ఈ ఆశ్రమమున ఉండినాడు. కాశ్యపుడు సిద్ధిపొందిన ప్రదేశము గనుక దీనిని సిద్ధాశ్రమము అంటారు.



"ఆ సమయంలో విరోచనుని కుమారుడైన బలి చక్రవర్తి వైభవంగా రాజ్యపాలన చేస్తూ ఉండేవాడు. ఇంద్రుడి రాజ్యము నంతటిని బలిచక్రవర్తి ఆక్రమించుకున్నాడు. భీతి చెందిన దేవతలు విష్ణుదేవుని సమీపించారు.

"విష్ణుదేవా! బలి యజ్ఞము చేయుచున్నాడు. అడిగిన వారికి అడిగినట్లు దానము లిచ్చు చున్నాడు. ప్రభూ! నీవు దేవతల కొరకు బలిని ఆశ్రయించి దానమును గ్రహించి, మమ్ము ఉద్ధరింపుము" అని పలికారు.

ఈలోగా కాశ్యపుడు భార్యయైన అదితితో గూడి వ్రతమును సమాప్తి చేసికొని శ్రీమహావిష్ణువును స్తుతించాడు.

మహావిష్ణువు ప్రత్యక్షమై వరములు కోరమని చెప్పగా, తమకు పుత్రుడుగా జన్మించమని భగవానుని ప్రార్థించాడు.

విష్ణువు అనుగ్రహించాడు. అదితి పుత్రుడు వామనుడుగ అవతరించాడు. బలిచక్రవర్తి వద్దకు వెళ్ళాడు. మూడు అడుగుల దానమును గ్రహించాడు. బలిని బంధించి, సురులకు తిరిగి దేవలోకమును ప్రసాదించాడు.

"రామా! పూర్వము వామనమూర్తి ఈ ఆశ్రమములో ఉండేవాడు. వామనునిపై నున్న భక్తిచే నేను కూడా ఈ ఆశ్రమంలో నివసిస్తున్నాను. ఇదియే సిద్ధాశ్రమం.

"రామా! యజ్ఞమునకు విఘ్నములను కలిగించు రాక్షసులు ఈ ఆశ్రమమునకే వస్తారు. నీవు వారిని ఇక్కడే చంపాలి. రామా! ఇప్పుడు పవిత్రమైన సిద్ధాశ్రమంలో ప్రవేశిస్తున్నాము.

**తదాశ్రమ పదం తాత తవాప్యే తద్యథా మమ**

"నాయనా! ఈ ఆశ్రమము నా కెలాగో నీకునూ అంతే" అన్నాడు.

ప్రస్తుతము ఈ సిద్ధాశ్రమమున తాను వసించుచున్నాడు కనుక అది విశ్వామిత్రునికి సొంతము. పూర్వము మహావిష్ణువు ఈ ఆశ్రమంలో వసించి యుండుట వలన అది రామునికి కూడా సొంతమే.

మంచు తగ్గిపోయాక పునర్వసు నక్షత్రములతో కలసి చంద్రుడు ప్రకాశించునట్లు శోభిస్తూ, రామలక్ష్మణులతో కలసి విశ్వామిత్రుడు ఆశ్రమంలో ప్రవేశించాడు.

ఆశ్రమములోని మునులు విశ్వామిత్రుని అర్చించారు. రాజకుమారులకు కూడా అతిథిపూజ చేశారు. రామలక్ష్మణులు కొంతసేపు విశ్రాంతి తీసికొని, విశ్వామిత్రునికి నమస్కరిస్తూ ఇలా పలికారు.

"మహాత్మా! ఈరోజునే మీరు యజ్ఞదీక్ష స్వీకరించండి. ఇది సిద్ధాశ్రమం. మీకు యాగసిద్ధి లభిస్తుంది" అన్నారు.

విశ్వామిత్రుడు ఇంద్రియములను నియమించి దీక్షాస్వీకారం చేశాడు.

# యాగ సంరక్షణం

మరునాడు ఉదయాన్నే రామలక్ష్మణులు విశ్వామిత్రుని సమీపించి, నమస్కరించి, "మహర్షీ! రాక్షసులు ఎప్పుడు ప్రవేశిస్తారో, మేము వారిని ఎప్పుడు సంహరించాలో మాకు చెప్పండి. కాలాన్ని వృథాచేయకుండా మేము కార్యాన్ని పూర్తి చేస్తాం" అన్నారు.

రాక్షసులను వధించుటకు కుతూహల పడుతున్న రామలక్ష్మణులను చూసి మునులు సంతసించారు. "రామలక్ష్మణులారా! విశ్వామిత్ర మహర్షి దీక్షలో ఉన్నాడు. ఆయన మాట్లాడడు. ఈ రోజునుండి ఆరురోజులు రాత్రింబవళ్ళు మీరు యాగాన్ని రక్షించాలి. రెప్పవేయకుండా యజ్ఞమును కాపాడాలి" అన్నారు.

ఋషులు యజ్ఞమంటపములో ఆసీను లయ్యారు. రామలక్ష్మణులు ధనుర్బాణములను ధరించి యజ్ఞమును రక్షిస్తూ నిలబడ్డారు.

విశ్వకల్యాణానికి తోడ్పడే కర్మల నాచరించే వారి గుమ్మంలో ధనుర్బాణములను ధరించి రామలక్ష్మణులు కాపలా ఉంటారు.



శ్రేయము లొనగూర్చు కర్మలను రాక్షసమూకలు పాడుచేస్తూ ఉంటారు. రామలక్ష్మణులనగా జ్ఞాన వివేకము లని భావము. జ్ఞాన వివేకములు ఏ మనసులో నిలిచి యుంటాయో అట్టి మనసును అసుర భావాలు పాడు చేయలేవు.

విశ్వామిత్రుడు అగ్నిదేవునికి ఆహుతి ఇస్తున్నాడు. కానీ ఆయన మధ్యమధ్యలో రామలక్ష్మణులను చూస్తున్నాడు. "అన్నా! ఆయన ఎందుకు మనల్ని మాటిమాటికి చూస్తున్నాడు?" అని లక్ష్మణుడు ప్రశ్నిస్తాడు. రాముడు నవ్వుతాడు.



కరచరణాదులు కర్మలో చరించు చున్నను బుద్ధి భగవంతునిపై ఉండాలి. భక్తి లేని కర్మ నిరుపయోగమే. సర్వ సాధనలు భగవత్సాక్షాత్కారము కొరకే. కనుక ఏకర్మ లాచరించుచున్నను పరమాత్మను దర్శిస్తూ ఆచరించే అలవాటు చేసికోవాలి.

రామలక్ష్మణులిద్దరూ కంటిపై రెప్పవాల్చకుండా ఆరు రోజులు రాత్రింబవళ్ళు యాగమును సంరక్షించారు. ఆరవరోజు వచ్చింది. "లక్ష్మణా! అప్రమత్తుడవై ఉండు" అని పలికాడు రాముడు.

యజ్ఞవేదిక భగ్గున జ్వలించింది. విశ్వామిత్రుడు జాజ్వల్యమానంగా ప్రకాశిస్తున్నాడు. ఈలోగా ఆకాశమున భయంకరమైన శబ్దము వినిపించింది.

మేఘములు వర్షాకాలమున ఆకాశమును ఆవరించునట్లు మారీచ సుబాహువులు ఆకాశమున చేరి మాయచేస్తూ నిలబడ్డారు. అనేక మంది రాక్షసులు ఆకాశాన్నాక్రమించారు. రక్తవర్షం కురిపించ సాగారు. ఆ రక్తం యజ్ఞవేదిక మీద పడింది.

ఇంతలో రాముడు పరుగెత్తి వచ్చి ఆకాశమున చరిస్తున్న రాక్షసులను చూశాడు. తొందరగా సమీపిస్తున్న మారీచ సుబాహువులను చూసి, "లక్ష్మణా! వాయువు మేఘములను చెదరగొట్టునట్లు దుష్టులు, మాంసభక్షకులు అగు ఈ రాక్షసులను మానవాస్త్రముచే ఎగుర గొడతాను. చూడు;" అని చెబుతూనే మానవాస్త్రముతో మారీచుని గుండెమీద కొట్టాడు. మారీచుడు నూరు యోజనముల దూరం ఎగిరిపోయి ఒక సముద్రంలో పడ్డాడు.

దురాత్ములైన వారు రాముని అనుగ్రహమునకు దూరులవుతారు. నూరు సంవత్సరములు నిండు జీవితము జీవించినను మరల భవసాగరమున పడిపోతూ ఉంటారు. అట్టివారే మారీచులు.

రామబాణముయొక్క దివ్యస్పర్శ వలన మారీచునిలో గొప్ప మార్పు కలిగింది. రాముని యొక్క శరఘాతమును గుర్తు తెచ్చుకొంటూ రామునితో పోరు మంచిది కాదని రావణునికి కూడా సలహా ఇస్తాడు.

తాటక అనే అజ్ఞానమునకు మారీచుడు అనే అభిమానము కుమారుడు. బ్రతుకు బాధల పాలగుటకు అభిమానమే ప్రబల కారణము. ఇది బ్రతుకును నికృష్టంగా మారుస్తుంది. పరమాత్మ సంబంధముతో అభిమానము నూరు యోజనములు దాటి, అనగా బ్రతుకులోనే లేకుండా అదృశ్యమవుతుంది.

మారీచుడు రాక్షసుడైనా రామబాణము యొక్క స్పర్శతో మారిపోయాడు. కానీ ఈనాడు చాలామంది ఆలయంలో పరమాత్మను దర్శిస్తారు. స్వాధ్యాయం సాగిస్తారు. తపస్సు నాచరిస్తారు. సంకీర్తన చేస్తారు. కానీ వారి బ్రతుకులలో మాత్రం మార్పురాదు. అట్టివారు మారీచాది రాక్షసుల కన్నా ఘోరమైనవారని భావము.

ఆతరువాత రాముడు ఆగ్నేయాస్త్రమును గ్రహించి సుబాహువు గుండెలపై కొట్టాడు. వెంటనే సుబాహువు ప్రాణాలు విడిచాడు. పిమ్మట రాముడు వాయువ్యాస్త్రమును ప్రయోగించి రాక్షసుల నందరిని చంపేశాడు.

రాక్షసులను వధించిన రాముని ఋషులందరు పొగిడారు. యజ్ఞము నిర్విఘ్నముగా, మంగళకరంగా ముగిసింది.

"రామా! నా కార్యము సంపూర్తి అయింది. తండ్రి మాటను నీవు నెరవేర్చినావు. రాఘవా! ఈ సిద్ధాశ్రమము పేరును సార్థకం చేశావు" అన్నాడు విశ్వామిత్రమహర్షి.

భావార్థరామాయణంలో విశ్వామిత్రుడు ఇలా చెబుతాడు.

**బాల్ పణీ ధీర్‌శూర్ మారిలే ఉద్భట నిశాచర్**

**పరిగర్వ న ధరీ రఘువీర్ తేణే విశ్వామిత్ర సుఖీ ఝాలా**

**వీర్ ధైర్యాంసి జ్ఞాన్ ప్రాంజళే ఐసే నిగర్వీ శిష్యమిళే**

"శ్రీరాముడు బాలుడైనా భయంకర రాక్షసుల్ని వధించాడు. అయినా అతనిలో ఇసుమంతైనను గర్వము లేదు. అట్టి రాముణ్ణి చూచి విశ్వామిత్రుడు ఆనందిస్తున్నాడు. ఇలాంటి వీరధీరుడు, జ్ఞాని, నిగర్వియైన శిష్యుడు గురువుకు లభించాలి".

రామలక్ష్మణులు యాగమును ఆనందముగా, వైభవముగా సంరక్షించినందుకు తృప్తి చెందినవారై ఆరాత్రి హాయిగా నిద్రించారు. ఉదయాన్నే లేచి, దైవకార్యములను పూర్తిచేసికొని, విశ్వామిత్రాది మహర్షులు ఆసీనులైయున్న చోటికి వెళ్ళారు. ఋషులకు నమస్కరించారు.

"మహర్షివర్యా! నీ సేవకులం వచ్చియున్నాము. మీకు ప్రీతియైన కార్యమును ఆజ్ఞాపించండి;" అన్నారు.

విశ్వామిత్రుని అనుమతితో అక్కడ గూడియున్న మహర్షులు రామలక్ష్మణులతో ఇలా పలికారు; "మిథిలాధిపతి యైన జనకమహారాజు గొప్ప యజ్ఞము చేయ సంకల్పించాడు. ఆ యజ్ఞమునకు మేము వెళ్తున్నాము. మీరు కూడా మాతో వస్తే మంచిది. అచ్చట అద్భుతమైన శివధనుస్సును చూడగలరు.

"పూర్వము మిథిలను పాలించిన దేవరాతుడు అను రాజు ఈ ధనుస్సును దేవతల నుండి యజ్ఞఫలంగా గ్రహించాడు. దృఢమైన మధ్యభాగము గల ఆ ధనుస్సును దేవతలు గాని, గంధర్వులు గాని, అసురులు గాని వంచి నారి కట్టలేరు. ఇక బలహీనులైన మానవుల విషయం వేరుగా చెప్పాలా? ఎందరో ప్రయత్నించి విఫలు లయ్యారు. మరెందరో బలవంతులైన రాజులు ప్రయత్నించారు. కాని ఎక్కుపెట్టలేక పోయారు.

"రామా! మాతో వచ్చినచో జనకుని మందిరములో నిత్యపూజ లందుకుంటున్న ఆ శివధనుస్సును చూడగలవు. యజ్ఞమును కూడా దర్శించగలవు" అన్నారు.

విశ్వామిత్ర ఋషిగణముతో కూడి రామలక్ష్మణులుకూడా మిథిలకు బయలు దేరారు.

బయలుదేరే ముందు విశ్వామిత్రమహర్షి వనదేవతలకు నమస్కరించాడు. "వనదేవతలారా! నేను తలపెట్టిన కార్యము ఈ సిద్ధాశ్రమంలో సిద్ధించింది. నేను గంగానదికి ఉత్తర తీరమున యున్న హిమవత్పర్వతమును చేరబోతున్నాను. మీకు క్షేమము కలుగుగాక!" అని సిద్ధాశ్రమమునకు ప్రదక్షిణము చేసి విశ్వామిత్రుడు బయలు దేరాడు. ఆయన వెంట నూరు ఎడ్లబండ్లలో మునులు హోమసాధనములు తీసికొని బయలు దేరారు.



విశ్వామిత్రుడు సాగుతుండగ ఆయన వెంట సిద్ధాశ్రమము నందున్న లేళ్ళు, పక్షులు, జంతువులు వెంబడించాయి. విశ్వామిత్రుడు వద్దని వాటిని వారించాడు. బుజ్జగించి వెనుకకు పంపాడు. సాధుహృదయం పశుపక్ష్యాదులను కూడా స్పందింప చేస్తుంది.

మహర్షులందరు చాలా దూరము పయనించి సాయంత్రానికి శోణనదీ తీరము చేరారు. జపతపాదులు పూర్తి చేసికొని విశ్వామిత్రుని చుట్టూ కూర్చున్నారు. రామలక్ష్మణులు మునులను పూజించారు.

"మహర్షీ! గురుదేవా! ఈ వన ప్రదేశము ఫలపుష్పాదులచే చక్కగా శోభించుచున్నది. ఈ ప్రదేశము పేరేమి? దీనిని గూర్చి తెలుసుకోవాలి అనిపిస్తూఉంది" అన్నాడు విశ్వామిత్రునితో శ్రీరాముడు. విశ్వామిత్రుడు చెప్పుటకు ప్రారంభించాడు.

## విశ్వామిత్రుని వంశ చరిత్ర

బ్రహ్మ కుమారుడైన కుశమహారాజు ధర్మాత్ముడు. పుణ్యపురుషుడు. తపోధనుడు. నైష్ఠికుడు. ఆయనకు కుశాంబుడు, కుశనాభుడు, అధూర్త రజసుడు, వసువు అనే సుగుణ శీలురైన పుత్రులు గలరు. వారు పెరిగి, శ్రేష్ఠులై, నాలుగు అందమైన పట్టణములను నిర్మించారు.

కౌశాంబీ నగరమును కుశాంబుడు, మహోదయ పురమును కుశనాభుడు, ధర్మారణ్యమును అధూర్త రజసుడు, మహోదయ నగరమును వసువు నిర్మించారు.

"రామా! ఇప్పుడు మనము ఉన్న ఈ ప్రదేశము వసువు భూమి. దీని చుట్టు ఐదు పర్వతాలున్నాయి. శోణనది కూడా వసువుదే. ఈ నదీతీరము అందు గొప్ప పంటలనిచ్చే పొలాలున్నాయి" అని విశ్వామిత్రుడు చెప్పసాగాడు.

వసువు సోదరుడైన కుశనాభుడు ఘృతాచి అనే అప్సరస్త్రీని పరిణయమాడాడు. అతనికి వందమంది పుత్రికలు పుట్టారు.

ఆ నూరుగురు అమ్మాయిలు యౌవనవతులై, రూపవతులయ్యారు. వర్షాకాలము నందు మెరుపు తీగలవలె శోభించారు. ఉద్యానవనములో వారు విహరిస్తూ ఉంటే మబ్బుల మధ్య నక్షత్రాల వలె ప్రకాశించేవారు.

అందమైన అవయవములతో శోభిస్తున్న ఆ కన్యలను వాయుదేవుడు చూశాడు. మోహితుడయ్యాడు. వారిని సమీపించాడు.

"కన్నియలారా! మీ అందానికి నేను ముగ్ధుడనయ్యాను. మీకు గొప్ప ఆనందాన్ని ప్రసాదించాలని సంకల్పించాను. నాప్రేమను గ్రహించండి. నాకు భార్యలు కండి. మీకు దీర్ఘాయువు లభిస్తుంది.

**చలం హి యౌవనం నిత్యం మానుషేషు విశేషతః**

"యౌవనము అస్థిరమైనది. మానవులలో మరీను" అంటూ,

"నన్ను పరిణయమాడితే స్థిరమైన యౌవనము ప్రాప్తిస్తుంది. మీరు దేవతాస్త్రీలు అవుతారు" అన్నాడు వాయుదేవుడు.

"సురోత్తమా! మేము కుశనాభుని బిడ్డలము. నీవు దుర్బుద్ధివై మమ్ములను ఆశించావు. ఇది ధర్మంకాదు. మా వివాహాలు మా తండ్రిగారి నిర్ణయంపై ఆధ ారపడి ఉంటాయి. స్వేచ్ఛానుసారముగ భర్తను పొందడం ఆచారం కాదు. సంప్రదాయం కాదు. ధర్మం కాదు.

**మా భూత్స కాలో దుర్మేధః పితరం సత్యవాదినమ్**
**అవమన్య స్వధర్మేణ స్వయం వర ముపాస్మహే**

"ఓ దుర్బుద్ధీ! సత్యరూపుడైన తండ్రిని తిరస్కరించి మాకు మేముగా వరుని ఎన్నుకొనే కాలము ఎన్నటికి రాకుండుగాక!

"మాకు తండ్రియే ప్రభువు. తండ్రియే దేవుడు. **"యస్య నో దాస్యతి పితా స నో భర్తా భవిష్యతి"** మా తండ్రి మమ్ములను ఎవరి కిచ్చునో అతడే భవిష్యత్తులో మా భర్త కాగలడు."

వారి మాటలకు ఆగ్రహపడిన వాయుదేవుడు వారికి వాయుదోషమును కల్గించాడు. వారంతా పట్టుతప్పిన కీళ్ళతో బలహీను లయ్యారు. గూనివారయ్యారు.

కన్నీరు కార్చుతూ జరిగిన విషయమును కన్యలు తండ్రియైన కుశనాభునితో చెప్పారు. తండ్రి బిడ్డలతో ఇలా పలికాడు.

"బిడ్డలారా! క్షమించుట అనునది ఓర్పుగలవారు చేయుకార్యము. మీరు సహనశీలురై నా వంశగౌరవమును కాపాడినారు. సహనము సర్వకళ్యాణప్రదము.

**క్షమా దానం క్షమా యజ్ఞః క్షమా సత్యం హి పుత్రికాః**
**క్షమా యశః క్షమా ధర్మః క్షమయా విష్ఠితం జగత్**

"పుత్రికలారా! ఓర్పే దానము. ఓర్పే యజ్ఞము. ఓర్పే సత్యము. ఓర్పే కీర్తి. ఓర్పే ధర్మము. ఓర్పుమీదనే ఈ ప్రపంచము నిలిచియున్నది."

కుశనాభుడు పుత్రికలను ఓదార్చి, లోనికి పంపి, వారికి వివాహములు చేయాలని మంత్రులతో సంప్రదించాడు.

దేవేంద్రునితో సమానుడును, కాంపిల్యా నగరమును పాలించు తేజోవంతుడయిన బ్రహ్మదత్తునకు తన కన్యల నివ్వాలని కుశనాభుడు నిర్ణయించాడు. బ్రహ్మదత్తునికి కుశనాభుని నూర్గురు కన్యలతో వివాహం జరిగిపోయింది.

తపస్సంపన్నుడైన బ్రహ్మదత్తుడు ఆ కన్యలను స్పృశించగనే వారి కుబ్జత్వము పోయింది. వాయుదోషము అంతరించి గొప్ప శోభతో ప్రకాశించారు.

"రామా! బ్రహ్మదత్తునితోకూడా కన్యలు అత్తగారింటికి వెళ్ళిన తరువాత కుశనాభుడు కుమారులను పొందుటకై పుత్రకామేష్టిని చేశాడు.

"కొంత కాలానికి కుశనాభునికి పరమధార్మికుడైన పుత్రుడు కలిగాడు. అతనిపేరు గాధి. అతడెవరో గాదు. స్వయాన నా తండ్రియే. అందుచేత నన్ను గాధి నందనుడు అంటారు. కుశుని వంశమున పుట్టుటచేత నన్ను కౌశికుడని కూడా పిలుస్తారు.

"రామా! నాకు సత్యవతి అనే అక్కగారు ఉండేది. మహాపతివ్రత యైన ఆమెను



ఋచకున కిచ్చి వివాహం చేశారు. భర్తసేవలతో ఆమె తరించి పోయింది. పుణ్యవతి యైన నా సోదరి సత్యవతి తీర్థ స్వరూపంగా మారింది. కౌశికీ నదియై హిమవత్పర్వతమున ప్రవహిస్తూ ఉంది. నేను హిమవత్పర్వతమునందే నివసించుటకు ఆమె మీదున్న ప్రేమకూడా కారణము. యాగమును పూర్తిచేయాలి అనే సంకల్పంతో నేను ఆమెను వదలి సిద్ధాశ్రమం వచ్చాను. జనకుని యాగమును వీక్షించిన పిదప మళ్ళీ హిమవత్పర్వతం చేరుతాను.

"రామా! నీవు అడిగావు. నా జన్మ విశేషాలు చెప్పాను. ఇప్పటికే చాలా రాత్రయింది. ఇక నిద్రపొండి. రేపు ప్రయాణంలో బడలిక లేకుండా ఉంటుంది," అని పలికి సూర్యుడు అస్తాద్రిని చేరినట్లు విశ్వామిత్రుడు నిద్రలోకి జారిపోయాడు.

విశ్వామిత్రుడు చెప్పిన కథ నాలకించిన మునులు సంతసించారు. విశ్వామిత్రుని పదేపదే కొనియాడారు. కుశవంశమునందు ఆవిర్భవించిన వారంతా బ్రహ్మదేవునితో సమానులు అని శ్లాఘించారు. రాముడు కూడా మహర్షిని ఆశ్చర్యంతో శ్లాఘించి నిద్రించాడు.

## గంగ వైభవము

ఉదయాన్నే అందరూ నిద్రలేచారు. ప్రయాణానికి సిద్ధమయ్యారు. శోణనదిని సమీపించగనే దానిని ఏమార్గంలో దాటాలి? అని రాముడు విశ్వామిత్రుని అడిగాడు.

**ఏష పన్థా మయోద్దిష్టో యేన యాన్తి మహర్షయః**

"మహర్షులు ఏ మార్గమున వెళ్ళుచున్నారో ఆ మార్గముననే వెళ్దాము" అన్నాడు భావగర్భితంగా విశ్వామిత్రుడు.

మార్గా లెన్నయినా గమ్యం ఒక్కటే. కానీ పయనించేటప్పుడు మార్గంకూడా సురక్షితంగా ఉండేదయితే ఇంకా మంచిది.

భగవంతుని చేరేందుకు ఎన్నో మార్గాలు. కానీ మహర్షులు నడచిన బాటే మనకు శ్రేయస్కరము. అదియే కళ్యాణప్రదము. విరక్తులై, ధనకాంక్ష లేనివారై, త్యాగధనులై, జ్ఞానవంతులైన మహర్షులు చరించిన మార్గంలోనే మనం తరించాలి. మహర్షులు నడచిన బాటే మనకు శ్రీరామరక్ష.

కలియుగధర్మమా! అన్నట్లు రోజురోజుకీ విచిత్ర పోకడలతో, కొత్తకొత్త మతాలు, సిద్ధాంతాలు పుట్టుకొస్తున్న ఈ రోజుల్లో రామునకు విశ్వామిత్రుడు చెప్పిన పంథాను సదా మనసులో ధరించి మనం చరించాలని వినమ్రుడనై మీకు తెలుపుతున్నాను.

చాలా దూరము ప్రయాణం చేసి మునులందరు మధ్యాహ్నానికి నదులలో శ్రేష్ఠమైన గంగానదిని సమీపించారు. స్నానాలు చేశారు. అగ్నిహోత్రాది కార్యక్రమాల్ని పూర్తి చేశారు. భుజించిన తరువాత విశ్వామిత్రుని వద్దకు వచ్చి కూర్చున్నారు.

"పూజ్య గురుదేవా! పవిత్రమైన ఈ గంగానది ముల్లోకములను ఎట్లు ఆక్రమించింది? ఎట్లు సముద్రంలోకి ప్రవహించింది?" అని రాముడు కుతూహలంతో ప్రశ్నించగా విశ్వామిత్రుడు సమాధానం చెప్ప ప్రారంభించాడు.

హిమవంతుడు అనే పర్వతరాజుకు గంగ, ఉమ అనే ఇరువురు కుమార్తెలు. అసమాన సౌందర్యము గలవారు. హిమవంతుని భార్య మనోరమ.

జ్యేష్ఠ పుత్రిక యైన గంగ స్వేచ్ఛగా ప్రవహించే సమర్థురాలు. ముల్లోకములకు హితము చేయు ఆమెను తమకు సమర్పించమని దేవతలు హిమవంతుని కోరారు. ముల్లోకములను పవిత్రము చేయు గంగను హిమవంతుడు వారికి ఇచ్చాడు. దేవతలు గంగను తీసికొని దేవలోకం వెళ్ళారు.

పరోపకారం కొరకు హిమవంతుడు తన ముద్దుబిడ్డనే త్యాగంచేశాడు. విశిష్టమైన మన సంప్రదాయానికి అనాదినుండి త్యాగమొక్కటే తెలుసు.

రెండవ కుమార్తె యైన ఉమ గొప్ప తపస్సు నాచరించింది. ఆమె రుద్రదేవుని భర్తగా పొందింది. హిమవంతుని ఇరువురు కుమార్తెలు లోకపూజితులయ్యారు.

## సగరుడు

గంగాదేవి దేవలోకానికి చేరిన వృత్తాంతమును మహర్షి ద్వారా ఆలకించిన రాముడు ఆసక్తితో వివరాలను, విశేషాలను అడుగుతున్నాడు.

"పూజ్యుడా! లోకములను పవిత్రము చేయు గంగ ఏకారణముచేత మూడు మార్గాలలో పయనించు చున్నది? ముల్లోకములలో ఉత్తమనదిగా పేరొందుటకు కారణమేమి?" అని రాముడు అడుగగా విశ్వామిత్రుడు సగరుని చరిత్రను చెప్పుటకు ఉపక్రమించాడు.

పూర్వము అయోధ్యను సగరుడు అనే రాజు పాలించేవాడు. ఆయనకు ఇద్దరు భార్యలు. పెద్దభార్య కేశిని. విదర్భరాజు కుమార్తె యైన కేశిని ధార్మికురాలు. సత్యభాషిణి.

సగరుని రెండవభార్య సుమతి. ఈమె అరిష్టనేమి కుమార్తె. గరుత్మంతునికి సోదరి. అసమాన సౌందర్యవతి.

సగరునికి చాలా కాలము సంతానము లేదు. సంతానముకై పరితపించు సగరుడు భార్యలతో కలిసి హిమవత్పర్వతమునకు వెళ్ళాడు. అక్కడ భృగు ప్రస్రవణము అనే పర్వతము నందు తపస్సు చేశాడు.

సగరుడు వంద సంవత్సరములు తపస్సు చేశాడు. సగరుని తపస్సుచే సంతృప్తి చెందిన భృగుమహర్షి అతనికి వరమును అనుగ్రహించాడు. అత్యధిక సంతానము, అపారకీర్తి లభించునని సగరుని ఆశీర్వదించాడు.

"నీ ఇద్దరు భార్యలలో ఒకామెకు వంశకరుడైన పుత్రుడు పుడతాడు. మరొక ఆమెకు అరవైవేలమంది పుత్రులు పుడుతారు" అని భృగుమహర్షి సగరునితో పలికాడు.

రాణులకు కుతూహలం మెండైంది. వారిరువురిలో ఎవరికి ఒక కుమారుడు, ఎవరికి అరవై వేలమంది కుమారులు కలుగునో చెప్పమని భృగువును అడిగారు.

ఆ విషయమును స్వేచ్ఛగా వారే కోరుకోవచ్చని భృగువు చెప్పాడు. భృగు మహర్షి అలా చెప్పగనే "నాకు వంశకరుడైన కుమారుడు కావాలి" అన్నది జ్యేష్ఠపత్ని యైన కేశిని.



కనిష్ఠపత్నియగు సుమతి తనకు అరవై వేలమంది పుత్రులు కావాలని కోరింది. ముని అనుగ్రహించి ఆశీర్వదించాడు. సతీసమేతుడై సగరుడు భృగు మహర్షిని అర్చించి అయోధ్యకు తిరిగి వచ్చాడు.

కాలం గడచింది. పెద్దభార్య అయిన కేశినికి అసమంజుడు అనే బిడ్డ కలిగాడు. చిన్న భార్య అయిన సుమతి సొరకాయ వంటి గర్భపిండమును ప్రసవించింది. ఆ గర్భపిండము విస్ఫారగా అరవై వేలమంది కుమారులు బహిర్గత మయ్యారు.

పిల్లలందరు పెరిగి యౌవనవంతులయ్యారు. సగరుని జ్యేష్ఠకుమారుడు అసమంజుడు దుర్మార్గు డయ్యాడు. పాపకార్యాచరణకు పూనుకున్నాడు. సజ్జనులను బాధించసాగాడు. పౌరులకు చెడు చేయుట యందే గొప్ప ఆసక్తిని చూపేవాడు.

చిన్నపిల్లలను పట్టుకెళ్ళి సరయూనదిలో తోసేవాడు. ఈత రాని ఆ బిడ్డలు మునిగిపోతూ వుంటే చూసి ఆనందించేవాడు - అని విశ్వామిత్రుడు రామునికి చెప్పాడు.

సాధుస్వభావుడైన సగరునికి దుర్జనుడైన బిడ్డడేమిటి? ప్రారబ్ధాలు ప్రబలమైనవి. దుర్జనులై పుట్టాక దుష్టకార్యాలు చేయకుండా ఎలా ఉండగలరు?

సజ్జనులను బాధించుటలో దుర్జనులు ఆనందిస్తారు. పరుల నష్టాన్ని వారి లాభంగా భావిస్తారు. వారి సుఖదుఃఖాలు వారికి సంబంధించి ఉండవు.

పరుల బాధలను చూసి వారు సుఖిస్తారు. పరుల సుఖాలను గాంచి వారు దుఃఖిస్తారు. ఇతరులకు చెడు చేయాలనే తలంపు కలుగగానే వారి రెండు చేతులు రాక్షసులకువలె వెయ్యి చేతులుగా మారుతాయి. ఇతరులలో దోషాలను చూచునపుడు వారి రెండు కళ్ళు వేయి కళ్ళుగా మారుతాయి. పాయసముపై వ్రాలిన ఈగవలె సజ్జనుల సద్గుణాలను, కీర్తిని వారు పాడుచేస్తారు. వడగండ్లు పంటలను పాడుచేసి అటుపిమ్మట అవికూడా నశించునట్లు దుర్మార్గులు సజ్జనులను దుఃఖమునకు గురిచేసి ఆ తరువాత వారూ నశిస్తారు.

దుర్మార్గుడైన అసమంజుని సగరుడు రాజ్యము నుండి బహిష్కరించాడు. అసమంజుడు పట్టణమును వదలి వెళ్ళిపోయాడు. తరతమ భేదములు లేనివాడే ప్రభువు. దుర్మార్గులు తనవారైనను శిక్షించాలి. సుగుణవంతులు పరులైనను వారిని ఆదరించాలి. అతడే నిజమైన ప్రభువు. అలాగాక, మంచి చేసినా పరులను ఏవగించుకుంటూ, చెడుచేసినా తన వారిని అందలమెక్కించే ప్రభువు నిజానికి ప్రభువు కాదు. ప్రఖరను. అంటే కంచరగాడిద అని భావము. అలాంటి ప్రభువు ప్రజల పాలిటి దురదృష్టము. ప్రగతికి ప్రతి బంధకము. ప్రపంచశాంతికి ప్రతిఘాతము.

అసమంజుని కుమారుడు అంశుమంతుడు. గొప్ప పరాక్రమవంతుడు. సర్వలోక ప్రియుడు. బురదనుండి పద్మము ఆవిర్భవించునట్లు అసమంజుని నుండి అంశుమంతుడు ప్రభవించాడు.

కొంతకాలం పిమ్మట సగరుడు యజ్ఞము చేయాలని సంకల్పించాడు. విశ్వామిత్రుడు అలా చెప్పగనే తమ పూర్వపురుషుడైన సగరచక్రవర్తి యజ్ఞము ఎలా చేసెనో తెలుపమని రాముడు ఋషిని అర్థించాడు. విశ్వామిత్రుడు చిరునవ్వును చిందించి చెప్పసాగాడు.

## పాతాళంలో సగర పుత్రులు

హిమవత్పర్వతమునకు వింధ్య పర్వతమునకు నడుమనున్న పుణ్యప్రదేశమును యజ్ఞమునకు అనువైన స్థలంగా నిర్ణయించారు. యజ్ఞాశ్వమును విడిచారు. సగరుని మనుమడగు అంశుమంతుడు యజ్ఞమును రక్షిస్తూ దానిని అనుసరించాడు.

మార్గమధ్యమున ఇంద్రుడు రాక్షస రూపమును ధరించి యజ్ఞాశ్వమును అపహరించాడు. వేగముగా ఆ గుఱ్ఱమును తీసికొనివెళ్ళాడు.

యజ్ఞ భావంతో జీవించాలని అభిలషించువారికి అవరోధములు మెండుగా ఉంటాయి. ఇంద్రియాలే అడ్డంకులై నిలుస్తాయి. యజ్ఞభావం నుండి మరల్చి మనసును హరిస్తాయి.

గుఱ్ఱము చంచలమైనది. మనస్సు కూడా చంచలమే. ఇంద్రియాలకు ప్రభువే ఇంద్రుడు. కనుక ఇంద్రుడు రాక్షస రూపంలో వచ్చి అశ్వమును అపహరించినట్లు ఇంద్రియాలు మనస్సును హరిస్తాయి. అశ్వమును అపహరించేటప్పుడు ఇంద్రుడు రాక్షసరూపంలో గోచరించినట్లు, మనసును హరించునపుడు ఇంద్రియాలు కూడా ప్రకోపంతో ప్రచండంగా గోచరిస్తాయి.

**యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః**
**ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః**

"కుంతీకుమారా! వివేకియగు పురుషుడు ఎంతగానో ప్రయత్నించు చుండినను ప్రమాద భరితమైన ఇంద్రియాలు అతని మనస్సును బలవంతముగా అపహరిస్తున్నాయి" అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో బోధిస్తారు.

విషజంతువులు సంచరించే ప్రదేశముల యందు వసించువారు ఎలా జాగరూకులై ఉంటారో, అలాగే ఇంద్రియముల విషయములో సాధకులు శ్రద్ధ వహించాలి.

యజ్ఞాశ్వము అపహరించబడింది. అపహరించిన వానిని సంహరించి గుఱ్ఱమును తీసికొని రావాలి. లేనిచో యజ్ఞమున అపచారము సంభవిస్తుంది. అది అందరికీ అశుభమును చేకూరుస్తుంది అని ఋత్విక్కులు సగరునితో చెప్పారు.

సగరుడు తన అరవైవేల మంది పుత్రులను పిలిచాడు. అపహరింపబడిన యజ్ఞాశ్వమునకై అన్వేషించమని ఆజ్ఞాపించాడు. ఒకవేళ భూమిపై కనబడనిచో భూమిని త్రవ్వి పాతాళమున కూడా అన్వేషించమని చెప్పాడు.

సగరపుత్రులు భూమి నంతటిని అన్వేషించారు. అశ్వము అగుపించలేదు. భయంకరమైన నాగళ్ళచే భూమిని ఛేదించారు. ఇలా భూమిని త్రవ్వుచుండగా వివిధములైన జంతువులు నశించాయి. సర్పాలు గతించాయి. రాక్షసులు మరణించారు. అయినా అశ్వం కనిపించలేదు.



సగరపుత్రులు పాతాళలోకము చేరారు. అచ్చట పర్వతమంత ప్రమాణంగల విరూపాక్ష మను ఏనుగు భూమిని మోయుచూ కనబడింది. రాజకుమారులు దానికి నమస్కరిస్తూ ప్రదక్షిణం చేసి ఇంకా లోతుకు వెళ్ళారు.

దక్షిణ దిక్కున వారికి మహాపద్మము అనే ఏనుగు భూమిని మోస్తూ కనబడింది. విస్మయమొందిన సగరకుమారులు దానికి ప్రదక్షిణం చేసి, నమస్కరించి పశ్చిమ దిక్కుగా పయన మయ్యారు.

పశ్చిమ దిక్కున వారికి సౌమనసము అనే ఏనుగు కన్పించింది. దానికికూడా ప్రదక్షిణ వందనాలు చెల్లించి, వారు ఉత్తర దిక్కుగా పయన మయ్యారు.

ఉత్తర దిక్కున శుభకర దేహముతో భూమిని మోయుచున్న భద్రమనే తెల్లని ఏనుగును చూశారు. వారు దానిని స్పృశించారు. వందన ప్రదక్షిణములు చేశారు.

పిమ్మట ఈశాన్య దిక్కుగా వెళ్ళారు. అక్కడ తపస్సు చేసుకుంటున్న కపిల భగవానుని దర్శించారు. ఆ మహాత్మునికి సమీపంలో గడ్డిని మేయుచున్న యజ్ఞాశ్వమును కూడా చూశారు. దానిని చూడగనే సగరపుత్రులు సంతసించారు.

అశ్వమును అపహరించింది కపిలుడే యని భ్రమించారు. నాగళ్ళను, గునపములను, జూళ్ళను చేత పట్టుకొని కపిలుని మీదికి కోపంతో ఉరికారు.

కపిలుడు కన్నుతెరచి హుంకరించాడు. మహాతపస్వియైన కపిలుడు హుంకరించగనే సగరకుమారులు భస్మమై పోయారు.

చాలా కాలమైనా సగరపుత్రులు 'తిరిగిరాలేదు. కారణము అర్థంగాని సగరుడు తన మనుమడు, అసమంజుని కుమారుడైన అంశుమంతుని పిలిచి, తన పినతండ్రుల జాడను, యజ్ఞాశ్వము యొక్క జాడను వెళ్ళి తెలిసికోమని చెప్పాడు.

అంశుమంతుడు ఖడ్గమును, ధనుస్సును ధరించి తన పినతండ్రులు వెళ్ళిన మార్గమున పాతాళము వైపు పయనించాడు. దిగ్గజములను అర్చిస్తూ లోని కెళ్ళాడు. అక్కడ భస్మరాశిని చూశాడు. తన పినతండ్రులు అలా అంతరించినందుకు ఆవేదన చెందాడు.

ఇంతలో అక్కడనే యున్న యజ్ఞాశ్వము అంశుమంతుని కంటబడింది. తన పినతండ్రులకు తర్పణము లివ్వాలని అంశుమంతుడు అభిప్రాయ పడ్డాడు. కానీ అక్కడ నీరు కనిపించలేదు. అంతా అయోమయంగా ఉంది.

ఇంతలో తన పినతండ్రుల మేనమామ, సుమతి సోదరుడైన గరుత్మంతుడు కనిపించాడు. లోకములో లభించే జలముతో గాకుండా దేవలోకమున ప్రవహించు గంగా జలముతో తర్పణములు ఇవ్వమని చెప్పాడు. గంగవలన భస్మరాశియైన సగరకుమారులు పవిత్రులై స్వర్గాన్ని చేరుతారని తెలిపాడు.

గరుత్మంతుని ఆజ్ఞను పాలిస్తూ అంశుమంతుడు అశ్వమును తీసికొని అయోధ్యకు వచ్చాడు. జరిగిన విషయమంతటిని సగరునికి చెబుతాడు. సగరుడు చాలా దుఃఖిస్తాడు. కానీ శాస్త్రవిధి ననుసరించి యజ్ఞాన్ని సమాప్తి చేస్తాడు.

గంగను భూమిపైకి ఎలా తీసికొనిరావాలో సగరునికి అర్థంకాలేదు. ఉపాయమేమిటో తెలిసిరాలేదు.చివరగ తనువును చాలించి సగరుడు స్వర్గధామం చేరాడు.

సగరుడు మరణించాడు. అంశుమంతుడు రాజయ్యాడు. అంశుమంతునికి దిలీపుడు అనే పూజ్యుడు బిడ్డగా జన్మించాడు.

అంశుమంతుడు తన రాజ్యభారమును సుపుత్రుడైన దిలీపునికి అప్పగించి, తపస్సు చేయుటకు హిమవత్పర్వతమును చేరాడు. గొప్ప తపోధనుడై, ఆతరువాత దేహమును త్యజించి స్వర్గమును పొందాడు.

## భద్రుడైన భగీరథుడు

తమ పూర్వ పురుషుల, పితామహుల మరణ వృత్తాంతము దిలీపుని బాగా కృంగదీసింది. గంగను తీసికొని వచ్చే ఉపాయమేమిటో దిలీపునికి కూడా తెలిసిరాలేదు.

దిలీపునికి ధర్మపరాయణుడైన భగీరథుడు బిడ్డగా జన్మించాడు. దిలీపుడు అనేక యజ్ఞములు చేశాడు. చాలాకాలము చక్కని రాజ్యపాలనమును అందించాడు. కానీ తన పితామహులగు సగర పుత్రులను ఎలా ఉద్ధరించాలో తెలియక చింతిస్తూ మరణించాడు. స్వర్గము చేరాడు.

భగీరథునికి సంతానము నందు వాంఛయున్నను అతనికి సంతాన ప్రాప్తి కలుగలేదు. గంగను భూలోకమునకు తెచ్చి, తన పూర్వీకులకు సద్గతిని ప్రసాదించాలని భగీరథుడు భావించాడు. రాజ్యమును మంత్రులకు అప్పగించాడు. గోకర్ణ క్షేత్రమునకు వెళ్ళి తీవ్రతపస్సు చేశాడు.

భగీరథుని తపస్సుకు బ్రహ్మదేవుడు సంతోషించాడు. భగీరథుని అనుగ్రహించాడు. వరమును అడుగమని పలికాడు. భగీరథుడు బ్రహ్మదేవునితో ఇలా పలికాడు:

"హే భగవంతా ! నా పితామహులు గంగచే తడుపబడి స్వర్గధామం చేరాలి. ఇది నా మొదటి కోరిక. ఇక్ష్వాకువంశీయులమైన మాకు నిత్య సంతానప్రాప్తి కలుగుతూ ఉండాలి. మా వంశము నశించగూడదు. ఇది నా రెండవ కోరిక" అన్నాడు.

"భగీరథుడా! నీవు కోరిన కోరిక చాలా గొప్పది. దుర్లభమైనది. అయినా నీకు శుభమగు గాక! ఇక్ష్వాకు వంశవర్ధనుడా! గంగాదేవి భూమిపై దిగుటకు ఒక అంతరాయ ముంది. ఆమె దూకుడును వహించే శక్తి, భరించే యుక్తి భూమికి లేదు. గంగను ధరించుటకు మహేశ్వరుడొక్కడే తగినవాడు;" అని చెప్పి గంగతో, దేవతలతో కూడా భాషించి, భగీరథుని ఆశీర్వదించి బ్రహ్మదేవుడు అంతర్హితుడయ్యాడు.

భగీరథుడు మళ్ళీ తపస్సు ప్రారంభించాడు. సంవత్సరకాలము కాలి బొటనవ్రేలుపై నిలబడి భయంకర తపస్సు చేశాడు. తపఃఫలితంగా ఈశ్వరుడు ప్రత్యక్షమయ్యాడు.

"భగీరథా! నేను నీ తపస్సుకు సంతసించాను. గంగను శిరమున వహిస్తాను. నీకు శుభమును చేకూర్చుతాను;" అని పలికాడు. భగీరథుడు సంతసించాడు.



సర్వలోకపూజిత యైన గంగామాత పరవళ్ళు త్రొక్కుతూ, తీవ్రవేగంతో ఆకాశము నుండి దూకి పవిత్రమైన శంభుని శిరస్సుపై నిలిచింది.

"శివుడు నన్ను నిలుపుకోలేడు. శివుణ్ణి గూడ వెంటబెట్టుకొని భూమిని చీల్చుకొని పాతాళానికి చేరుతాను" అని భావించింది గంగమ్మ.

ఈ విషయమును గ్రహించి, "నాపై ఉరికే గంగను కనబడకుండా అదృశ్యం చేస్తాను" అని భావించాడు శంకరయ్య.

గంగ దుమికింది. శివుని జటామండలములో చిక్కుకుపోయింది. బయటికి రాలేకపోయింది. కొన్ని సంవత్సరాలైంది. గంగమ్మ జాడే తెలియడం లేదు. భగీరథునికి ఏమీ బోధపడడంలేదు.

భగీరథుడు పునఃతపస్సు ప్రారంభించాడు. శివుడు సంతోషించాడు. బిందుసరోవరము అనే ప్రాంతమున గంగను విడిచిపెట్టాడు.

శివుడు గంగను వదలినపుడు పావన గంగ ఏడు పాయలుగా చీలి ప్రవహించ సాగింది. వాటిలో హ్లాదిని, పావని, నళిని అను మూడు పాయలు తూర్పువైపు ప్రవహించాయి.

సుచక్షువు, సీత, సింధు అనెడి మూడు నదులు పశ్చిమదిక్కున ప్రవహించాయి. ఏడవపాయ భగీరథుని అనుసరించింది. భగీరథుడు దివ్యమైన రథమునెక్కి ముందుకు సాగుచుండగా గంగ భగీరథుని అనుసరించి నడువ సాగింది.

తూర్పుగా ప్రవహించి తూర్పు సముద్రములో సంగమించు ప్రవాహములను నదులు అంటారు. పశ్చిమముగా ప్రవహించి పశ్చిమసముద్రములో సంగమించు ప్రవాహములను నదములు అంటారు. నదులకు నదములకు సాగరుడే గతి. సాగరుడే పతి.

గంగ ఆకాశమునుండి మహేశ్వరుని శిరస్సు పైకి దుమికి, అచ్చట నుండి భూమికి చేరి తీవ్రంగా ప్రవహించసాగింది. పరమ పవిత్రమై, పరమాశ్చర్య కరమైన ఈ గంగావతరణమును గాంచుటకు దేవతలు దివినుండి భువికి దిగివచ్చి బారులుదీరి నిలబడ్డారు.

కొన్నిచోట్ల గంగ వేగంగా ప్రవహించ సాగింది. కొన్నిచోట్ల మెల్లగా, వంకరగా కొన్నిచోట్ల, పైకి కొన్నిచోట్ల, క్రిందికి మరికొన్నిచోట్ల, కొన్ని చోట్ల జలము జలమును ఢీకొనగా పైకెగిరి పడుచూ, శోభాయమానంగా ప్రవహించసాగింది గంగామహాతల్లి.

శివుని శిరస్సుపై నుండి పడుట వలన అది పవిత్రోదకమని భావించి దేవమనుష్యులు దానిని స్పృశించి మస్తకములపై చల్లుకున్నారు. కొందరు స్నాన మాచరించి పాపవిముక్తులయ్యారు.

గంగానది భగీరథుని అనుసరించి ప్రవహించ సాగింది. ఇలా ప్రవహించుచూ పయనిస్తున్న గంగ మధ్యలో జాహ్నుమహర్షి యజ్ఞము చేయుచున్న యాగశాలను ముంచేసింది. కోపగించిన జాహ్నుముని గంగను సంపూర్ణంగా పానం చేసేశాడు.

పిమ్మట మహర్షులు, దేవతలు, గంధర్వులు ఆశ్చర్యపడి జాహ్నుమహర్షిని అర్చించారు. గంగను జాహ్నుసుతగా అభివర్ణించారు. సంతసించిన జాహ్నుముని తన కర్ణముల గుండా గంగను విడిచినాడు. అందుచేత గంగకు "జాహ్నవి" అని పేరు కల్గింది.

గంగ మరల భగీరథుని అనుసరించింది. సాగరాన్ని చేరింది. సగరపుత్రులను తరింప చేయుటకు పాతాళానికి పయనమైంది. పవిత్రమైన గంగాజలము పాతాళము నందలి భస్మమును తడుపగా సగరతనయులు స్వర్గధామము నలంకరించారు.

భగీరథునికి పాతాళమున బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయ్యాడు. "భగీరథా! సగరుని అరవై వేలమంది పుత్రులు తరించారు. గంగను నీవు భూలోకములో ప్రభవింప చేశావు. కనుక ఆమె నీకు పుత్రిక.

**ఇయం చ దుహితా జ్యేష్ఠా తవ గంగా భవిష్యతి**
**త్వత్కృతేన చ నామ్నాథ లోకే స్థాస్యతి విశ్రుతా ॥**

"నాయనా! భగీరథా! ఈ గంగ నీకు జ్యేష్ఠపుత్రిక. నీ పేరుతో కూడి "భాగీరథి" అనెడి నామముతో లోకమున ప్రసిద్ధి కెక్కుతుంది.

"రాజా! గంగ "భాగీరథి" అని, "త్రిపథగ" అని విఖ్యాతి పొందుతుంది. స్వర్గలోక, భూలోక, పాతాళలోక మార్గములను మూడు మార్గములగుండా ప్రవహించుటచే, గంగ "త్రిపథగ" అని కీర్తించబడింది;" అన్నాడు బ్రహ్మదేవుడు.

స్వర్గమున ప్రవహించు పాయను "మందాకిని" అంటారు. భూలోకమున ప్రవహించు పాయను "భాగీరథి" అంటారు. పాతాళమున ప్రవహించు పాయను "భగవతీ" అంటారు.

బ్రహ్మదేవుడు భగీరథునితో పలుకుతున్నాడు:

"భగీరథా! పవిత్ర గంగాజలముతో నీ పితామహులందరికీ తర్పణములు ఇమ్ము.

"మీ పూర్వీకుడైన సగరుడు గంగను భూమిపై అవతరింప జేయాలని ఎంతగానో ప్రయత్నించి విఫలుడయ్యాడు.

"అలాగే అంశుమంతుడు కూడా ప్రయత్నించాడు. కాని అతని ఆశకూడా ఫలించలేదు.

"గొప్ప తపస్సంపన్నుడు, సుగుణవంతుడు, రాజర్షియైన నీ తండ్రి కూడా తీవ్రంగా ప్రయత్నించాడు. తీరని కోరికతోనే తనువును చాలించాడు.

"భగీరథా! నీవు ఒక్కడివే సాధించగలిగావు. గొప్ప యశస్సును సంపాదించ గలిగావు. రాజా! పవిత్రమైన ఈ గంగలో నిత్యము స్నాన మాచరించి పుణ్యాత్ముడివి కా! నీ పూర్వీకులందరికి జలతర్పణములు విడువు. నీకు క్షేమము కలుగుగాక!" అని పలికి బ్రహ్మదేవుడు అంతర్ధాన మయ్యాడు.

భగీరథుడు సగరపుత్రులకు తర్పణములు వదిలాడు. తిరిగి వైభవముగా అయోధ్యలో ప్రవేశించాడు. మరల రాజ్యభారమును వహించాడు.

భగీరథుని పాలనలో ప్రజలంతా సుఖజీవనమును గడిపారు. తన అభీష్టము నెరవేరుట చేత భగీరథుడు కూడా శోకరహితుడై సుఖముగా రాజ్యపాలనము చేశాడు.

విశ్వామిత్రుడు రామునితో చెప్పుచున్నాడు.



"రామా! గంగావతరణమును గూర్చి చెప్పమన్నావు. విపులంగా చెప్పాను. ఇది మంగళ ప్రదమగు గాథ. నీకు క్షేమము కలుగుగాక! సంధ్యాకాలము మించుతున్నది. జపతపాదులు పూర్తి చేయండి.

"రాఘవా! ఈ గంగావతరణ కథ పవిత్రమైనది. ఇది యశస్సును, సంపదను, ఆయుష్షును, సంతానమును, స్వర్గమును ప్రసాదిస్తుంది.

**ఇద మాఖ్యాన మవ్యగ్రో గంగావతరణం శుభం**
**యః శృణోతి చ కాకుత్స్థ సర్వాన్ కామాన వాప్నుయాత్**
**సర్వే పాపాః ప్రణశ్యన్తి ఆయుః కీర్తిశ్చ వర్ధతే**

"రామా! పరమపవిత్రమైన ఈ గంగావతరణ వృత్తాంతమును శ్రవణము చేసిన వానికి సర్వకోరికలు సిద్ధిస్తాయి. పాపములన్నీ నశిస్తాయి. ఆయుష్షు, యశస్సు వృద్ధి చెందుతుంది" అన్నాడు విశ్వామిత్రుడు.

రామలక్ష్మణులు, మునులు అద్భుతమైన వృత్తాంతములను విశ్వామిత్రునిద్వారా ఆలకించి తృప్తి చెందినవారై, హాయిగా నిద్రించారు. ఇచ్చట శ్రీమద్రామాయణము నందలి బాలకాండలో నలభై నాల్గవ సర్గ పూర్తి అయింది.

గంగను ప్రసన్నం చేసుకోవాలని సగరుడు, అంశుమంతుడు, దిలీపుడు ప్రయత్నించి విఫలు లయ్యారు. కానీ చివరగా భగీరథుడు సాధించాడు. రెండుమూడు జన్మల తపస్సు యొక్క పుణ్యము ఏకం అయితే గానీ జ్ఞానగంగ ఉదయించదు. జ్ఞాన మనేది భూకంపాల లాగా ఉన్నపళంగా ఉట్టిపడేది కాదు.

భగీరథుడు త్యాగధనుడు. తనకొరకు గాకుండా ఇతరుల కొరకు కఠోరమైన తపస్సు చేశాడు. త్యాగధనులైన వారే జ్ఞానగంగను సాధించుటకు అర్హులు. అట్టివారే తాము తరించి ఇతరులను తరింపచేయగలరు.

జీవులందరూ ఒకనాడు శివులు గాక తప్పదు. ఎవరైతే గంగను శిరమున ధరిస్తారో వారే శివులు. గంగాదేవి జ్ఞానస్వరూపము.

మరణించిన సగరపుత్రులకే గంగ సద్గతిని ప్రసాదించింది. ఇక జీవించియున్నవారు ఆశ్రయిస్తే ఎలా ఉంటుందో ఆలోచించండి. జ్ఞానగంగ లభించిన వారు జీవన్ముక్తులే గదా!

ప్రతి ఒక్కరూ ఆత్మజ్ఞాన గంగలో మునక వేయాలి. జీవన్మృతులై నశించకుండా జీవన్ముక్తులై శోభించాలి. ఇదియే సనాతనధర్మ వైభవము.

## అహల్యా శాప విమోచనం

ప్రాతఃకాలమున నిద్రలేచి రామలక్ష్మణులు ఆహ్నికములు పూర్తి చేశారు. విశ్వామిత్రుని, మునులనందరిని సేవించారు. నదులలో శ్రేష్ఠమైన గంగానదిని దాటారు.

విశాలనగరమును దర్శించారు. రాముని కోర్కెపై విశాలపుర వృత్తాంతమును విశ్వామిత్రుడు వినిపించాడు. దేవేంద్రుని కథను వివరించి, క్షీరసాగర మథనము, అమృతము ఆవిర్భవించుట మున్నగు ఎన్నో విషయాలను కళ్ళకుకట్టినట్లు వివరించాడు.

చాలా దూరము ప్రయాణము చేసి మరునాడు మిథిలా నగరాన్ని సమీపించారు. అచ్చట ఒక వనమునందు నిర్జనప్రదేశములో సుందరంగా, శూన్యంగా గోచరిస్తున్న ఆశ్రమమును రాముడు చూశాడు. మనుషులే లేని ఆ సుందరమైన ఆశ్రమము ఎవరిదో, ఏమిటో తెలుపమని రాముడు విశ్వామిత్రుని ప్రశ్నించాడు.

"రామా! ఇదొక పవిత్రమైన ఆశ్రమము. దేవతలు కూడా పూజించే దివ్యమైన ఆశ్రమము. దీనిని గౌతమాశ్రమం అంటారు. పూర్వము మహాత్ముడైన గౌతమమహర్షి తన భార్య అహల్యతో గూడి అనేక సంవత్సరాలు ఇక్కడ తపస్సు చేశాడు" అని విశ్వామిత్రుడు ఉపక్రమించి చెబుతున్నాడు.

గౌతముడు ధర్మశాస్త్రకర్త. గొప్ప తపస్సంపన్నుడు. గౌతముని తపోవైభవము వలన తనకు పదవీచ్యుతి కల్గుతుందేమో అనే అభిప్రాయం ఇంద్రుడికి ఏర్పడింది.

ఒకనాడు గౌతముడు స్నానార్థమై గంగానదికి వెళ్ళాడు. మహర్షి లేడని గ్రహించిన ఇంద్రుడు గౌతముని వేషమును ధరించి ఆశ్రమంలో ప్రవేశించాడు.

"సుందరీ! నా మనసు నీ స్వాధీనమై ఉంది. నీ అందం నన్ను నేను మరచునట్లు చేస్తున్నది. నిన్ను అభిలషించి వచ్చాను. నన్ను అనుగ్రహించు. నా హృదయం నీ సంగమమును కోరుతూ ఉంది," అని ఇంద్రుడు అహల్యతో పలికాడు.

వచ్చినది తన భర్తయేనని భావించిన అహల్య, "సంగమించుటకు ఇది ఋతుకాలం కాదు" అన్నది.

"దేవీ! కాముకులు ఋతుకాలము వరకు వేచి యుండలేరు. చక్కని నడుము గలదానా! (సుమధ్యమే) నన్ను తృప్తిపరచుము" అన్నాడు గౌతముని వేషంలో ప్రకాశిస్తున్న దేవేంద్రుడు.

**మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన**

**మతిం చకార దుర్మేధా దేవరాజ కుతూహలాత్**

"మునివేషంలో ఉన్నది దేవేంద్రుడే అని గ్రహించి కూడ, దుర్బుద్ధి యైన అహల్య దేవప్రభువైన ఇంద్రునియందు మక్కువ కలిగి అంగీకరించింది."

ఉభయులూ కృతకృత్యులయ్యారు. "ప్రభూ! దేవేశా! నేను కృతార్థురాల నయ్యాను. నీవు తొందరగా వెళ్ళిపో. మనిద్దరి బాగును కాంక్షించి గౌతముడు రాకముందే వెళ్ళిపో" అన్నది ఇంద్రునితో అహల్య.

ఇంద్రుడు నవ్వుతూ, "సుందరీ! నేను సంతోషించాను. వెళ్తున్నాను," అని పలికి గౌతముడు వచ్చునేమో అనే భయంతో పర్ణశాల నుండి బయటికి వచ్చాడు.

అప్పటికే గౌతముడు ఆశ్రమానికి వచ్చేశాడు. సమిధలను, దర్భలను చేతబట్టుకొని, నదిలో స్నాన మాచరించి వస్తున్న గౌతముడు అగ్నిలా వెలిగిపోతున్నాడు.

గౌతముని చూచి ఇంద్రుడు కొయ్యబొమ్మలా నిలబడి పోయాడు. గౌతముడు ఇంద్రుని గుర్తించాడు. జరిగినదంతా క్షణంలో గ్రహించాడు. "దుష్టుడా! నా రూపమును ధరించి చేయరాని దుష్కార్యమును చేశావు. నీవు నపుంసకుడవు అయ్యెదవుగాక! " అని శాపం పెట్టాడు.



అహల్యవైపు తిరిగి, "అనేక వేల సంవత్సరాలు నీవు ఈ ఆశ్రమంలోనే ఉంటావు. వాయుభక్షణం మాత్రం చేస్తూ ఏ ఆహారము లేకుండా, ఎవ్వరికి కనబడకుండా ధూళిలో పొరలాడుతూ, తపస్సు చేస్తూ ఇక్కడే ఉంటావు" అని శపించాడు గౌతముడు.

పశ్చాత్తాపముతో చేసినతప్పుకు లజ్జపడుతూ అహల్య దుఃఖించింది. కృంగిపోతూ కనిపించింది. పశ్చాత్తాపముతో కుమిలి పోతున్న అహల్యను చూచి, "దశరథ కుమారుడైన శ్రీరాముడు ఇక్కడ ప్రవేశించగనే నీవు పరిశుద్ధ మవుతావు. ఆ రాముని సత్కరించి అర్చించిన పిదప శాప విముక్తిని పొందిన నీవు నన్ను చేరి సుఖిస్తావు " అని పలికి మహా తపస్సంపన్నుడు, తేజోవంతుడు అయిన గౌతముడు ఆ ప్రదేశమును విడచి, హిమవత్పర్వతమునకు వెళ్ళి తపస్సు నారంభించాడు.

"రామా! పద. పుణ్యాత్ముడైన గౌతముని ఆశ్రమమున ప్రవేశించు. అహల్యను ఉద్ధరించు" అన్నాడు విశ్వామిత్రుడు. రామలక్ష్మణులు విశ్వామిత్రుని అనుసరించుచు ఆశ్రమంలో ప్రవేశించారు.

తపస్సుచే పునీతురాలైన అహల్య కన్పించింది. దేదీప్యమానంగా శోభిస్తూ ఉంది అహల్య. మంచు కప్పిన చంద్రుని వలె, నీటియందు ప్రతిబింబించిన సూర్యబింబమువలె, మేఘముల మధ్య పూర్ణచంద్రుని వలె అస్పష్టముగ తెలియుచున్నను అహల్య అసమాన తేజస్సుతో ప్రకాశిస్తూ ఉంది.

గౌతముని శాపకారణంగా ఆమె ఇంతవరకు ఎవ్వరికి కనిపించలేదు. రాముని పాదస్పర్శతో శాపాంత మగుటచేత ఆమె వారికి ఇప్పుడు కనిపిస్తూ ఉంది.

శాపము నిచ్చునపుడు గౌతముడు పలికిన వచనములు ఆమె మదిలో మెదిలాయి. అహల్య వచ్చిన వారిని ఆదరించింది. ఆతిథ్య మిచ్చింది. అతిథి పూజ చేసింది. రాముడు అహల్యను అనుగ్రహించాడు.

దేవతలు దుందుభులు మ్రోగించారు. సుమవృష్టి కురిపించారు. గంధర్వులు గానాలాపనలు చేశారు. అప్సరసలు నాట్యమాడసాగారు.

గౌతముడు మునిగణ పరివేష్టితుడై అదే సమయానికి అక్కడికి వచ్చాడు. రాముని సేవించాడు. పునీతయైన అహల్యను గ్రహించాడు. ఇది వాల్మీకి రామాయణంలో అహల్య గాథ !

బుద్ధిని పురిబెట్ట నవసరం లేకుండా కొన్ని గాథలు తేలికగా అర్థమవుతాయి. బుద్ధిని ఎంత పిండినా కొన్ని గాథలు అగాధాలుగా మిగిలిపోతాయి.

అహల్య గాథకు సంబంధించి పాఠకుల మనసులలో అనేక సంశయాలు చోటు చేసుకొని ఉంటాయి. దీనికి అనేక కారణాలున్నాయి. 1. మూలాన్ని ఉన్నదున్నట్లు గ్రహించక పోవడం 2. అప్రమాణమైన అనేక విషయాల్ని విశేషంగా గ్రహించి ఉండడం 3. ఉన్నదున్నట్లు గ్రహిస్తే పాత్రల ఔచిత్యం దెబ్బతింటుందేమోనని లేని భారాన్ని బుద్ధి కెక్కించి మోయడం. పరమపవిత్రమైన అహల్యాగాథను యథోచితంగా విశ్లేషిద్దాం! పదండి.

అసలువిషయానికొస్తే అహల్య ఇంద్రుడని తెలిసి సంగమించిందా? లేక గౌతముడని భ్రమించిందా?

ఈ విషయంలో సందేహం అనవసరం. గౌతముని రూపంలో వచ్చింది ఇంద్రుడని అహల్యకు మొదట తెలియకపోవచ్చు. అందుచేత ఋతుకాలం కాదు అన్నది.

కానీ కాముకులు ఋతుకాలాన్ని చూడరు అని అతడు పలికినపుడు ఆ వచ్చినవాడు గౌతముడు కాడని అహల్యకు తెలిసిపోయింది. గౌతముడు ధార్మికుడే గాని కాముకుడు కాదు. గౌతముడు న్యాయశాస్త్రమును ప్రసాదించిన ధర్మ శాస్త్రవేత్త.

"చక్కని నడుము గలదానా! నన్ను తృప్తి పరచు" అని అడిగినపుడు వచ్చినవాడు ఇంద్రుడే నని అహల్య గుర్తించింది. చాలా కాలంగా ఇంద్రునికి తనపై కన్ను పడి యున్నదని అహల్యకు తెలుసు.

ఇంద్రుడంతటివాడు తన పొందుగోరి వచ్చాడని భావించింది. ఇంద్రుని పొగడ్త కూడా ఆమెను బలహీన పరచింది.

మనస్తత్వ శాస్త్ర పరిధిలో నుండి వీక్షించినపుడు ఈ సందర్భంలో అహల్యను తరచి చూడటము అలా ఉంచి తూచి అర్థంచేసుకోవాలి.

కొందరు స్త్రీలు అధికులు తమను వాంఛించి నపుడు అదొక గౌరవంగా, గొప్పగా భావించి లొంగిపోతారు. మరికొందరు స్త్రీలు పొగడ్తల మధ్య కరిగిపోయి తలవంచుతారు.

పై రెండు లక్షణాలు ఈదశలో అహల్యలో సుస్పష్టంగా తెలుస్తున్నాయి. కనుక గౌతముని రూపంలో వచ్చినవాడు ఇంద్రుడని అహల్యకు తెలుసు. అలా కానపుడు కృతార్థురాలు కాగానే "దేవేశా! ముప్పు రాకముందే త్వరగా తప్పుకో!" అని ఎలా అనగలిగింది? ఇంద్రుడు రూపాన్ని మార్చలేదుగదా! తెలిసి దిగజారింది గనుకనే తపస్సంపన్నుడైన గౌతముడు శాపం పెట్టాడు. తన మనసు నుండి అహల్యను తీసిపారేశాడు.

తన సౌందర్యాన్ని చూసుకొని గర్వించే స్త్రీ, తన అధికారాన్ని చూసుకొని అహంకరించే పురుషుడు ఏనాడైనా పతనం గాకపోరు అని అహల్య వృత్తాంతములో సందేశం ఇమిడి ఉంది.

**సేవక్ సఠ్ నృప కృపన కునారీ**
**కపటీ మిత్ర సూల్ సమచారీ ॥**

"బుద్ధిహీనుడైన సేవకుడు, లోభియైన రాజు, దుష్టురాలగు భార్య, మోసగాడగు మిత్రుడు జీవితంలో పదునైన కంటకములని మరువ కూడదు" అంటాడు సంత్ తులసీదాస్.

ఇంద్రుడు అహల్యను బలాత్కరించి అనుభవించినట్లు అధ్యాత్మ రామాయణము చెప్పుచున్నది. ఇది కాల్పనిక విషయమే. అహల్య పాత్ర అపవిత్రంగా కనిపించ గూడదనే తపనే ఈ ప్రస్తావన వెనుక కేంద్ర విషయంగా తెలుస్తూ ఉంది. తన బుద్ధే బలహీనంగా యున్న అహల్యను ఇంద్రుడు బలాత్కరించాల్సిన అవసరమేముంది?

అహల్య బ్రహ్మదేవుని కుమార్తె, గౌతముని భార్య. మహాత్ముడైన గౌతముని భార్య



విషయ పిపాసకు అతీతురాలై ఉండి ఉండాలి. పైగా బ్రహ్మదేవుడు ప్రత్యేక శ్రద్ధతో సృష్టించిన అతిలోక సుందరి. అపురూప మంజరి. అసమాన మనోహరి.

అలాంటి సౌందర్యవతి, జ్ఞాన సంపన్నురాలైన అహల్య ఎవరినైనా ఆకర్షించే విధంగా ఉంది. ఇంద్రుడు ఆమెను ఆశించడంలో గొప్పేముంది? కానీ సృష్టికర్త ప్రత్యేక శ్రద్ధతో పోత పోసిన పుత్తడి బొమ్మ, గౌతముని యోగాగ్నిలో జాజ్వల్యమానంగా రూపుదిద్దుకున్న తపస్విని సామాన్యుల వలె దిగజారడ మేమిటి? అనేదే మ్రింగుడుపడని విషయం.

ఇక్కడే జాగ్రత్తగా ఆలోచించాలి. ధర్మమార్గము అంత సులభమైనది గాదు. జ్ఞానబాట అందరూ చరించేది కాదు. ఏక్షణాన ఎక్కడ ఏ కంటకా లుంటాయో, ఎక్కడ గోతులుంటాయో, నూతులుంటాయో, మూతులు అంటుకుపోతాయో ఎవరూ ఊహించలేరు.

**క్షురస్య ధారా నిశితా దురత్యయా**
**దుర్గం పథ స్త త్కవయో వదన్తి ।**

"ఆ మార్గము పదునైన కత్తి అంచు వంటిది. దానిపై ప్రయాణము కష్టమని, దానిని సాధించుట దుస్తరమని మహర్షులు చెబుతారు," అంటాడు కఠోపనిషత్తులో నచికేతునితో యమధర్మరాజు.

అనేక సంవత్సరాల సాధన ఒక క్షణంలో వృథా కావచ్చు. ఎన్నో సుగుణాలను ప్రోదిచేసికొని సంపాదించుకొనిన మూర్తిమత్వం ఎప్పుడో ఎక్కడో ఒక్కక్షణాన ఆంతర్యంలో చెలరేగే సంకల్ప సుడికి బలియై ముక్కచెక్కలై పోవచ్చు.

బ్రహ్మదేవుని చేత ప్రత్యేకంగా సృష్టించబడిన స్త్రీ, తపోధనుడైన గౌతమునికి ఎంతోకాలం సేవచేసిన భాగ్యవతి అహల్యయే అలా బలహీనతకు గురియైనపుడు ఇక సామాన్యుల విషయమేమిటి?

ముందు చూస్తే మురిపించే చలనచిత్రాల అశ్లీల బొమ్మలు, వెనుకనుండి అసభ్యపు గీతాల మర్మర ధ్వనులు, ఎడమవైపు నుండి ఎండగట్టే వెండి తెర విశేష సంచికలు, కుడివైపు నుండి మెడబట్టి కుదిపేసే దూరదర్శనాలు - వీటి మధ్య శాపగ్రస్తులు గాకుండా మిగిలే వారెవరుంటారు?

పతనం సహజం. పతనాన్ని చూసి పరితపించాల్సిన అవసరం లేదు. పతనాన్ని ప్రగతిగా ఎలా మార్చుకోవాలో ఆలోచించాలి. అహల్య గాథ మనకు అందించే బోధ ఇదే.

పతితులైన వారికి పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తము. పశ్చాత్తాపమే ప్రగతికి సోపానము. అహల్య పశ్చాత్తాపంతో కుమిలిపోయింది. పసిబిడ్డలా రోదించింది.

జ్ఞానాన్ని ఆశించువారికి ఈ ప్రపంచ పాఠశాలలో బాధలే బోధలు. అశ్రువులే ఆచార్యులు. కన్నీటితో తడిసిన బ్రతుకులే కళాత్మకంగా శోభించాయి. శోభిస్తున్నాయి. శోభిస్తాయికూడా. పసిబిడ్డలా విలపించే వారికే పరమాత్మ లభిస్తాడు.

**But what am I ?**
**An infant crying in the night;**
**An infant crying for the light;**
**And no language but a cry ;**

"నే నెవరు?
చీకటిలో విలపించే శిశువును,
వెలుగుకై రోదించే శిశువును,
ఏడుపేగాని వేరొక భాషనెరుగని శిశువును"
అంటాడు టెన్నిసన్ మహాకవి.

అయితే పతనమైన వారంతా పశ్చాత్తాపంతో శిశువులాగ విలపిస్తే సరిపోతుందా? సరిపోదు. సరిపెట్టు కొంటూపోతే సిరి లభించదు. జ్ఞానసిరి ప్రాప్తించదు.

పశ్చాత్తాపముతో పాటు పురుషార్థాన్ని పటిష్టం చేసుకుంటూ నడక సాగించాలి. అప్పుడే ప్రగతి లభిస్తుంది. ఆచరణను కదపకుండా కేవలం పశ్చాత్తాపముతో కుములుట అనేది కారును నడపకుండా కారులో కూర్చోవడమే అవుతుంది. మరి గమ్యం చేరే దెలాగు?

నీటితో భూమిని తడిపినట్లు పశ్చాత్తాపంలో స్రవించిన కన్నీటితో హృదయ క్షేత్రాన్ని మెత్త బరచుకోవచ్చు. కానీ మొక్కలు నాటడం చేయక పోతే ఫలాలు సిద్ధించనట్లు, సాధన సాగించకపోతే జీవితంలో ప్రగతి లభించదు.

పశ్చాత్తాపముతో కుమిలిపోతున్న అహల్య ఆచరించ వలసిన సాధనయే గౌతమ మహర్షి శాపవచనములో నిండి ఉంది.

**ఇహ వర్ష సహస్రాణి బహూని త్వం వసిష్యసి**
**వాయుభక్షా నిరాహారా తప్యన్తీ భస్మశాయినీ**
**అదృశ్యా సర్వభూతానా మాశ్రమేస్మి న్నివత్స్యసి**

"చాలా సంవత్సరములు నీవు ఇక్కడే వసిస్తావు.ఎవ్వరికి కనబడకుండా, ధూళిలో పొరలుతూ, ఆహారము ఏమియును లేక గాలిని మాత్రమే భుజించుచు ఈ ఆశ్రమము నందు తపస్సులో వసించు." ఇది గౌతముని శాపం.

మనిషి పతనానికి బాహ్య ఆకర్షణలు, ఆంతర్యపు అలజడులే ప్రబల కారణాలుగా తెలుస్తున్నాయి. బాహ్యంలో ఇంద్రుడు రచ్చకీడుస్తుంటే, ఆంతర్యంలో ఇంద్రియాలు రెచ్చగొట్టాయి అహ్యలని. ఈ రెండిటిని నియమించే సాధనయే శాపంలో స్పష్టమైంది.

1. ఎవరికి కనిపించకపోవడం 2. ఆహారము లేక గాలిని భుజించడం

ఈ రెండిటివలన బాహ్యప్రపంచపు పెనుగులాట నివారించబడింది. అలాగే

3. పవనాహారము, ధూళిలో సంచారము 4. నిరంతర తపస్సు

ఈ రెండిటివలన ఇంద్రియనిగ్రహము, మనోనిగ్రహము సాధింప బడుతూఉంది. దమ శమాదులు లభ్యమవుతాయి.

ఈ విధంగా గౌతముని శాపంలో అహల్యకు సాధన సమకూరింది.

పాపం చేసిన వారు పాపఫలితానికి భీతిచెంది పశ్చాత్తాపాన్ని చూపుతారు. కానీ కాలక్రమేణ దానిని మరచి మళ్ళీ చేసిన పాపాలే చేస్తూ ఉంటారు. ఇదియే ప్రబలమైన ప్రగతినిరోధకము.



తప్పుచేయడం సహజం. పశ్చాత్తాపం చెందడం కూడ సహజం. కానీ చేసినతప్పునే మళ్ళీ మళ్ళీ చేయడం అసహజం. అమానుషం. దురదృష్టం. ఈ పరిస్థితి రాకుండా ఉండాలంటే పరితపించిన హృదయాన్ని పవిత్రమైన తపస్సు వైపు తిప్పాలి. అహల్య విషయంలో గౌతముడు అదే చేశాడు.

అహల్య అనేక సంవత్సరాలు తపస్సులో గడిపింది. పాపం క్షణంలో చేయవచ్చు. ప్రక్షాళనానికి జన్మలే సరిపోకపోవచ్చు.

కానీ ఇక్కడ మరొక ముఖ్యవిషయాన్ని గమనించ వలసి ఉంది. చేసిన పాపానికి అహల్య అనేక సంవత్సరాలు ధూళిగా పడి ఉండింది. వాయు భక్షణంతో అజ్ఞాతంగా జీవించింది. కానీ రామపాదస్పర్శ జరిగినపుడే ఆమెకు శాపాంతం అవుతుందన్నాడు గౌతముడు.

అనేక సంవత్సరాలు తపస్సు చేసినా భగవానుని అనుగ్రహం లేనిదే ముక్తి లభించదు. మన సాధనలన్నీ, గగనమున మేఘములను నిలిపినట్లు, సుకృత మేఘాలను హృదయాకాశంలో నిలుపుతాయి. చల్లని గాలి మేఘములను వర్షింపచేయునట్లు, భగవంతుని అనుగ్రహ పవనాలు సుకృత మేఘాలను వర్షింపచేసి మన హృదయమడుగును జ్ఞానామృతంతో నింపుతాయి.

సాధన సఫలీకృతం కాగానే సాధ్యరూపుడైన భగవానుడు పిలవకుండానే నీ హృదయంలోకి ప్రవేశిస్తాడు. రాముడు గౌతమాశ్రమంలో ప్రవేశించగనే ముందుగా తానువెళ్ళి అహల్యకు నమస్కరిస్తాడు. భక్తికి భగవంతుడు తలవంచుతాడు.

ఏ ప్రదేశంలో అహల్య శిలాన్ని పోగొట్టుకున్నదో, అక్కడికే వచ్చాడు "శీలవాన్" అని కీర్తించబడిన శ్రీరాముడు. నీవూ తపస్వివి కాగలిగితే నీ ఇంటికి కూడా రాముడు వస్తాడు. లోకకళ్యాణార్థమై విశ్వామిత్రుని లాగా నీవు అద్భుత కార్యాలు చేపడితే, కోదండధారియై రాముడు కాపలా ఉంటాడు.

గౌతమాశ్రమానికి ఇంద్రుడూ వచ్చాడు. రామచంద్రుడూ వచ్చాడు. ఇంద్రియాలు బలహీనమైనపుడు ఇంద్రుడు వస్తాడు. బ్రతుకును అన్యాయంగా మారుస్తాడు.

ఇంద్రియ నిగ్రహంతో తపస్సు నాచరించినపుడు రాముడు విచ్చేస్తాడు. బ్రతుకును భగవన్మయంగా మారుస్తాడు.

అహల్య గౌతముని విషయంలో తీరని అపచారం చేసింది. అయినా పశ్చాత్తాపంతో అహల్య రోదించగనే గౌతముడు కనికరించి శాపాంతం తెలిపాడు.

తనను ఖండించిన గొడ్డలికి సువాసన నందిస్తుంది చందనవృక్షం. తనను హింపించిన వారికి కూడా ప్రేమను పంచుతుంది సాధుహృదయం.

**Good to forgive; Best to forget**
**Living, we fret Dying, we live**

'మన్నించుట ఉచితం. మరచుట సముచితం. ఎరుకలో వ్యాకులం మరపులో జీవనం' అంటాడు రాబర్ట్ బ్రౌనింగ్.

ఇంద్ర అహల్యలను శపించిన తరువాత గౌతముడు తపస్సు చేయుటకై హిమవత్పర్వతానికి వెళ్ళాడు. శాపం పెట్టడం వలన నశించిన శక్తి తపస్సు వల్ల సిద్ధిస్తుంది.

కోపంలో వ్యయమైన శక్తి శాంతంలో తిరిగి ప్రాప్తిస్తుంది. లోభములో కోల్పోయిన జ్ఞానము త్యాగములో సిద్ధిస్తుంది. కామంలో తరిగిపోయిన ఆనందం ప్రేమలో లభిస్తుంది. ఇవే సాధనలు. సాధకులను నడిపించే జ్ఞాన దివిటీలు.

అహల్య శాపకాలమున శిలారూపమున ఉన్నట్లు అధ్యాత్మ రామాయణమునందు ఉన్నది. రామచరిత మానసములో కూడా తులసీదాసు అలాగే రచించాడు. కంబరు కూడా తమిళంలో అలాగే రచించాడు. ఏకనాథ్ కూడా శిలగా మారినట్లే వ్రాశాడు. ఇవన్నీ కాలాంతరములో వచ్చాయి. వాల్మీకం కన్నా భిన్నంగా ఉన్నాయి.

**సాతతస్తస్య రామస్య పాదస్పర్శా న్మహాత్మనః**
**అభూత్సురూప వనితా సమాక్రాంతా మహాశిలా ॥**

అని పద్మపురాణము నందు ఉన్నది. ఇక్కడ కూడా అహల్య శిలగా మారినట్లే ఉంది.

**దారిని శిలయై తాపము తాళక వారము కన్నీరును రాల్చగ**
**శూర అహల్యను చూచి బ్రోచి తారీతి ధన్యుచేయవే**
**త్యాగరాజ గేయమా ॥**
**శ్రీరామ పాదమా నీ కృపజాలునే చిత్తానికి రావే ॥**

అని త్యాగరాజస్వామి కూడా అహల్య శిలగా మారినట్లే రచించాడు.

దేవేంద్రుని నపుంసకుడగునట్లు గౌతముడు శపించాడు అని వాల్మీకంలో ఉంది. సహస్ర రంధ్రములతో దేహము నిండుగాక ! అని తులసీ రామాయణము.

ఇచ్చట తులసీదాసు చాలా భావగర్భితముగ శాపాన్ని ఇప్పించాడు. పుణ్యము వలన ఇంద్రపదవి లభిస్తుంది. పుణ్యము క్షీణించగనే పదవి నశిస్తుంది.

దేహము వేయి రంధ్రములకు నిలయంగా శపించాడు గౌతముడు. చిల్లులున్న కుండలో నీరు నిలువదు. అలాగే ఇంద్రుడు ఆర్జించిన పుణ్యమంతా ఈ శాపకారణంగా కారిపోతుంది అని అర్థము.

శాపవిముక్తి కాగానే అహల్య రాముని అర్చిస్తుంది. ఇది వాల్మీకం. ఇక్కడ ఏకనాథ్, తులసీదాస్ అహల్యను రమణీయంగా మాట్లాడిస్తారు.

రామునికి నమస్కరిస్తూ అహల్య చెబుతుంది:

"రామా!నేను పతితను. పాపాత్మురాలను. నీవు పతిత పావనుడవు. నే చేసిన పాపానికి గౌతముడు నన్ను శపించాడు. ఆ శాపము నాకు వరంగా పరిణమించింది. నాకు నా భర్త ఈ శాపమును ఈయకుండినచో నీపాదస్పర్శ నాకు లభించునా? ఋషులు శాపాలు పంచేవారు కారని, వరాలిచ్చే వారేనని అనుభవం ద్వారా తెలుసుకున్నాను. పరమ శివుడు శిరస్సున ధరించిన పరమ పావని గంగ ఏ పాదపద్మముల నుండి ఆవిర్భవించినదో అట్టి చరణకమలములను సేవించే భాగ్యము నాకు కలిగింది.

"తండ్రీ! నాకు ఏ కోరిక లేదు. నాకు ఏ వరమూ అవసరము లేదు. సదా నీ చరణపంకజమున భ్రమరమై తిరుగునట్లు అనుగ్రహించు," అని అహల్య ప్రార్థిస్తుంది.



ఏకనాథ్ విరచితమైన భావార్థ రామాయణంలో కూడా అహల్య అలాగే అంటుంది.

**గౌతమ శాప్ నవ్హే తో వర్**

**తేణే రఘువీర్ భెటావిలా ॥**

"గౌతముడు నాకు శాపాన్నివ్వలేదు. వరాన్ని ప్రసాదించాడు. అతని కారణంగానే నాకు శ్రీరామచంద్రుని దర్శన భాగ్యం లభించింది."

అహల్య ప్రార్థన ముగియగనే రామచరితమానసములో తులసీదాసు మహాశయుడు తనతో తాను మాట్లాడుకుంటాడు. కర్తవ్యాన్ని మనసుకు తెలుపుతాడు.

**అసప్రభు దీన బంధు హరి కారన్ రహిత దయాల్**

**తులసీ దాస సఠ తోహి భజు ఛాడీ కపట్ జంజాల్ .....**

"శ్రీరాముడు దీనబంధువు. అతని నిర్హేతుకజాయమాన కటాక్షము భక్తుల యందు ప్రసరిస్తుంది. మూఢుడవైన ఓ తులసీ ! బంధకారణములను త్యజించి శ్రీహరినే సదా స్మరించు" అంటూ వినమ్రుడై తనను మూర్ఖుడుగా వర్ణించుకుంటాడు సంత్ శిరోమణి భక్త తులసీదాసు.

ఇంతవరకు రాముడు మనకు రఘుపతిగా, రాఘవుడుగా, రాజకుమారుడుగా పరిచయమయ్యాడు. అహల్య శాప విమోచనము కాగానే రాముడు పతిత పావనుడయ్యాడు. ఇక మిథిలకు వెళ్ళి జానకిని చేపట్టగానే సీతారాముడు అవుతాడు. అక్కడ నుండి మనఇష్టం. ఎంతైనా కీర్తించవచ్చు.

## రఘుపతి రాఘవ రాజారాం
## పతిత పావన సీతారాం ............

అహల్య తప్పుచేసింది. పశ్చాత్తాపం చెందింది. తపస్సు చేసింది. రాముని కృపకు పాత్రురాలై తరించింది. అలాగే మనం కూడా చేసిన పాపాలకు పశ్చాత్తాపము చెంది, అవి తిరిగి పునరావృతం కాకుండా తపస్సు నాచరించి తరించాలి. ఇదియే అహల్య శాప వృత్తాంతములో మనము గ్రహింపదగిన సందేశము.

"అహల్య" అనగా దున్ననిది అని అర్థము. బంజరు భూమి లాంటిది. బీడు భూమి. దున్నని భూమి ఏ పంటకు పనికిరాదు. అలాగే తపస్సు లేని అహల్య అయోగ్యురాలై గౌతమునికి దూరమైంది. తపస్సు చేసి రాముని కృపకు పాత్రురాలై, దున్నిన భూమి వలె, జ్ఞానపంటను పండించుటకు సుక్షేత్రంగా మారింది.

కష్టించినవారికే ఫలాలు లభ్యమవుతాయి. కష్టాలు, కన్నీళ్ళు సత్యమార్గంలో నిత్యసోపానాలని మరువకూడదు. భగవంతుడు కొందరికి బాధల రూపంలోనే దర్శనమిస్తాడు.

**Dear me, how great is God !**
**Dear me, how God is small !**
**Small as the smallest thing,**
**great as the troubles of all !**

మేము చేస్తున్న భక్తి ప్రచారం ఈ web sights ద్వారా చేస్తున్నాము
www.telugudevotionalswaranjali.blogspot.in
www.gitamakarandam.blogspot.in
www.sundaravignanagrandalayam.blogspot.in
www.hindudevotionalswaranjali.blogspot.in
OUR VIDEO CHANNELS:
www.youtube.com/user/hindudevotionalo
www.youtube.com/user/Shruthimandiramu
www.youtube.com/user/devotionalswaranjali
PDF BOOKS CHANNEL: www.scribd.com/ysreddy94hyd
E mail ID: ysreddy94hyd@gmail.com
FACEBOOK: YEDAVALLI SUDARSHAN REDDY
pl forward the above links to your friends&relatives
our mediafire folderlinks
www.mediafire.com/?86epi81waeayl
www.mediafire.com/?7900suod857zc
www.mediafire.com/?45h5fdfw4igzi
www.mediafire.com/?606gdhk35zvbc
www.mediafire.com/?0t92f0wb91g18
www.mediafire.com/?xw75pfuld2dyy

ఓ దేవుడెంత పెద్దవాడు !
ఓహో దేవుడెంత చిన్నవాడు !
అణువు కన్నా అల్పమైనవాడు ,
అందరి బాధలకన్నా పెద్దవాడు !

అని జర్మనుకవి ఏంజలిస్ సైలేషియస్ భగవంతుని ముచ్చటగ వర్ణించుకున్నాడు.

'అహల్య' అనే పదంలో 'అ' అచ్చులకు సంకేతం కాగా, 'హల్' శబ్దం హల్లులకు ప్రతీకమైంది. ఈ విధంగా అహల్య సర్వాక్షర రూపమైంది. కనుకనే ఆమె సిద్ధి లోకంలో ప్రసిద్ధిగా మారింది. ఆమె మార్గంలో ఎందరో రాముని పాదాలను ఆశ్రయించి తరించారు. రామచంద్రుని చరణకమలముల వైభవమును ప్రథమంగా దర్శించినది అహల్యే గనుక ఆ తరువాత అందరికీ ఆమె మార్గదర్శకమైంది.

**నీ పద పంకజములను నే నెరనమ్మినాను ॥నీపద॥**
**కోపముతో ముని తాపసి ఇచ్చిన**
**శాపమున అహల్య అనుదినము**
**చాప రాయి తను తాప మోర్వలే**
**నామెను గని పరితాపము దీర్చిన ॥నీ పద ॥**

అని త్యాగరాజస్వామి రామభద్రుని ముక్తి దాయక చరణ కమలములను అనేక విధాల కీర్తించి పరవశుడయ్యాడు. అహల్య భక్తిని అనుస్మరిస్తూ గానం చేశాడు.

**"కామిని పాపము కడిగిన పాదము "** అని అహల్య నుద్ధరించిన శ్రీరాముని చరణ కమల వైభవమును గానం చేస్తూ, అవి బ్రహ్మ కడిగిన పాదములని మురిసిపోతాడు అన్నమాచార్యులు.

బండరాతి బ్రతుకులైనను, మన్నులాంటి మనుజులైనను పరమాత్మ కొరకు నిరీక్షించువారు నిరాశ చెందరని, నిరంజన రూపులై తరిస్తారని అహల్య గాథ నిరూపించింది.

## జనకుని యజ్ఞశాలలో శ్రీరాముడు

రామలక్ష్మణ విశ్వామిత్రాదులు మిథిలకు ప్రయాణమయ్యారు. జనకుని యజ్ఞశాలను చేరారు. అక్కడ గావించుచున్న ఏర్పాట్లను గాంచిన రాముడు జనకుని శ్లాఘించాడు.

జనకుడు యజ్ఞమును అప్పటికి నిర్వహిస్తున్నాడు. దేశదేశాల నుంచి వేదవేదాంగముల యందు నిష్ణాతులైన బ్రాహ్మణులు వేలకొలదిగ వచ్చియున్నారు. వందల శకటాలలో మహర్షులు వచ్చియున్నారు.

రాముని కోర్కెపై జనసంసర్గము ఎక్కువగా లేని, జలసమృద్ధి ఎక్కువగాయున్న ప్రదేశమును తాము ఉండుటకు విశ్వామిత్రుడు నిర్ణయించాడు.

విశ్వామిత్రుడు వచ్చినట్లు జనకునికి తెలిసింది. పుణ్యాత్ముడు, పురోహితుడు అయిన శతానందుని వెంటబెట్టుకొని, ఎదురుగ వచ్చి ఆహ్వానం పలికాడు జనకుడు.



విశ్వామిత్రుని పూజించాడు. పూజలందుకొనిన విశ్వామిత్రుడు జనకునితో, **"కుశలమా!** యజ్ఞము నిర్విఘ్నముగా సాగుతున్నది కదా?" అని ప్రశ్నించాడు.

అందరూ ఉచితాసనాలపై ఆసీనులయ్యారు. జనకుడు విశ్వామిత్రునితో పలికాడు:

"పూజ్యుడా! నన్ను అనుగ్రహించి ఈనాడు మీరు వచ్చారు. మీ రాకవలన నా యజ్ఞము ఫలప్రదమైంది. నేను ధన్యుడనయ్యాను. అనుగ్రహపాత్రుడ నయ్యాను. ఇంక పన్నెండు రోజులలో యజ్ఞము సమాప్తి అగునని పురోహితులు చెబుతున్నారు. ఆ తరువాత యజ్ఞ భాగములు గ్రహించుటకు దేవతలు రాగలరు.

"పూజ్యుడా! మీతో పాటు వచ్చిన ఈ ఇరువురు కుమారు లెవరు? దేవతలతో సమానులుగా కనిపిస్తున్నారు. సూర్యచంద్రులవలె యజ్ఞస్థలిలో ప్రకాశిస్తున్నారు. ధనుర్బాణములు ధరించి గొప్ప వీరులవలె గోచరిస్తున్నారు. వీరిని కనిన భాగ్యవంతులెవరు? ఇక్కడికి ఎందుకు వచ్చినారు? వీరిరువురు ఒకే విధంగా తెలుస్తున్నారు. వీరిని గూర్చి నాకు చెప్పండి" అని జనకమహారాజు విశ్వామిత్రుని ప్రశ్నించాడు.



వారిరువురు దశరథుని కుమారులని విశ్వామిత్రుడు జనకునికి చెప్పాడు. అంతేగాదు. సిద్ధాశ్రమ ప్రాంతంలో రాక్షసులను వధించడము, యాగమును సంరక్షించడము, అహల్యను ఉద్ధరించడము మొదలగు విషయములన్నీ వివరంగా చెప్పి, ప్రస్తుతము శివధనుస్సును పరీక్షించుటకు మిథిలకు వచ్చినారని కూడా తెలిపాడు.

విశ్వామిత్రుని వచనములను ఆలకించి శతానందుడు పులకితగాత్రుడయ్యాడు. శతానందుడు గౌతమమహర్షి జ్యేష్ఠ పుత్రుడు. గొప్పతపస్వి. బుద్ధిమంతుడు.

శతానందుడు విశ్వామిత్రుని అడుగుచున్నాడు.

"మహర్షీ! మా తల్లి అహల్య గొప్ప తపస్విని. యశస్విని. ఆమెను రామునికి చూపించావా? సర్వులకు ఆరాధ్యమూర్తియైన రాముని మా తల్లి పూజించినదా?

"మహానుభావా! విధి బలముచే మా అమ్మకు ప్రాప్తించిన దురవస్థను రామునికి చెప్పినావా? రాముని సేవించుటచే పవిత్రురాలైన మాతల్లి మాతండ్రిని సమీపించినదా?

"హిమవత్పర్వతము నుండి నా తండ్రి గౌతముడు వచ్చినాడా? రాముని పూజించినాడా? రాముడు నా తండ్రిని గౌరవించినాడా?" ఇలా గొలుసులాగా ప్రశ్నలను పారవశ్యంలో క్రుమ్మరిస్తున్నాడు శతానందుడు.

"శతానందా! మునిశ్రేష్ఠా! చేయవలసిందంతా చక్కగా చేశాను. ఏదీ విడచిపెట్టలేదు. రేణుక జమదగ్నిని చేరినట్లు అహల్య గౌతముని చేరింది" అన్నాడు విశ్వామిత్రుడు.

శతానందుడు రామునివైపు తిరిగి, "పురుష శ్రేష్ఠుడవైన రామా! మహాత్ముడైన విశ్వామిత్ర మహర్షిని ఆశ్రయించావు. మా అదృష్టం వల్ల ఇచ్చటికి వచ్చావు. నీకు స్వాగతము.

"రామా! విశ్వామిత్రుడు సామాన్యుడు కాడు. తపస్సుచేసి బ్రహ్మర్షిగా మారాడు. అసమాన ప్రభావము గలవాడు. అట్టి విశ్వామిత్రుని రక్షకుడుగా పొందిన నీవు ధన్యుడవు. నీకంటె భాగ్యశాలురు ఏలోకమునందును కానరారు.

"రామా! విశ్వామిత్రుని శక్తి ఎంతటిదో, అతని చరిత్ర కూడా అంతటిది. అవి పరస్పరము పోటీ పడుతుంటాయి. కర్ణపేయమైన ఆ మహర్షి చరిత్రను చెబుతాను. విను" అంటూ తన తల్లిదండ్రుల ఉద్ధరణకు కారణమైన విశ్వామిత్రుని చరిత్రను శతానందుడు చెప్పుటకు ఉపక్రమించాడు.

## విశ్వామిత్రుని విశిష్ట చరిత్ర

విశ్వామిత్రుడు ధర్మాత్ముడు. ధర్మవేత్త. **ప్రజా నాం చ హితే రతః** ప్రజలమేలు కోరేవాడు. అందుచే ఆ సర్వవిద్యా పారంగతుడు విశ్వామిత్రు డయ్యాడు. చాలా కాలము రాజుగా ఉండి రాజ్యపాలనం చేశాడు.

ఒకప్పుడు తేజోవంతుడైన విశ్వామిత్రుడు ఒక అక్షౌహిణీ సైన్యమును వెంట బెట్టుకొని బయలుదేరి భూమి అంతా తిరిగాడు. నగరములు, రాష్ట్రములు, నదీనదాలు, గిరులు, ఆశ్రమాలు చూసుకుంటూ వసిష్ఠుని ఆశ్రమం చేరాడు.

వసిష్ఠుని ఆశ్రమం సామాన్యమైనది కాదు. అది మరొక బ్రహ్మలోకం లాంటిది. అనేక విధములైన వృక్షములతో, వాటిపై చరించు వివిధములైన రంగు రంగుల పక్షిగణముతో అలరారుతూ ఉంది. ఆ ఆశ్రమంలో సిద్ధులు, గంధర్వులు, కిన్నెరాదులు ఉన్నారు. అచ్చట సిద్ధికై తపించేవారు, సిద్ధిపొంది తరించినవారు, జితేంద్రియులు, రాగద్వేషములను జయించిన వారు ఎందరో గలరు.

విశ్వామిత్రుడు మునిశ్రేష్ఠుడైన వసిష్ఠునికి నమస్కరించాడు. వసిష్ఠుడు విశ్వామిత్రుని సాదరంగా ఆహ్వానించాడు. ఫలపుష్పాదులు సమర్పించాడు.

విశ్వామిత్రుడు వసిష్ఠుని కుశల మడిగాడు. ప్రజల సౌఖ్యమును, పరిపాలనను గూర్చి వసిష్ఠుడు అడిగి తెలుసుకున్నాడు. అలా పరస్పరము భాషించుకొంటూ చాలా కాలము గడిపారు వసిష్ఠవిశ్వామిత్రులు.



"విశ్వామిత్రా! నీకు, నీ పరివారమునకు ఆతిథ్యము ఇవ్వవలెనని సంకల్పించాను. స్వీకరించి మమ్ము తృప్తిపరచు. నీవు రాజువి. ఉత్తమమైన అతిథివి. నిన్ను సత్కరించుట మా ధర్మము" అన్నాడు వసిష్ఠుడు.

"పూజ్యుడా! హాయిని గొలుపు నీ మాటలతో మా కడుపు నిండింది. మీ ఆశ్రమములో లభించు ఫలమూలాదులను, జలమును ఇచ్చి మమ్ములను గౌరవించావు. మాకది చాలు. నేను వెళ్తాను. మాపై నీ ప్రేమను ఇలాగే ఉంచు," అన్నాడు విశ్వామిత్రుడు.

ధర్మాత్ముడు, ఉదారుడు అయిన వసిష్ఠుడు విశ్వామిత్రుడు ఎంత చెప్పినను వినకుండా ఆతిథ్యము స్వీకరించమని బలవంతపెట్టసాగాడు.

అక్షౌహిణీ సైన్యమునకు విందు చేయుట మాటలా? అందులోను ఆశ్రమము. పైగా అతిథి విశ్వామిత్ర మహారాజు. వసిష్ఠునికి మోయలేని భారమని భావించిన విశ్వామిత్రుడు వద్దని వసిష్ఠుని వారించసాగాడు. అయినా వసిష్ఠుడు వినలేదు. చివరికి "మీ ఇష్టం. మీకు ఏది ఇష్టమో అలాగే చేయండి" అన్నాడు విశ్వామిత్రుడు.

వసిష్ఠుడు సంతోషించాడు. ఆయన ఆశ్రమంలో శబల అనే కామధేనువు ఉంది. వసిష్ఠుడు శబలను పిలిచాడు.

"శబలా! నేను ఈ విశ్వామిత్రునికి, ఆయన పరివారానికి ఆతిథ్యము ఇవ్వాలని సంకల్పించాను. భోజ్య చోష్య లేహ్యాదులతో కూడిన రుచికరమైన భోజనమును వారివారి ఇష్టాను సారముగా అందించు" అన్నాడు వసిష్ఠుడు.

చూస్తుండగనే క్షణకాలంలో శబల ఆహార పదార్థములను సంకల్పమాత్రేణ సమకూర్చింది. రకరకాల పిండివంటలు, మధుర పానీయములు, తేనెలు, చెరకు గడలు, పర్వతములవలె కుప్పలుగా పడియున్న వేడివేడి అన్నరాశులు, తీపిపదార్థాలు, బావుల వంటి పాత్రలలో నింపబడి యున్న పెరుగు, పాలు, ఘృతములు క్షణంలో సృష్టించింది.

అందరూ భోంచేశారు. విశ్వామిత్రాదులు తృప్తి చెందారు. వసిష్ఠుని అందరూ శ్లాఘించారు. అప్పుడు రాజర్షియైన విశ్వామిత్రుడు వసిష్ఠుని సమీపించి ఒక్కమాట చెప్పాడు.

"వాక్య విశారదా! వసిష్ఠా! నీ ఆతిథ్యముతో నేను తృప్తి చెందాను. నా ఆశను కూడా తీర్చి నాకు సంతృప్తిని కల్గించు. రత్నములు రాజుల సొమ్ము. నీ వద్ద యున్న శబల అనే ధేనువు గొప్ప అమూల్యమైన రత్నము. అది నాదగ్గర ఉండదగినది. దానిని నా కివ్వు. శబలను ఉచితంగా నేను తీసుకోను. దానికి బదులుగా లక్ష గోవుల నిస్తాను;" అన్నాడు వసిష్ఠునితో విశ్వామిత్రుడు.

విశ్వామిత్రుని మాటలను ఆలకించిన వసిష్ఠుడు ఇలా పలికాడు: "విశ్వామిత్రా! నీవు లక్షల ఆవులిచ్చినా, కొన్ని వందల కోట్లు గోవులిచ్చినా, వెండిరాశులిచ్చినా ఈ శబలను నేను నీకివ్వలేను.

"ఈ ధేనువు నాకు దూరం కాకూడదు. విశ్వామిత్రా! ఈ ధేనువుకు, నాకు ఉన్న సంబంధము విడదీయ రానిది. కీర్తిమంతుని విడచి కీర్తి ఎలా దూరంగా వెళ్ళలేదో, అలాగే వసిష్ఠునికి దూరంగా శబల వెళ్ళలేదు.

"రాజా! ఈ శబల నా సర్వస్వము. నీకు చెప్పినవియే గాక అనేకములైన ఇతర కారణముల వలన కూడా నేను శబలను నీకివ్వలేను," అని వసిష్ఠుడు వినమ్రుడై పలికాడు.

వసిష్ఠుని మాటలు విశ్వామిత్రునికి రుచించలేదు. ఏ విధంగానైనా శబలను గ్రహించాలనే పట్టుదల విశ్వామిత్రునిలో క్షణక్షణ ప్రవర్ధమాన మగుతూ ఉంది. ఆపుకోలేని ఆవేశము కట్టలు త్రెంచుకొని ప్రవహించ సాగింది. వసిష్ఠుని మెప్పించి శబలను తన వెంట తీసుకుపోవాలని దృఢసంకల్పంతో ఉన్న విశ్వామిత్రుడు తొందరపాటుతో ఇలా పలికాడు.

**యావదిచ్ఛసి రత్నం వా హిరణ్యం వా ద్విజోత్తమ**

**తావ ద్దదామి తత్సర్వం శబలా దీయతాం మమ ॥**

"బ్రాహ్మణ శ్రేష్ఠుడా! వసిష్ఠుడా! రత్నములు గాని, బంగారము గాని నీవు కోరినంత ఇస్తాను. ఆ శబలను నాకివ్వు" అన్నాడు.

"విశ్వామిత్రా! ఏది ఏమైనను శబలను ఇవ్వలేను. నాకు శబలే సర్వము. శబల లేనిచో నా యజ్ఞయాగాది కర్మలు కూడా కుంటుబడతాయి.

**ఏతదేవ హి మే రత్న మేతదేవ హి మే ధనమ్**

**ఏతదేవ హి సర్వస్య మేతదేవ హి జీవితమ్ ॥**

"నాకు ఈ శబలే రత్నములు. ఇదే ధనము. ఇదే సర్వస్వము. ఇదే నా జీవితము.

"ఇక అన్యములైన మాటలెందుకు? నేను శబలను ఇవ్వను " అన్నాడు విశ్వామిత్రునితో వసిష్ఠుడు.

విశ్వామిత్రుడు ఆలోచించాడు. ఆవేశపూరితుడయ్యాడు. క్రోధావిష్టుడయ్యాడు. బలవంతంగా శబలను తీసికొని పోతున్నాడు.

విశ్వామిత్రునితో వెళ్ళడం శబలకు ఇష్టంలేదు. తనలో తాను దుఃఖిస్తూ శబల విలపించ సాగింది. ఆలోచించసాగింది.

"దుఃఖిస్తున్న నన్ను ఈ రాజభటులు బలవంతంగా తీసికొని పోతున్నారు. మహాత్ముడైన వసిష్ఠుడు నన్ను త్యజించినట్లేనా? పవిత్రాత్ముడైన ఆ మహర్షికి నేను ఏమి అపరాధం చేశాను? నేను ఆయన భక్తురాలను. ఇష్టురాలను. సేవకురాలను. పైగా నిరపరాధిని." ఇలా ఆలోచిస్తున్న శబల, వందల కొలది రాజభటులను విదిలించుకొని వాయువేగంతో వసిష్ఠుని వద్దకు పరుగెత్తి చేరింది.

శబల ఏడుస్తూ వసిష్ఠుని ప్రశ్నించింది: "బ్రహ్మర్షీ ! రాజభటులు నన్ను తీసికొనిపోతున్నారు. నీవు నన్ను వారికిచ్చినావా?" అని దుఃఖించింది ధేనువు.

శోకార్తురాలైన ధేనువును చూచి విచలిత మనస్కుడైన వసిష్ఠ మహర్షి, "శబలా! నీవు నాకు ఏ అపరాధము చేయలేదు. ఈ రాజు నిన్ను నా నుండి బలవంతముగా తీసికొని పోవుచున్నాడు.

"నేను మహర్షిని. అతడు రాజు. అతని బలము ముందు నేను సమానుడను కాను. అతనికి గొప్ప సైన్యముంది. నేను కేవలం సాధకుడను. తపస్విని" అని పలికాడు వసిష్ఠ మహర్షి.



వసిష్ఠుని మాటల నాలకించిన శబల విశ్వామిత్రుని బలమును ధిక్కరిస్తూ, వసిష్ఠుని బలమును ప్రశంసిస్తూ మాటలాడ సాగింది.

**న బలం క్షత్రియ స్యాహు ర్బ్రాహ్మణో బలవత్తరః**

**బ్రహ్మన్ బ్రహ్మబలం దివ్యం క్షత్రాత్తు బలవత్తరం ॥**

"ద్విజోత్తమా! క్షత్రియబలము ఒకబలము కాదు. బ్రాహ్మణుడే బలవంతుడు. క్షత్రియబలము కంటె బ్రాహ్మణబలము దివ్యమైనది. అధికమైనది," అన్నది.

శబల అబలకాదు. అధిక ప్రజ్ఞావంతురాలు. ఆధ్యాత్మిక అవగాహన పూర్ణంగా గలది. అధర్మాన్ని ఎదిరించే శక్తి గలది. యుక్తి గలది. అందుకే రాజ భటులను విదిలించుకొని వచ్చి వసిష్ఠుని చేరింది.

వసిష్ఠ విశ్వామిత్రుల సంఘర్షణ వ్యక్తిగతమైంది కాదు. ప్రబలమైన రెండు వ్యవస్థల మధ్య తలెత్తిన వివాదము. రెండు సిద్ధాంతాల మధ్య చెలరేగిన విభేదము.

భౌతిక సంపద, భౌతిక ప్రగతి, కండబలముపై విశ్వాసము కలవాడు విశ్వామిత్రుడు. భుజబలంతో భువన త్రయాన్ని జయించవచ్చు అనే దృఢ విశ్వాసం కలవాడు విశ్వామిత్రుడు.

భౌతిక సంపద అశాశ్వతం. భౌతిక ప్రగతి ఒక ప్రగతి అనిపించుకోదు. కండలు, బండలు మన కెప్పుడూ అండగావు. కాలేవు. బుద్ధి బలమే శాశ్వతమైంది. జ్ఞానమే బలమైంది. విజ్ఞానమే సమస్తాన్ని జయిస్తుంది అనే విషయంలో అకుంఠిత విశ్వాసం కలవాడు వసిష్ఠుడు.

భౌతిక ఆధ్యాత్మిక శక్తులనే రెండు బలీయమైన వ్యవస్థల మధ్య చెలరేగిన వివాదమే వీరిరువురి మధ్య లేచిన సంఘర్షణ.

ధేనువు తనది. తనకు ఇష్టం లేనపుడు బలవంత పెట్టనవసరం లేదు. ఇది వసిష్ఠుని వాదం.

ఈప్రపంచంలో బలం కలవాడిదే రాజ్యం. శక్తి కలవాడిదే సమస్తం. తనకు సైన్యముంది కనుక వసిష్ఠుడు కాదన్నా శబలను బలవంతంగా తీసుకు పోతున్నాడు విశ్వామిత్రుడు. ఇదే నిరంకుశత్వం. నియంతృత్వం.

చట్టాలతో, భుజబలంతో రాజ్యాన్ని విచ్చలవిడిగ పరిపాలించాలి అంటుంది నియంతృత్వం. చట్టాలు లేని, భయాలు లేని స్వచ్ఛంద పరిపాలన సాగాలి అంటుంది అధ్యాత్మవాదం.

ఈ సంఘర్షణ ఆనాటిది గాదు. ఓ నాటిది కాదు. ఈనాటిది కూడా. అవగాహన లేకుండా యావత్ప్రపంచం భౌతికవాదాన్ని విశ్వసించి, విలయతాండవం చేసినా పుణ్య భారతావని తన అధ్యాత్మ వాదాన్ని నిర్విరామంగా వినిపిస్తూనే ఉంటుంది. ఆ శంఖారావం విరామం లేకుండా ధ్వనిస్తూనే ఉంటుంది.

విత్తానికి విలువ పెరిగి, చిత్తానికి విలువలు అంటకపోతే ఆ సమాజానికి మిగిలేవి విపత్తులే కాని వికాసాలు కావు. విలువలు సంరక్షింపబడిన సమాజమే విజ్ఞాన పథంలో పయనిస్తుంది. విలువలను కాలరాచిన సమాజం భౌతిక సంపదతో ఎంత తులతూగినా ఒకనాడు పతనాన్ని వరించక తప్పదు.

భౌతికవాదం బాహ్యప్రకృతిని, సమాజాన్ని ప్రధాన విషయంగా పెట్టుకొని చర్చిస్తుంది. అధ్యాత్మ వాదానికి వ్యక్తి కేంద్ర విషయము. ఈ రెంటికీ మధ్యనే అన్ని గందరగోళాలు, సంఘర్షణలునూ.

సంపదను పెంచుకోవడం, అనుభవించడం, ఇంద్రియములను తృప్తిపరచడం - వీటికి ప్రాధాన్యత నిస్తుంది భౌతికవాదం.

ఇంద్రియాతీతమైన జ్ఞానము, సమైక్యత, ఏకాత్మతకు ప్రాధాన్యమిస్తుంది అధ్యాత్మవాదం.

సంపదలు పెరగవచ్చు. సమాజం అభివృద్ధిని సాధించవచ్చు. వీటికి కారణమైనవాడు మనిషే గదా! సమాజంలో అభివృద్ధిని సాధించిన మనిషే అవసర మనుకుంటే దానిని పాడుచేయగలడు కూడా. అట్టి మనిషిని సంస్కరించకుండా సమాజాన్ని అభ్యుదయం వైపు ఎలా నడిపించగలం? అని అధ్యాత్మవాదం ప్రశ్నిస్తున్నది. దీనికి భౌతికవాదంలో సమాధానం లభించదు. కనుకనే ఎంత ముందుకెళ్ళినా భౌతికవాదం ఒకనాడు చతికిల బడేదే. అందుచేతనే

**"To me a philosophy of materialism is the height of unintelligence"**

"నా దృక్పథంలో భౌతికవాద తత్త్వం అజ్ఞానానికి పరాకాష్ఠ" అంటాడు ప్రముఖ ఖగోళ శాస్త్రవేత్త ఆర్.ఎ.మల్లికన్.

కనుక సమస్త విలువలకు కేంద్రమైన మనిషి విలువలేనివాడు కాకూడదు. విలువ మనిషికి సంబంధించింది కాదు అని మనం పొరపాటు పడటం వల్ల విలువల్ని డబ్బు అపహరించింది. అధికారం అపహరించింది. మనిషి విలువలేని వాడయ్యాడు. డబ్బే విలువ గలదైంది. డబ్బున్న వాడికే విలువ పెరిగింది. ఇది భౌతికవాదం ప్రసాదించిన దురదృష్టం.

కనుక నైతిక విలువల్ని సమాజంలో దించాలి. అధ్యాత్మిక అవగాహనను ప్రజలలో పెంపొందించాలి. అప్పుడే భౌతికవాదం పలాయన మవుతుంది. నిత్య వెలుగుల తోరణాలు సమాజంలో ఆవిష్కరింప బడుతాయి. స్వామి వివేకానంద ఇదియే తక్షణ కర్తవ్యం అన్నారు.

**Educate and raise the masses and thus alone a nation is possible. The real nation who live in cottages have forgotten their manhood, their individuality. They are to be given back thier lost individuality. They are to be educated. Let us put ideas into their heads, and they will do the rest.**

"విద్యను నేర్పి ప్రజలను ఉన్నతికి తీసుకురండి. అప్పుడే జాతి నిర్మాణం సాధ్యమవుతుంది. కుటీరాల్లో నివసించిన నిజమైనజాతి మానవత్వాన్ని, వ్యక్తిత్వాన్ని మరచిపోయింది. వాళ్ళు పోగొట్టుకున్న వ్యక్తిత్వాన్ని వారికి తిరిగి అందించాలి. వాళ్ళను విద్యావంతుల్ని చేయాలి. వారి బుర్రలలో భావాలు నింపుదాం. ఆ తరువాత మిగిలిన కార్యాన్ని అవే పూర్తిచేస్తాయి" అంటారు స్వామి వివేకానంద.

ఆధ్యాత్మిక బలము దివ్యమైనది. పవిత్రమైనది. క్షత్రియబలము అల్పమైనది, అశాశ్వతమైనది అని వసిష్ఠునితో చెప్పిన ధేనువు కర్తవ్యాన్ని సూచించమని మహర్షిని అడుగుతూఉంది అని శతానందుడు రామునితో చెబుతున్నాడు.



**అప్రమేయ బలం తుభ్యం నత్వయా బలవత్తరః**
**విశ్వామిత్రో మహావీర్య స్తేజస్తవ దురాసదమ్ ॥**

శబల చెప్తూవుంది. "మహర్షీ! నీ బలం అప్రమేయం. విశ్వామిత్రుడు ఎంత గొప్పవాడైనా నీతో సమానుడు కాడు.

"మహాత్మా! నీది బ్రహ్మతేజము. నన్ను ఆజ్ఞాపించు. ఆ దురాత్ముని దర్పాన్ని ఖండిస్తాను" అన్నది.

శబల వచనములలోని సత్యమును వసిష్ఠుడు గ్రహించాడు. కర్తవ్యాన్ని నిర్ణయించి, "శబలా! శత్రుసైన్యమును నశింపజేసే గొప్పసైన్యమును సృష్టించు" అన్నాడు.

వసిష్ఠుడు అలా చెప్పగనే ధేనువు "హంబా" అని అరిచింది. ఆ అరుపుతో కూడా వేలమంది సైనికులు ఆవిర్భవించారు. విశ్వామిత్రుని సైన్యమును నాశనం చేశారు.

విశ్వామిత్రుడు క్రుద్ధుడై, రథమునెక్కి, అనేక ఆయుధములతో శబల సైన్యమును వధించాడు.

శబల అంతటితో ఆగలేదు. మరికొన్ని వేలమంది వీరులను సృష్టించింది. వారు విశ్వామిత్రుని సైన్యములో మిగిలియున్న వారిని వధించసాగారు. అదిగాంచి విశ్వామిత్రుడు మహాస్త్రములను ప్రయోగించాడు. వాటి ధాటికి తట్టుకోలేక శబల సేన సంహరించబడింది.

ఇదంతా చూస్తున్న వసిష్ఠుడు ధేనువును పిలిచి, యోగశక్తి ద్వారా విశేషంగా సైన్యాల్ని సృష్టించమని చెప్పాడు.

ధేనువు "హుంభా" అని బిగ్గరగా అరిచింది. అంతే. గోవు యొక్క పొదుగు నుండి, అవయవముల నుండి, కొమ్ముల నుండి, రోమముల నుండి అసంఖ్యాకంగా సైన్యం పుట్టుకొచ్చారు. వారందరు విజృంభించి విశ్వామిత్రుని సైన్యమును క్షణంలో వధించారు.

ఇది గాంచి కుపితులై, క్రుద్ధులైన విశ్వామిత్రుని నూర్గురు కుమారులు ఆయుధములను ధరించి వసిష్ఠుని మీదికి వెళ్ళారు. వసిష్ఠుడు హుంకరించగనే వారంతా కాలి భస్మమై పోయారు.

ఈ విధంగా తన కుమారులు, సైన్యము నశించుట చూసి విశ్వామిత్రుడు సిగ్గుతో తలవంచాడు. తీవ్ర వ్యధకు లోనయ్యాడు.

చలనము లేని సముద్రం లాగా, కోరలు తీసిన పాము లాగా, రాహువు మ్రింగిన సూర్యుడు లాగా విశ్వామిత్రుడు కాంతి హీనుడయ్యాడు.

పుత్రులు, సైన్యము నశించుటచే దుఃఖితుడైన విశ్వామిత్రుడు రెక్కలు తెగిన పక్షిలాగా దీనుడై, అహంకారము అణగినవాడై తీవ్రంగా పరితపించాడు.

ఒక కొడుకును పిలిచి "రాజ్యమును పాలింపుము" అని పలికి వెంటనే హిమవత్పర్వతము చేరి తపస్సు ప్రారంభించాడు. పరమేశ్వరుని ధ్యానిస్తూ కఠోరతపస్సు చేశాడు.

మహేశ్వరుడు తృప్తిచెందాడు. విశ్వామిత్రుని ముందు ప్రత్యక్షమయ్యాడు. వరములను వేడుకోమని పలికాడు.

తనకు ధనుర్వేదమును అనుగ్రహించమని విశ్వామిత్రుడు కోరాడు. దేవదానవయక్షరాక్షస గంధర్వులకు తెలిసిన అస్త్రవిద్యను రహస్యం లేకుండా అనుగ్రహించమని కోరాడు.

"అలాగే" అని ఆశీర్వదించి వెళ్ళాడు మహేశ్వరుడు.

అస్త్రములతో పాటు విశ్వామిత్రునిలో దర్పం కూడా పెరిగింది. పున్నమి నాడు సాగరుడు పొంగినట్లు ఉత్సాహము ఉప్పొంగగ "ఇక వసిష్ఠుడు శూన్యమే" అని భావించి, విశ్వామిత్రుడు వసిష్ఠాశ్రమానికి వచ్చాడు. అస్త్ర ప్రయోగం చేశాడు. అస్త్ర ప్రభావానికి ఆశ్రమం దగ్ధమైంది. అక్కడ ఉన్న మునులందరు ఎటుపడితే అటు పారిపోయారు. మృగాలు, పక్షులు, వసిష్ఠుని శిష్యులు అందరూ పారిపోయారు. చూస్తుండగనే వసిష్ఠాశ్రమం శూన్యమై పోయింది.

"భయపడకండి. పారిపోకండి. సూర్యుడు మంచును నశింపజేయునట్లు, నేను విశ్వామిత్రుణ్ణి నశింప చేస్తాను" అని వసిష్ఠుడు చెబుతున్నా వినకుండా అందరూ పారిపోసాగారు.

## వసిష్ఠుని బ్రహ్మదండం

క్రుద్ధుడైన వసిష్ఠుడు విశ్వామిత్రునితో ఇలా పలికాడు: "ఓరీ! మూర్ఖుడా! ఎంతోకాలంగా వృద్ధి చేయబడిన ఆశ్రమాన్ని నాశనం చేశావు. ఇక నీవు బ్రతకవు" అని పలికి బ్రహ్మ దండమును హస్తమున ధరించాడు వసిష్ఠుడు.

వసిష్ఠుని పలుకుల నాలకించిన విశ్వామిత్రుడు "నిలు-నిలు" అని గర్జించి వసిష్ఠునిపై ఆగ్నేయాస్త్రమును ప్రయోగించాడు.

"ఓరీ దుష్టుడైన రాజా! నీ శక్తి ఏమిటో ఇప్పుడు చూపు. నీ దర్పమును, నీ అస్త్రముల దర్పమును నశింప చేస్తాను. క్షత్రియాధమా! నీ క్షత్రియ బలమెక్కడ? విశిష్టమైన బ్రహ్మ బలమెక్కడ?" చూడు అని విశ్వామిత్రుడు ప్రయోగించిన అస్త్రమును బ్రహ్మదండముచే శాంతింపచేసాడు.

దానితో కోపించిన విశ్వామిత్రుడు వరుసగా వారుణ, రౌద్ర, పాశుపాత, జృంభణ, కాలపాశాది అస్త్రములను ప్రయోగించాడు. వసిష్ఠుడు ఆ అస్త్రముల నన్నిటిని బ్రహ్మదండముచే మింగేశాడు.

చివరగ విశ్వామిత్రుడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించాడు. బ్రహ్మాస్త్ర ప్రయోగము జరుగగనే దేవ గంధర్వాదులందరు దిగ్భ్రాంతి చెందారు. కానీ దానిని కూడా వసిష్ఠుని బ్రహ్మదండం మింగేసింది.

ఆసమయంలో వసిష్ఠుడు ప్రళయకాల రుద్రునివలె గోచరించాడు. వసిష్ఠుని రోమకూపాల నుండి పొగతో నిండిన జ్వాలలు, అగ్నికిరణాలు బహిర్గతమయ్యాయి. వసిష్ఠుని చేతిలోని బ్రహ్మదండం కాలాగ్నిలాగ, యమదండంలాగ ప్రజ్వరిల్లింది.

అప్పుడు మునులందరు వసిష్ఠుని ప్రార్థించారు. "మహర్షీ! నీ బలము అంతం లేనిది. అడ్డులేనిది. విశ్వామిత్రుడు పరాజితుడయ్యాడు. ఇక శాంతించు. లోకాలను రక్షించు," అని ప్రార్థించారు.

మునుల ప్రార్థనలను ఆలకించి వసిష్ఠుడు శాంతించాడు. పరాభూతుడైన విశ్వామిత్రుడు నిట్టూర్పులు విడిచాడు.



**ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మ తేజోబలం బలమ్**
**ఏకేన బ్రహ్మదణ్డేన సర్వాస్త్రాణి హతాని మే ॥**

"ఛీ! క్షత్రియ బలము ఏమి బలము? బ్రహ్మతేజో బలమే నిజమైన బలము. నా అస్త్రములను అన్నిటిని ఒక్క బ్రహ్మదండము మింగేసింది.

"నాకు ఇప్పుడు బాగాతెలిసింది. ఇంద్రియములను వశపరచుకుంటాను. మనసును నిగ్రహిస్తాను. శాంతిస్తాను. నాకు బ్రహ్మత్వం సిద్ధించేటట్లు ఘోరమైన తపస్సు చేస్తాను," అని తన పెద్దభార్యతోకూడి అరణ్యములకేగి, కందమూలములు, ఫలములు మాత్రమే గ్రహిస్తూ తీవ్రమైన తపస్సు చేశాడు.

ఆతరువాత అతనికి హవిష్యందుడు, మధుస్యందుడు, దృఢనేత్రుడు, మహారథుడు అనే నలుగురు పుత్రులు పుట్టారు.

విశ్వామిత్రుని తపస్సుకు మెచ్చి ఈసారి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయ్యాడు. "కౌశికా! నీవు గొప్ప తపస్సు చేసితివి. ఈ తపఃప్రభావముచే నీవు రాజర్షి వయ్యావు" అని పలికి బ్రహ్మదేవుడు అంతర్హితు డయ్యాడు.

విశ్వామిత్రుడు ఆ మాటలు విని సిగ్గుపడ్డాడు. దుఃఖపడ్డాడు. క్రుద్ధుడయ్యాడు. ఇంత కఠోర తపస్సు చేసినా దేవతలు తనను రాజర్షిగనే గుర్తిస్తూ ఉన్నారు. ఈ తపస్సుయొక్క ప్రయోజనమేముంది? అని భావించి మరల తపస్సు చేయ నారంభించాడు.

## త్రిశంకువు

"రామా! ఆ కాలమున ఇక్ష్వాకు వంశమున త్రిశంకువనే రాజు ఉండేవాడు. అతడు జితేంద్రియుడు. సత్యవాది. యజ్ఞము చేసి, దేహంతో స్వర్గం వెళ్ళాలని అతని అభిలాష," అంటూ త్రిశంకుని గూర్చి చెబుతున్నాడు శతానందుడు.

అతడు తన అభిప్రాయాన్ని వసిష్ఠునికి తెలిపాడు. అది సాధ్యపడదు అన్నాడు వసిష్ఠ మహర్షి.

ఆతరువాత త్రిశంకుమహారాజు వసిష్ఠుని కుమారులను సంప్రదించాడు. జరిగిందంతా వసిష్ఠుని నూర్గురు పుత్రులకు తెలిపాడు. వసిష్ఠుడు నిరాకరించింది కూడా చెప్పాడు.

ఎలాగైనా యజ్ఞము చేయుటకు తనకు అనుమతి ఇవ్వమని వారిని కోరాడు. వసిష్ఠుడు నిరాకరించిన తరువాత తనకు గురుపుత్రులు తప్ప వేరేమార్గము లేదని చెప్పాడు.

త్రిశంకుని వచనములను ఆలకించిన వసిష్ఠుని నూర్గురు పుత్రులు క్రోధావిష్టు లయ్యారు.

"ఓ దుర్బుద్ధీ! గురువుపై నీకు ప్రగాఢ విశ్వాసములేదు. కానిచో, గురువు నిరాకరించిన పిదప మరొకరిని ఆశ్రయిస్తావా? అది గురుద్రోహం కాదా? గురువు వాక్యమును అతిక్రమించవచ్చా?

"రాజా! నీవు మూర్ఖుడవు. అలాగానిచో వసిష్ఠమహాముని అసాధ్యము అని పలికిన కార్యమును మేము చేయించగలమా? అలా చేయడము ఆ మహాత్ముని అవమానించినట్లే అవుతుంది. నీవు అనవసరంగా తండ్రీతనయులమధ్య వైరమును సృష్టిస్తున్నావు;" అని పలికారు.

వారిమాటలను ఆలకించిన త్రిశంకువు, "గురుపుత్రులారా! నా అభీష్టమును మీరు నెర వేర్చగలరని భావించి నేను మిమ్మల్ని ఆశ్రయించాను. మీరూ నిరాకరించారు. మరొక మార్గమును అన్వేషిస్తాను" అన్నాడు.

అది విని వసిష్ఠ కుమారులు, "నీవు ఘోరమైన ఉద్దేశంతో చరిస్తున్నావు. చండాలుడవు అయ్యెదవు గాక!" అని శపించారు.

తెల్లవారేసరికి త్రిశంకువు చండాలుడై పోయాడు. శరీరం నల్లగా మారిపోయింది. కట్టుకున్న వస్త్రాలు కూడా నల్లబడ్డాయి. కేశములు పొట్టివి అయ్యాయి. వల్లకాటి బూది శరీరానికి అలుముకొని ఉంది. స్వర్ణాభరణములన్ని ఇనుప ఆభరణాలయ్యాయి.

అతని చండాల రూపమును చూచి మంత్రులు, పౌరులు, అనుచరులు అందరూ దూరంగా పారిపోయారు.

ఏకాకియైన త్రిశంకువు దుఃఖితుడై, ఏమి చేయాలో బోధపడక విశ్వామిత్రుని వద్దకు వచ్చాడు.

త్రిశంకువుద్వారా జరిగిందంతావిని విశ్వామిత్రుడు జాలిపడ్డాడు. " నీకు శుభము కలుగు గాక!" అని ఆశీర్వదించాడు. "రాకకు కారణమేమిటి?" అని ప్రశ్నించాడు విశ్వామిత్రుడు.

"మహర్షీ! నేను అనేకములైన యజ్ఞాలు చేశాను. ప్రజలను ధర్మంగా పరిపాలించాను. నా ప్రవర్తన ద్వారా పెద్దలను, మహాత్ములను తృప్తిపరచాను.

"మహాత్మా! నేను అబద్ధమాడి ఎరుగను. ఎన్ని ఆపద లెదురైనా సత్యమును విడువలేదు. నా క్షత్రియధర్మముపై ఒట్టుపెట్టి చెప్పుచున్నాను.

"ఓ సౌమ్యుడా! ఈ శరీరముతో స్వర్గానికి వెళ్ళాలని నాలో కుతూహలం జనించింది. కోరిక ఏర్పడింది. నాకోర్కెను గురువు అంగీకరించలేదు. గురుపుత్రులు కూడా నిరాకరించారు.

**దైవమేవ పరం మన్యే పౌరుషం తు నిరర్థకమ్**

**దైవేనాక్రమ్యతే సర్వం దైవం హి పరమాగతిః**

"దైవమే బలీయము. ప్రయత్నము వ్యర్థం. అంతా దైవవశమే. దైవమే ఉత్తమ గమ్యము.

"నేనెంత ధర్మంగా ప్రవర్తించినా ఉపయోగం లేకుండా పోయింది. దైవమే బలీయంగా తెలుస్తూ ఉంది. దైవము తిరస్కరించినందున నా ప్రయత్నాలు ఫలించడంలేదు.

"మహర్షీ! ఆర్తితో నిన్ను ఆశ్రయించాను. నన్ను అనుగ్రహించు. ఆశీర్వదించు. నీకు శుభం కలుగుతుంది. నేను ఇక ఎవ్వరినీ ఆశ్రయించను. నన్ను రక్షించేవాడు ఈ లోకములో మరొకడు లేడు. నీవే నాకు శరణ్యము" అన్నాడు.

త్రిశంకువు మాటల నాలకించి జాలిపడిన విశ్వామిత్రుడు," కుమారా! నీవు ధర్మ బుద్ధి గలవాడవని నాకు తెలుసు. భయపడకు. నీకు నేను అండగా ఉండగలను.

"రాజా! తేజోవంతులైన మహర్షులను యజ్ఞ సహాయకులుగా రమ్మని ఆహ్వానిస్తాను. నీవు స్వర్గమునకు వెళ్ళగలవు. నిశ్చింతగా ఉండు;" అని పలికి యజ్ఞ సన్నాహములను చేయుమని తన కుమారులను ఆజ్ఞాపించాడు.



శిష్యులను పిలిచి మహర్షులందరిని ఆహ్వానించమని చెప్పి, ఆహ్వానమును ఎవరు అనాదరంగా స్వీకరిస్తారో అట్టివారు పలికిన మాటలు కూడా తనకు వినిపించమని చెప్పాడు.

శిష్యులు వెళ్ళి మహర్షులను, ఋత్విక్కులను ఆహ్వానించి తిరిగివచ్చారు. ఆహ్వానము నందుకొనిన ఋషులందరు వచ్చుచున్నారనియు, మహోదయుడు, వసిష్ఠుని కుమారులు మాత్రమే అనాదరముతో భాషించారనియు విశ్వామిత్రునితో చెబుతారు.

"యజ్ఞాన్ని క్షత్రియుడా చేయించేది? పైగా చండాలుడా చేసేది? ఆ యజ్ఞానికి దేవత లెలా వస్తారు? హవిస్సునెలా గ్రహిస్తారు? చండాలుని అన్నము భుజించి బ్రాహ్మణులు స్వర్గానికి ఎలా వెళ్తారు?" అని మహోదయుడు, వసిష్ఠ కుమారులు పలికారని శిష్యులు విశ్వామిత్రునికి చెప్పారు.

ఆ మాటలు వినగానే విశ్వామిత్రుడు క్రోధముతో ఊగిపోసాగాడు. నేత్రములు ఎఱ్ఱబడ్డాయి.

"ఏ దోషములు లేక ఉగ్రతపస్సు నాచరించుచున్న నన్ను నిందించిన ఆ దురాత్ములు భస్మమయ్యెదరుగాక! రాబోవు జన్మలలో వికృత రూపములను దాల్చి కుక్కమాంసమును భక్షిస్తూ జీవించెదరుగాక!" అని శాపం పెట్టాడు.

యాగాన్ని ప్రారంభించేముందు ఋషులతో విశ్వామిత్రుడు ఇలా పలికాడు.

"ఈ త్రిశంకువు ధర్మాత్ముడు. దాతృత్వము కలవాడు. ఇక్ష్వాకువంశ రాజు. ఈ శరీరముతో స్వర్గానికి వెళ్ళాలని నా సహాయాన్ని కోరాడు.

"ఇతని కొరకు యజ్ఞము చేయాలని నేను సంకల్పించాను. మీరందరూ సహాయం చేయండి;" అన్నాడు.

మహర్షులందరు అంగీకరించి యజ్ఞకార్య క్రమములలో నిమగ్నమయ్యారు. ఆ యజ్ఞానికి విశ్వామిత్రుడు అధ్వర్యుని పాత్ర పోషించాడు.

యజ్ఞసమాప్తి సమయాన విశ్వామిత్రుడు మంత్రాన్ని పలికి హవిర్భాగములను పుచ్చుకొనుటకు దేవతలను ఆహ్వానించాడు. దేవతలు రాలేదు.

విశ్వామిత్రునికి భరింపరాని కోపం వచ్చింది. తన చేతిలోని హోమ సాధనమును పైకెత్తి, "త్రిశంకు మహారాజా! నా తపశ్శక్తిని వీక్షించు. నిన్ను సశరీరంగా స్వర్గానికి పంపుతాను. అన్యులకు సాధ్యము గాని దానిని నీవు పొందుతావు," అన్నాడు.

అంతే. మహర్షులంతా చూస్తూ ఉండగనే త్రిశంకువు సశరీరుడై స్వర్గానికి వెళ్ళాడు.

స్వర్గములో ప్రవేశిస్తున్న త్రిశంకువుని ఇంద్రుడు చూశాడు. "మూఢుడా! గురుశాపమునకు గురైన నీవు స్వర్గములో ప్రవేశించుటకు అనర్హుడవు. వెళ్ళు. తలక్రిందులుగా భూమిపై పడు" అని శపించాడు.

"మహర్షీ! రక్షమాం! రక్షమాం!" అంటూ త్రిశంకువు క్రిందపడిపోయాడు. అది చూసి ఉద్విగ్న మనస్కుడైన విశ్వామిత్రుడు ఇంకా పడుతూ ఉన్న త్రిశంకువుని "అక్కడే ఆగిపో" అని పలికి త్రిశంకుని చుట్టూ సప్తర్షి మండలాన్ని, నక్షత్ర మండలాన్ని సృష్టించాడు.

"చూడండి. మరొక ఇంద్రుని సృష్టిస్తాను. లేదా అసలు ఇంద్రుడే లేకుండా పోవాలి" అని పలుకుచు విశ్వామిత్రుడు దేవతలను కూడా సృష్టించేందుకు ప్రారంభించాడు.

అది చూసి సురాసురులు భయభ్రాంతులకు లోనయ్యారు. విశ్వామిత్రుని సమీపించారు.

"తపస్వీ ! విశ్వామిత్రా ! గురుశాపహతుడైన ఈ త్రిశంకువు స్వర్గప్రవేశమునకు అనర్హుడు" అన్నారు.

"దేవతలారా! మీకు శుభం కలుగుగాక! ఈ త్రిశంకువు బొందితో స్వర్గం చేరాలని అభిలషించి నన్ను ఆశ్రయించాడు. ఇతనిని స్వర్గానికి పంపెదనని నేను ప్రతిజ్ఞ చేశాను. నామాట అసత్యం కాకూడదు;" అన్నాడు విశ్వామిత్రుడు.

"మహర్షీ! నీ సృష్టి జ్యోతిశ్చక్రమునకు బయట శాశ్వతంగా ఉంటుంది. ఆ నక్షత్రాల మధ్య త్రిశంకువు దేవతా పరివేష్టితుడై శోభిస్తూ ఉంటాడు. అతడు ధన్యుడయ్యాడు. కీర్తిమంతుడయ్యాడు;" అన్నారు.

ఋషులచే, దేవతలచే కీర్తించబడిన విశ్వామిత్రుడు "సరే"నని అంగీకరించాడు. యజ్ఞానికి అరుదెంచిన దేవతలు, ఋషులు, పురోహితులు తిరిగి స్వస్థానములకు వెళ్ళారు.

విశ్వామిత్రుడు ఎంతో కాలం తపస్సు చేశాడు. బ్రహ్మర్షి కావాలనే ధ్యేయంతో భయంకరంగా తపస్సు చేశాడు. కానీ ఆంతర్యంలో కామక్రోధాది శత్రువులు ఏదో సమయాన ఏదో విధంగా విజృంభించడం, వాటి ఫలితంగా శ్రమించి సాధించిన తపఃఫలమును నష్టపోవడం జరుగుతూ వచ్చింది.

వసిష్ఠమహర్షి ఆశ్రమంపై దండెత్తి, ఆయనను ధిక్కరించి తపోబలాన్ని వృథా చేసుకున్నాడు. అలాగే పౌరుషానికి పోయి త్రిశంకునికి స్వర్గాన్ని సృష్టించడములో మరొకసారి తపస్సును వ్యర్థం చేసుకున్నాడు. అలాగే అంబరీషుని యజ్ఞానికి యజ్ఞపశువుగా అమ్మబడిన శునశ్శేపుడనే మునిబాలుని ఉద్ధరించాలనే సంకల్పంతో ఇంకొకసారి తపఃఫలాన్ని ధారబోసుకున్నాడు.

అంతఃశత్రువులను జయించనిదే బాహ్యంలో ఏది సాధించి సుఖించలేమని ఇప్పటివరకు మనం చూచిన విశ్వామిత్రుని చరిత్ర నిరూపిస్తూ ఉంది.

ఇన్ని సార్లు తపోబలము నశించినా విశ్వామిత్రునిలో పట్టుదల సడలలేదు. ఈసారి పుష్కరక్షేత్రంలో ఘోరతపస్సును ప్రారంభించాడు. ఆయన తపస్సుకు సంతసించిన బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై "కౌశికా ! నీవు ఆచరించిన పుణ్యకర్మలచేత నీవు ఋషివి అయ్యావు;" అని పలికి అంతర్ధానమయ్యాడు.

విశ్వామిత్రుడు తపస్సును విరమించలేదు. కొనసాగించుచునే యున్నాడు.

## అప్సరస మేనక

ఉత్తమమైన పుష్కర క్షేత్రమందు విశ్వామిత్రుడు తపస్సు చేస్తున్నాడు. ఒకనాడు మేనక అనే ఒక అప్సరస పుష్కర తీర్థంలో స్నానం చేస్తూ ఉండింది. పుష్కర తీర్థంలో జలకమాడుతున్న మేనక మబ్బుల మధ్య మెరుపు లాగా గోచరిస్తున్నది.



విశ్వామిత్రుడు మేనకను చూశాడు. అసమాన సౌందర్యవతి, అపురూప లావణ్యవతి అగు మేనకను చూడగనే విశ్వామిత్రుని హృదయ సరోవరంలో కామకెరటాలు ఉవ్వెత్తున లేచిపడుతున్నాయి.

విశ్వామిత్రుడు మేనకను సమీపించాడు. "ఓ అప్సరసా! నేనెవరో తెలుసా! నేను విశ్వామిత్రుడను. ఈ క్షణం నుండి నీ మిత్రుడను. నన్ను అనుగ్రహించు. నా ఆశ్రమంలో జీవించు. నిన్ను చూచిన క్షణం నుండి మన్మథుడు నా మనసును పిండేస్తున్నాడు" అని పలికాడు విశ్వామిత్రుడు.

మేనక నవ్వి విశ్వామిత్రుని అనుసరించింది. ఆమె ఆశ్రమంలో వుండగా సుఖంగా, తృప్తిగా పది సంవత్సరాలు గడచిపోయాయి.

విశ్వామిత్రునిలో పరివర్తన కలిగింది. సిగ్గుపడి చింతతో, ఆవేదనతో కుమిలిపోయాడు. "నా తపస్సును హరించడానికి ఇదంతా దేవతలు చేసిన పని. నా తపస్సు తీవ్రంగా దెబ్బతిన్నది" అని చాలా దుఃఖించాడు.

విశ్వామిత్రునిలోని మార్పును మేనక పసిగట్టింది. వణకుతూ నిలబడి మహర్షికి నమస్కరించింది. శపిస్తాడేమోనని భయపడింది.

"మేనకా! జరిగింది మరచిపో. భవిష్యత్తు గతాన్ని అనుసరించాలని కోరుకోకు. విధి చేతిలో కీలు బొమ్మలయ్యాం. నీ తప్పేమీ లేదు. నా మీద నాకు ఆధీనం లేకుండాపోయింది. పరాధీనుణ్ణయ్యాను. ఎవరిని నిందించి లాభంలేదు. ఎవరి తప్పుకు వారే బాధ్యులు. వెళ్ళిరా," అని మధురవచనములతో మేనకను పంపేశాడు.

విశ్వామిత్రుడు హిమవత్పర్వతము చేరాడు. కౌశికీనదీ తీరాన గొప్ప తపస్సు ప్రారంభించాడు.

ఇది విశ్వామిత్రునిలో విశిష్టత. పతనమైన ప్రతిసారి మళ్ళీ ద్విగుణీకృత ఉత్సాహంతో ప్రగతి కోసం పరితపిస్తాడు. ప్రయత్నించి సాధిస్తాడు.

**Our greatest glory is not in never falling, but in rising every time we fall.**

"పతనం కాకుండా ఉండటంలో గాక, పతనమైన ప్రతిసారి మరల లేవడంలోనే మన దివ్యవైభవం దాగి ఉంది" అంటాడు కన్ఫూషియస్.

విశ్వామిత్రమహాముని విషయంలో ఇది అక్షర సత్యమైంది. మళ్ళీ ఘోరతపస్సు ప్రారంభించాడు. ఆయన తపస్సును గాంచి దేవతలంతా భీతి చెందారు.

## మహర్షిత్వం

దేవతలు, ఋషులు బ్రహ్మదేవుని సమీపించారు. భయంకరమైన విశ్వామిత్రుని తపస్సును గూర్చి వివరించారు. విశ్వామిత్రుడు మహర్షిత్వమునకు అర్హుడయ్యాడని తమ అభిప్రాయాన్ని విరించికి వివరించారు.

బ్రహ్మదేవుడు సంతసించి విశ్వామిత్రుని చేరాడు. అతని ఉగ్ర తపస్సుకు తృప్తి చెంది మహర్షిత్వమును ప్రసాదించాడు.

**మహర్షే స్వాగతం వత్స తప సోగ్రేణ తోషితః**
**మహత్త్వ మృషి ముఖ్యత్వం దదామి తవ కౌశిక ॥**

"మహర్షీ! నీవు చేసిన ఉగ్ర తపస్సుకు సంతోషించాను. నీకు మహత్త్వమును, ఋషిత్వమును అనుగ్రహించుచున్నాను" అన్నాడు బ్రహ్మదేవుడు.

మహత్త్వము, ఋషిత్వము కలిసి మహర్షిత్వము అయింది. బ్రహ్మదేవుడు మహర్షిత్వమును అనుగ్రహించిన సమయాన విశ్వామిత్రుడు సుఖదుఃఖాలకు అతీతంగా నిలిచాడు.

బ్రహ్మదేవునికి నమస్కరించి, "పూజ్యుడా! నాకు మహర్షిత్వమును ప్రసాదించావు. నేను జితేంద్రియుడ నయ్యానుగదా!" అని ప్రశ్నించాడు.

"మహర్షీ ! నీవు మహర్షివయ్యావు. జితేంద్రియుడవు కాలేదు. ఇంకా ప్రయత్నించు" అని పలికి బ్రహ్మ అంతర్హితు డయ్యాడు.

ఇంద్రియాలను జయించలేని కారణంగా గతంలో విశ్వామిత్రుడు అనేక చేదు అనుభవాలను చూడవలసి వచ్చింది. ఇంద్రియాలను జయించనపుడు, కామ క్రోధాలను అణచలేనపుడు ఏ మహర్షిత్వమైనా నిరుపయోగమే అని విశ్వామిత్రుడు భావించాడు.

ఈసారి మళ్ళీ తపస్సు ప్రారంభించాడు. ఏ ఆధారం లేకుండా చేతులు పైకెత్తి, వాయు భక్షణం మాత్రం చేస్తూ, కాలమార్పులకు చెదరకుండా, ఋతు పరిణామాలకు బెదరకుండా భయంకర తపస్సు సాగించాడు.

దేవతలు మరల భీతి చెందారు. దేవేంద్రుడు భయభ్రాంతులకు లోనయ్యాడు. రంభను పిలిచాడు. విశ్వామిత్రుని మోహింపజేసి తపోభంగము కల్పించమని చెప్పాడు.

"దేవేశా! నాకు భయంగా ఉంది. విశ్వామిత్రుడు కోపిష్టి. నన్ను శపిస్తాడేమో అనే శంక నన్ను పీడిస్తూ ఉంది" అని చేతులు జోడించి వణకుచూ పలికింది రంభ.

"రంభా! భయపడకు. నీకు శుభం కలుగుతుంది. నే చెప్పినట్లు ఆచరించు. అందమైన వసంతఋతువు అరుదెంచింది. నేను కోకిల రూపమును ధరిస్తాను. మన్మథుడు నన్ను అనుసరిస్తాడు. మేమిద్దరము నీ ప్రక్కనే ఉంటాము" అన్నాడు ఇంద్రుడు.

దేవేంద్రుని మాట ప్రకారము రంభ దివ్యమైన రూపమును ధరించింది. విశ్వామిత్రుడు తపస్సు చేయుచున్న చోటికి వచ్చింది.

ఒయ్యారం ఒలకబోస్తూ, మధువు లొలికే మాటలతో, మైమరపించే పాటలతో, మురిపించే ఆటలతో మహర్షికి మత్తెక్కించాలని వలపు వీణను శ్రుతి చేసింది రంభ.

"కుహూ కుహూ" అంటూ గానం చేశాడు కోకిల రూపంలో ఇంద్రుడు. పిల్లగాలితో జత చేరాడు అల్లరి చేయు మన్మథుడు. రంభ మేను కదిపింది. గొంతు ఒలికి తియ్యనిగానం దొర్లింది.



*పుట్టిన ఒక పూటలోనే*
*పుడమిపై రాలుతుంది కుసుమం*
*పుడమి ఈడు నాశ్రయించి*
*పులకరించి పోతుంది జీవితం ॥*

*ఎండనక వాననక*
*మండిపోవు టెందుకు? ఇలా ఉండిపోవు టెందుకు?*
*వసంత శోభ ఇందుకా?*
*చిన్ని కోకిలమ్మ విందుకా? ॥ పుట్టిన ॥*

*కాచిన వెన్నెల ఎంత చల్లన*
*పూచిన మల్లెలు ఎంత తెల్లన*
*దివి నుండి భువికి దిగిన ఈ లలన*
*నీ చూపు కైన నోచుకోదు ఎందువలన? ॥ పుట్టిన ॥*

*దండిగ ప్రేమను పంచే*
*అండగ భాముండగా*
*సందడికి ముందడుగై*
*ఉండిపోవా! ఎదలో నిండిపోవా ॥ పుట్టిన ॥*

అంటూ ప్రేమామృతాన్ని కురిపించింది రంభ.

తపోధనుడైన విశ్వామిత్రుడు కళ్ళు తెరచి సంతోషంతో రంభను చూశాడు. కోకిలమ్మ మధుర ధ్వని, పిల్లగాలి గిలిగింత, వీటి వెనుకనే రంభ- విశ్వామిత్రునికి ఎందుకో సందేహం కలిగింది.

ఇంద్రుని పన్నాగాన్ని పసిగట్టాడు కౌశికుడు. రంభవైపు తిరిగాడు. "రంభా! కామక్రోధాలను నిగ్రహించాలని ప్రయత్నించే నన్ను ప్రలోభానికి గురిచేసి పతనం చేయాలని వచ్చావు. నీవు పదివేల సంవత్సరాలు ఱాతిబండవై పడి ఉందువు గాక!" అని శపించాడు.

మేనకకు లొంగినట్లు విశ్వామిత్రుడు రంభకు లొంగలేదు. గతానుభవాన్ని స్మృతిలో ఉంచుకొని జాగ్రత్తగా ప్రవర్తించాడు. కామాన్ని జయించగలిగాడు. కానీ క్రోధాన్ని జయించలేక శాపమిచ్చాడు.

**కోపేన స మహాతేజా స్తపోపహరణే కృతే**
**ఇన్ద్రియై రజితై రామ న లేభే శాన్తిమాత్మనః**

"ఈవిధంగా కోపించుటవలన తపస్సు క్షీణించింది. ఇంద్రియాలను జయించక పోవుట చేత మహాతేజోవంతుడైన విశ్వామిత్రుడు మనశ్శాంతిని కోల్పోయాడు" అని శతానందుడు శ్రీరాముడికి చెబుతున్నాడు.

తపస్సులో ఉత్తీర్ణత పొందడమనేది అంత సులభ సాధ్యం కాదని మనకు తెలుస్తూనే వుంది. విశ్వామిత్రుని విషయం పరికిస్తే ఆ అభిప్రాయం మరీ దృఢమౌతుంది.

తపస్సు కొండప్రయాణము లాంటిది. భగవంతుని అనుగ్రహము లభించినపుడే సాధకుడు ప్రగతిని సాధిస్తాడు. తన పూర్వస్థితిని మనసు అంత తేలికగా మార్చుకోదు. కనుక తపస్సు చేసినంత మాత్రాన తరిస్తాము అనుకోవడం భ్రమే అవుతుంది.

అహంకారాన్ని అన్ని స్థాయిలలో అదృశ్యం చేసినపుడే ఆధ్యాత్మిక ప్రగతి లభిస్తుంది. ఇది జరుగనపుడు మనం చేసే సాధన, తపస్సు అంతా వృథాగా మిగిలిపోతుంది. భ్రమగా నిలిచిపోతుంది.

**దేహాభిమాన ముండగ**

**మోహాదులు విడుచు నెట్లు మునులకు నైనన్**

అన్నాడు వేమన.

ఆధ్యాత్మిక మార్గము వాస్తవానికి ముళ్ళబాట. కష్టపడి అధిరోహించాల్సిన మార్గము. ఏ క్షణాన్నైనా జారేందుకు వీలుండే మార్గము. కానీ దృఢనిశ్చయంతో, గురుభక్తితో, శరణాగతితో చరించే వారికి అది చాలా సులువైన మార్గము.

రంభను శపించడం వలన మళ్ళీ తపస్సు క్షీణించగా కలత చెందిన విశ్వామిత్రుడు కామక్రోధాలకు ఇక మీదట వశపడకూడదని దృఢనిశ్చయానికి వచ్చాడు.

**నైవ క్రోధం గమిష్యామి న చ వక్ష్యే కథం చన**

"నేను ఇక కోపాన్ని పొందను. ఏమైపోయినా నేను నోరు కదపను" అని నిర్ణయించుకొని మళ్ళీ తపస్సు ప్రారంభించాడు.

ఇంద్రియాలను జయించాడు. శరీరం శుష్కించి పోయింది. ఆహారాన్ని త్యజించాడు. ఇంతవరకు ఎవరు కని, విని, ఎరుగని రీతిలో ఘోర తపస్సు చేశాడు.

## వసిష్ఠుడు చెప్పాలి

విశ్వామిత్రుడు చిక్కి శల్యమైనాడు. అనేక విఘ్నాలు వచ్చాయి. అయినా క్రుద్ధుడు కాలేదు. ఈసారి తిరుగులేని తపస్సు చేశాడు.

ఇలా వేయి సంవత్సరములు తపస్సు చేశాడు. ఒక రోజు అన్నము తినాలని అనిపించింది మహర్షికి. అన్నమును సిద్ధం చేసుకున్నాడు.

భుజించబోయే సమయానికి ఇంద్రుడు బ్రాహ్మణ రూపంలో వచ్చాడు. ఆ అన్నాన్ని అర్థించాడు. విశ్వామిత్రుడు ఆ ఆహారాన్ని బ్రాహ్మణున కిచ్చేశాడు. అతనిని ఏమీ అనలేదు.

మళ్ళీ వేయిసంవత్సరాలు తపస్సు కొనసాగించాడు. ఉచ్ఛ్వాస నిశ్వాసాలను పూర్తిగ బంధించాడు. అతని శిరస్సునుండి పొగలు పైకెగిసి వస్తున్నాయి. దేవగంధర్వపన్నగాసురులందరు భీతిచెందిన వారై బ్రహ్మదేవుని సమీపించారు.

"ప్రభూ! విశ్వామిత్రుని ఘోరతపస్సు అనూహ్యమైన స్థితికి చేరింది. ఈసారి అతడు ఏ ప్రలోభములకు గురికావడం లేదు. కోపించే పరిస్థితులను కల్పించినను క్రుద్ధుడు కావడం లేదు. పాపరహితుడుగా తెలుస్తున్నాడు.



"దిక్కులన్నీ కాంతిహీనమై ఉన్నాయి. సముద్రాలు కల్లోలంగా ఉన్నాయి. పర్వతాలు బీటలు వారుతున్నాయి. భూమి అప్పుడప్పుడు కంపిస్తూఉంది. అతడు కోరిన వరములిచ్చి అతనిని శాంతపరచండి" అని దేవతలు సృష్టికర్తను ప్రార్థించారు.

దేవతలతో కూడి బ్రహ్మదేవుడు విశ్వామిత్రుని సమీపించాడు.

**బ్రహ్మర్షే స్వాగతం తేఽస్తు తపసా స్మ సుతోషితాః**

**బ్రాహ్మణ్యం తపసోగ్రేణ ప్రాప్తవానసి కౌశికా ॥**

"ఓ బ్రహ్మర్షీ! నీకు స్వాగతం. నీ తపస్సు మాకు ఆనందమును ఒనగూర్చినది. కౌశికా! ఉగ్రతపస్సు చేత నీవు బ్రాహ్మణత్వమును పొందావు.

"ఓ బ్రాహ్మణుడా! నీకు దీర్ఘాయుషును ప్రసాదిస్తున్నాను. నీకు శుభం కల్గుతుంది" అన్నాడు బ్రహ్మదేవుడు.

బ్రహ్మదేవుని మాటలు ఆలకించి విశ్వామిత్రుడు సంతృప్తి చెందాడు. నమస్కరించాడు.

"పూజ్యుడా! బ్రహ్మదేవా! నాకు బ్రాహ్మణత్వము, దీర్ఘాయుషు లభించినచో నన్ను వేదములు, ఓంకార వషట్కారములు వరించుగాక! వేదాలను ఇతరులకు బోధించే అధికారము ప్రాప్తించుగాక! యజ్ఞ యాగాదులు నిర్వహించే అధికారము లభించుగాక!

"ముఖ్యంగా బ్రహ్మపుత్రుడైన వసిష్ఠుడు నన్ను బ్రహ్మర్షిగా అంగీకరించుగాక! నాకు శ్రేష్ఠమైన ఈ వరమును ప్రసాదించినచో మీరు వెళ్ళవచ్చు" అన్నాడు విశ్వామిత్రుడు.

దేవతలు వసిష్ఠుని సమీపించి ప్రార్థించారు. వసిష్ఠుడు అంగీకరించాడు. వచ్చి విశ్వామిత్రుని కలిశాడు. సంధి చేసుకున్నాడు."నీవు బ్రహ్మర్షివి" అని దేవతల ముందు పలికాడు.

సంతసించిన దేవతలు అంతర్ధాన మయ్యారు.

**జెథే కామ్ క్రోధా సలోభతా ।**

**నిః శేష నామీతే బ్రహ్మశాంతతా ॥**

"కామక్రోధ లోభాలు నిశ్శేషంగా తొలగినప్పుడే బ్రహ్మశాంతి కల్గుతుంది" అని మరాఠీ భాషలోని భావార్థ రామాయణంలో సంత్ ఏక్‌నాథ్ అంటాడు.

ధర్మాత్ముడైన విశ్వామిత్రుడు ఉత్తమమైన బ్రహ్మర్షిత్వమును సాధించాడు. బ్రహ్మర్షియైన వసిష్ఠమహామునిని పూజించాడు.

అహంకారము అదృశ్యమైన తరువాత ఆచరించేవన్నీ అర్చనలే.

**Dignity consists not in possessing honours but in the consciousness that we deserve them.**

"గౌరవమనేది బిరుదులు పొందడములో రాదు. వాటికి మనం తగియున్నామా అనే స్పృహలో ఉంది" అంటాడు అరిస్టోటల్.

"రామా! విశ్వామిత్రుడు ఈ విధంగా బ్రాహ్మణత్వమును సాధించుకున్నాడు.

**ఏష రామ మునిశ్రేష్ఠ ఏష విగ్రహవాం స్తపః**

**ఏష ధర్మ వరో నిత్యం వీర్య స్యైష పరాయణమ్**

"రామా! ఇతడు మునులలో శ్రేష్ఠుడు. అతడు మూర్తీభవించిన తపస్సు. అతడు సదా ధర్మపరుడు. పరాక్రమవంతుడు;" అని శతానందుడు విశ్వామిత్రుని గూర్చి రామునికి చెప్పి దివ్యమైన విశ్వామిత్రుని చరిత్రను సమాప్తి చేశాడు.

జనకమహారాజు విశ్వామిత్రునికి చేతులు జోడించి నమస్కరిస్తూ "మునిపుంగవా! నీవు రామలక్ష్మణులతో గూడి నా యజ్ఞమునకు వచ్చి నన్ను ధన్యుణ్ణి చేశావు. నీ దర్శనంతో నేను పవిత్రుణ్ణయ్యాను.

"మహాత్మా! నీ తపస్సు, నీ బలము, నీ గుణములు అప్రమేయాలు. మహర్షీ! సూర్యుడు అస్తాద్రిని చేరుతున్నాడు. రేపు ప్రాతఃకాలమున దర్శింతుము. మీకు స్వాగతము. నాకు అనుజ్ఞనిమ్ము" అని సెలవు గైకొని జనకుడు వెళ్ళాడు.

జనకునితోపాటు అందరూ విశ్వామిత్రునికి ప్రదక్షిణ నమస్కారాలు చేశారు. విశ్వామిత్రుడు, రామలక్ష్మణులు తమ నివాసానికిచేరి విశ్రాంతి తీసుకున్నారు.

## అయోనిజ ఆవిర్భావం

మిథిలా నగరానికి రాజు జనకచక్రవర్తి. జనకుడు ధర్మాత్ముడు. ధర్మజ్ఞుడు. వేదవేత్త. బ్రహ్మజ్ఞాని. గొప్పవీరుడు. ప్రవృత్తి మార్గంలో చరించి జీవన్ముక్తుడైన వాడు.

**కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః**

"జనకుడు మొదలైన వారు కర్మయోగమును ఆశ్రయించి ముక్తిని పొందినారు" అని భగవద్గీతలో కూడా శ్రీకృష్ణపరమాత్మ జనకుని ప్రస్తావించాడు.

జనకుడు దశరథునికి చాలాకాలంగా స్నేహితుడు. సీత జనకుని కుమార్తె.

జనకమహారాజు ఒకప్పుడు యజ్ఞము చేయాలని సంకల్పించి, బంగారు నాగలితో యజ్ఞభూమిని దున్ని చదును చేస్తున్నాడు. నాగేటిచాలు నుండి ఒక దివ్యమైన పాప కన్పించింది. సంతానం లేని తనకు ఈ పాపను భూదేవి ప్రసాదించింది అని జనకుడు భావించాడు. నాగేటిచాలు నుండి లేచింది కనుక ఆ పాపను 'సీత' అని పిలిచారు.

సీత సద్గుణరాశి. సీతలో చేరిపోతే తమకే కీర్తి లభిస్తుందని భావించి సుగుణాలన్నీ ఒకదాని వెంబడి మరొకటి నెట్టుకుంటూ వచ్చి సీతలో చేరిపోయాయి అంటాడు తమిళంలో కంబరు కవి.

సీతమ్మకు యుక్తవయస్సు వచ్చింది. ఆమెకు వివాహం చేయాలంటే జనకునికి తగిన వరుడు లభించలేదు. అయోనిజయైన సీతను వివాహమాడుటకు పరాక్రమమే శుల్కమని జనకుడు నిర్ణయించాడు.

ఆమెను వివాహం చేసుకోవాలని ఎందరెందరో రాజులు వచ్చారు. కానీ ఆమె వీర్యశుల్కయని పలికి జనకుడు ఎవరినీ అంగీకరించలేదు.

పూర్వము దక్షయజ్ఞము ధ్వంసమైన సమయాన మహేశ్వరుడు శివధనుస్సును దేవతలకు ఇచ్చాడు. వారు ఆ ధనుస్సును నిమిచక్రవర్తికి ఆరవవాడైన దేవరాతుడు అనే రాజువద్ద దాచారు.



ఆ ధనుస్సును పూర్వం తాను యాగము చేసినపుడు వరుణదేవుడు తనకు ఇచ్చాడు. దానిని సామాన్యులు ఎత్తలేరు. దానిని ఎవరు ఎక్కుపెడతారో వారికి సీతను ఇవ్వాలని జనకుడు నిర్ణయించుకున్నాడు.

సీత చాలా అందమైనది. సీత పుష్పవనంలో సంచరిస్తూ ఉంటే ఆమె దేహకాంతి ఆ వనవాటికకే నూతన శోభను చేకూర్చేది అన్నాడు రామచరితమానసంలో తులసీదాసు.

అట్టి సీతను వివాహమాడాలని అనేకమంది రాజులు వచ్చి, ఆమె వీర్యశుల్కయని తెలిసికొని, ధనుస్సును తాకలేక, మన్మథుని చెరుకువింటి తాకులకు తట్టుకోలేక వచ్చిన దారి శ్రేష్ఠమైందని భావించి వెళ్ళేవారు అంటాడు కంబరు.

సీతను వివాహమాడే వీరుడు ఎప్పుడు వస్తాడా అని జనకుడు నిరీక్షిస్తూ ఉండేవాడు. రాముని చూచిన తరువాత సీతకు తగిన వరుడు రాముడే అని అభిప్రాయం జనకునికి కలిగింది. రాముడు ఆ ధనుస్సును వంచి అల్లెతాడు కడితే బాగుండును అని భావించాడు జనకుడు తన మనసులో.

రాముని చూడగనే జనకుని మనసులో ఏర్పడిన భావాలను సంత్ తులసీదాసు అతి రమణీయంగా వర్ణిస్తాడు.

**సహజ్ బిరాగ్ రూప్ మను మోరా**
**థాకిత్ హోత్ జిమి చంద్ చకోరా**
**ఇన్హహి బిలోకత్ అతి అనురాగా**
**బర్ బస్ బ్రహ్మ సుఖహి మను త్యాగా**
**కహ్ ముని బిహసి కహేహు నృప్ నీకా**
**బర్చ్ తుమ్హార న హోఇ అలీకా ॥**

"మహర్షీ విశ్వామిత్రా! సహజంగా నా మనసు వైరాగ్యమును పొంది ఉంటుంది. అది చలించదు. అట్టి నా మనసు రాముని చూడగనే చంద్రుని చూచిన చకోరమువలె భ్రమించింది.

"మునిపుంగవా! అతనిని చూచేకొలది నాకు అతనియందు అనురాగము ఏర్పడుతూ ఉంది. బ్రహ్మధ్యానమును మరచి నా చిత్తము అతనియందు లగ్నమై ఉంది;" అంటాడు జనకుడు.

ఆ మాటల నాలకించిన విశ్వామిత్రుడు జనకునితో, "ఓ రాజా! చక్కగా పలికావు. నీ మాటలు అసత్యం కావు," అంటాడు.

ఇక్కడ జనకుని మనోభిప్రాయాన్ని, అనుభవాన్ని సుస్పష్టం చేశాడు తులసీదాసు. జనకుడు పరమ వైరాగ్యపురుషుడు. అతని మనస్సు పరమాత్మ కన్నా అన్యమైన విషయము నందు రమించదు. అట్టి జనకుని మనసును రాముడు అమాంతం ఆకర్షించాడు. ఇది అలౌకికమైన ఆకర్షణయేగాని ప్రాపంచికమైన ఆకర్షణకాదు.

సైగా రాముని చూచే కొలది తనలో అనురాగం వృద్ధిచెందుతూఉంది అంటాడు జనకుడు. ఇది పరమాత్మ లక్షణం. భగవదనుభూతి **"ప్రతిక్షణ వర్ధమానం, అనుభవరూపం"** క్షణక్షణానికి వృద్ధి చెందుతూ ఉంటుందని, అది అనుభవ రూపమైనదని నారదమహర్షి భక్తి సూత్రాలలో కూడా తెలుపుతాడు.

పరమాత్మ ధ్యానమును కూడా మరిపిస్తూ ఉంది రాముని దర్శనము అంటాడు జనకుడు. ప్రపంచాన్ని మరపింపజేసే శక్తి పరమాత్మ కుంది. పరమాత్మను మరిపించేశక్తి ప్రపంచానికెలా ప్రాప్తిస్తుంది? పరమాత్మను మరిపించడం పరమాత్మకే సాధ్యం. సముద్రాన్ని సముద్రముతోనే పోల్చాలి. కనుక ఇంతవరకు తాను ధ్యానించిన పరమాత్మనే ఇప్పుడు ఎదురుగ జనకుడు దర్శిస్తున్నాడు.

ఇది సత్యమేనని విశ్వామిత్రుడు నిర్ధారణ చేస్తున్నాడు. రాముడే పరమాత్మ అని విశ్వామిత్రుడు నిర్ణయిస్తున్నాడు. పరమాత్మనుచూచి ఎవరు ఆకర్షింపబడరు?

**యే ప్రియ సబ్ హి జహాఁ లగి ప్రానీ**
**మర్మ మునుకాహిఁ రాము సుని బానీ ॥**

"రాజా! ఈ బాలురను ప్రేమించని సజీవప్రాణి ఈ ప్రపంచంలో ఒకటి కూడా ఉండదు" అంటాడు విశ్వామిత్రుడు.

అందరూ అభిలషించేది, ప్రేమించేది పరమాత్మనే గనుక రాముడు పరమాత్మయేనని విశ్వామిత్రుడు ధృవీకరిస్తాడు.

**యాంచె దేఖిలియా దర్శ డోలియాంస నావడే ఆర్**
**యాంచ్యా స్వరూపీ జడలేమర్మ చిత్త్ చింతన విసరూనీ ॥**

"వీరిని దర్శించిన నేత్రాలు మరోదానిని చూచుటకు ఇచ్ఛగించుటలేదు. వీరి స్వరూపం హృదయానికి హత్తుకుంది. చిత్తవృత్తులు ఆగిపోయాయి" అని ఏక్‌నాథ్ మహరాజ్ మరాఠీలో రచించిన భావార్థ రామాయణంలో జనకుడు అంటాడు.

జనకుడు సమ్మోహింప బడినట్లే, జనకపురిలో జనులు, జనకుని కుమార్తె జానకి కూడా సమ్మోహింప బడ్డారని రాముని అలౌకిక రూపమును రమణీయంగా వర్ణిస్తాడు రామచరితమానస కర్త. అది కూడా వివరిస్తాను. ఆనందించండి.

## జనకపురిలో జనాభిప్రాయం

సాయంకాల సమయాన జనకపురిని చూడాలని లక్ష్మణునికి కోరిక కలిగింది. లక్ష్మణుడు తన కోర్కెను రామునికి తెలుపుతాడు. లక్ష్మణుని అభీష్టమును రాముడు గురువుకు తెలిపి అనుమతిని కోరుతాడు.

**జా ఇ దేఖి ఆవహు నగర్ సుఖనిధాన దోఉ భాఇ**
**కరహు సుఫల సబకే నయన సుందర బదన దిఖాఇ**

"సర్వసుఖములకు నిలయమైన మీరిద్దరు నగరమును చూచిరండి. మీ సుందర ముఖకమలములను నగరవాసులకు చూపి, వారి నేత్రములను సఫలం చేయండి" అంటాడు విశ్వామిత్రమహర్షి.

ఈ దోహాలో మహర్షి చాలా భావగర్భితంగా పలికాడు. "జాఇ" శబ్దము వెళ్ళడము కాగా, "ఆవహు" శబ్దము తిరిగి రావడమును సూచించడం జరిగింది.

'జాఇ' వియోగాన్ని సూచించగా, 'ఆవహు' సంయోగాన్ని సూచిస్తున్నది.



మీరు వెళ్ళడం వలన నాకు దుఃఖము కలుగుతూ ఉంది. తొందరగా వచ్చి సుఖాన్ని కల్పించండి అని ఒకభావము.

"సుఖనిధాన దోఉ" మీరిరువురు సుఖములకు నిలయమైన వారు కనుక తిరిగివచ్చి నాకు సుఖాన్ని కలిగించండి అని అర్థం. మరోవిధంగా చూస్తే, "సుఖనిధాన్" మీ సుఖములకు నిలయములై సీతా ఊర్మిళలు నగరములో ఉన్నారు. చూచిరండి అని భావము. అలాగే, శివధనుస్సును విరిచి ఈ నగరమునకు సుఖమును కల్గించండి అని కూడా భావము.

"మీ సుందర ముఖకమలములను నగరవాసులకు చూపి, వారి నేత్రములను సఫలం చేయండి" అంటాడు చివరగా మహర్షి.

ఇచ్చట రెండు భావాలున్నాయి.

1. మీ దివ్య ముఖపద్మమును గాంచి నేను సంతృప్తి చెందాను. మీ దర్శనం కొరకు ఎందరో భక్తులు నిరీక్షిస్తున్నారు. మీ దర్శనప్రాప్తిని వారికి కల్పించి, వారి నేత్రములను సఫలం చేయండి అని అర్థము.

2. శివధనుస్సును ఎక్కుపెట్టుటకు ఎందరెందరో రాజులు వచ్చారు. అశక్తులై తిరిగి వెళ్ళారు. ఈ నగరవాసుల నేత్రాలు వారిని చూసి తృప్తి చెందలేదు.

మీరు శివధనుస్సును ఎక్కుపెట్టి, మీ ముఖారవిందములను వారికి చూపి, వారి దృష్టిని సఫలం చేయండి అని కూడా భావము.

**"దోఉభాఇ - జాఇ దేఖి ఆవహు..................."**

"మీరిద్దరు వెళ్ళి చూచిరండి".......“నాయనలారా! ఇప్పటివరకు అరణ్యంలో ముగ్గురము సంచరించాము. రేపు శివధనుర్భంగము జరుగుతుంది. సీతారాముల కళ్యాణం జరుగుతుంది.

"ఆ తరువాత నేను తపస్సుకై హిమవత్పర్వతానికి వెళ్తాను. మీరు అయోధ్యనుండి అరణ్యవాసము వెళ్ళవలసి ఉంది. నేను ఉండను. మీరిద్దరే వెళ్ళి రండి. అక్కడ మీ దర్శనానికై నిరీక్షిస్తున్న మునులకు దర్శన భాగ్యం కల్పించి వారి నేత్రాలను సఫలం చేయండి" అనే భావంకూడా ఇమిడిఉంది.

మంచి మనసుకు మహర్షుల మాటలు చక్కని పూలబాటలు. నడిచే కొద్ది నాణ్యత. రమించే కొద్ది రమ్యత.

గురువుగారి ఆజ్ఞను తీసికొని రామలక్ష్మణులు జనకపురిని వీక్షిస్తూ నగర వీధులలోకి వచ్చారు. వారిని చూడగనే కూర్చుని యున్నవారు అనాలోచితంగా లేచి నిలుచున్నారు. కొందరు అసంకల్పితంగా వారి వెంట వారినే చూస్తూ నడుస్తున్నారు.

ఇనుపముక్కను అయస్కాంతము ఆకర్షించునట్లు చూచేవారి చిత్తములను రామ లక్ష్మణులు హరిస్తున్నారు. గృహకృత్యాలలో నిమగ్నమై యున్నవారు ఆయాపనులను విడచిపెట్టి వారిని దర్శించుటకు వీధులలోకి పరుగెత్తుచున్నారు.

"నీకు నేను ఏం చెబుతున్నాను. ఆ ఇరువురిని చూడగనే నాకు ఏమి జ్ఞాపకం రావడం లేదు. ఇంతకీ వారెవరు?" అంటున్నాడు అంతవరకు జోరుగా విషయాలు ముచ్చటిస్తున్న పెద్దమనిషి.

"ఏమే! చెలీ! రాముడు అతడేనట. ఎంత సుందరుడే! కోటి మన్మథులైనా అతనితో సాటిరారే!" అంటుంది ఒక భామిని.

"చక్కగా చెప్పావే! అయినా నీ పిచ్చిగాని ఎంత చక్కనివాడు! చూడుచూడు. ఇతడు చక్కదనానికే చక్కదనం కల్పిస్తాడే! అందానికే అందాన్ని పులుముతాడే!" అంది ఇంకొక లలన.

"బాగు బాగు.... దేవతలు సౌందర్య పురుషులు అంటారు. వీరిద్దరి సౌందర్యం దేవతల కుంటుందంటావా? ఏమో! నామటుకునాకు సందేహమే."

"విష్ణువుని చూడండి. ఆయనకి నాలుగు భుజాలు. బ్రహ్మను చూశారా! నాలుగు ముఖాలు. ఇక శివుడంటారా? పంచముఖాలు-మెడలో పాములు. రాముడంత రమణీయంగా ఎవ్వరూ ఉండరు," అన్నది మరొక యువతి.

"వారు దశరథమహారాజు పుత్రులు. మా రాజు దశరథుడు చాలా గొప్పవాడు" అన్నది వేరొక స్త్రీ.

ఆ మాటలు వినగానే స్త్రీలందరు ఆమెను చుట్టుముట్టి, "అదేమిటి? మనరాజు జనకుడాయె! దశరథుడంటావేమిటి?" అని ప్రశ్నించారు.

"అవును మా పుట్టిల్లు అయోధ్య. ఇది మావారి ఊరు. దశరథుని, రామలక్ష్మణులను నేనెరుగుదును. ఈ ఇద్దరు సోదరులు జోడు కలహంసలు" అన్నది.

"సఖీ! ఇతడు మన సీతమ్మకు తగినవరుడు కదూ?" "ఓసి! అదేమిటే....తగిన, దిగ్గిన అంటూ చప్పగా చెబుతున్నావు! తగినవాడే కాదు మెడలో తాళి కట్టతగినవాడు".

"అయినా మన రాజుగారికి ఒక చాదస్త ముందే నేస్తమా! శివధనుస్సును ఎక్కుపెడితేగాని సీతమ్మను ఇవ్వడు. శివుని విల్లు చూస్తే కఠినము. వీరి హస్తములు కుసుమకోమలంగా ఉన్నాయి. ఎలాగబ్బా!"

"చాల్లే! కాస్త డాబు చాలించు. వారు బాలురైనా గొప్ప పరాక్రమవంతులు. మా రాముని పాదధూళితో శాపగ్రస్తురాలైన మునిపత్ని శాపాంతాన్ని చూసి తరించింది. శివధనుస్సును చెరకుగడలాగా విరిచేస్తాడు మా రామన్న" అంది అయోధ్య ఆడపడచు.

నగరవాసులైన కొందరు పురుషులు "పరమేశ్వరుని కృపచే సీతారాములకు కళ్యాణమైతే, జనకపురి అమరావతి అవుతుంది. రాముడు మిథిలకు అల్లుడవుతాడు. అప్పుడప్పుడు అత్తగారింటికి వస్తూ ఉంటాడు. తరచుగ రాముని దర్శించే భాగ్యం మనకు కల్గుతుంది. మనం కృతకృత్యులవుతాము" అంటున్నారు.

రామలక్ష్మణులు దారిలో నడుస్తుండగా, కొందరు స్త్రీలు దోసిళ్ళతో పూలు తెచ్చి దారిలో పోస్తారు. కుసుమకోమలమైన రాముని చరణములు కటికనేలను సహించలేవట. అందుకే పూలు పరుస్తున్నారట.

మరికొందరేమో అలా పూలుచల్లితే, రాముడు తల పైకిఎత్తి మావంక చూస్తాడేమో అని పుష్పాలు చల్లుతున్నారు.



రామలక్ష్మణులు ఏచోటుకి చేరుతుంటే ఆయా ప్రాంతము వారు దివ్యానందమును అనుభవిస్తున్నారు.

జనకపురిలో పరమానందయోగి అనే పరమహంస ఉండేవాడు. ఆయన అవధూత. ఎవరితో మాట్లాడకుండా ఒక చెట్టుక్రింద పడుకొని ఉండేవాడు. రాముని చూడగనే ఆయనకూడా లేచి రాముని అనుసరించాడు. అది రామదర్శన వైభవం.

**ధాయే ధామ్ కామ్ సబ్ త్యాగీ**

**మనహు రంక నిధి లూటన్ లాగీ ॥**

నవనిధులను జూచి దరిద్రుడు పరుగెత్తినట్లు, పనిపాటలను వదలి జనకపురి వాసులు రాముని వెంట పరుగెత్తుచున్నారు అంటాడు సంత్ తులసీదాస్.

ఈలోగా ఆడుకుంటున్న పసిబాలురు రామలక్ష్మణులను చూశారు. బంతిని విసిరేసి, తంతిని పడేసి అమాంతం పరిగెత్తుకుంటూ వచ్చి రామలక్ష్మణులను పట్టుకున్నారు. కొందరు బాలురు వాటేసుకున్నారు. "ఇది చూడండి- అది చూడండి" అంటూ ఆ చిన్నారి బాలురు రామలక్ష్మణులను కొట్టికొట్టి మరీ చెబుతున్నారు. అలా రామలక్ష్మణుల శరీరములను స్పృశించినందువల్ల ఆ బిడ్డల శరీరాలు పులకరించాయి.

"మీరు మా ఇంటికి వస్తారా? మా ఇంట్లో మంచి వెన్న, కండ శర్కర ఉంది" అంటారు పిల్లలు.

తియ్యని వారి మాటలను ఆరగిస్తూ రాముడు నడుస్తున్నాడు. మధ్యమధ్యలో ఆ బాలురను కుశల ప్రశ్నలువేసి రాముడు సంతోషపరుస్తున్నాడు. వేదమయుడైన రాముడు వచ్చీరాని పిల్లల పలుకులతో తృప్తి చెందుతున్నాడు. అదియే రాముని గొప్పతనము. **"True greatness is being great in little things"** చిన్నవారియందుగూడ పెద్దబుద్ధిని కలిగియుండువారే పెద్దవారు. వారే గొప్పవారు" అంటాడు జాన్సన్.

ఇప్పటికే చాలా ఆలస్యమైంది. గురువుకు కోపం వస్తుందేమో అని భయపడతాడు రాముడు. ఎవని భయానికి భయము కూడా భయపడుతుందో అట్టి రాముడు భక్తికి భయపడతాడు. భక్తి ప్రభావము అలాంటిది అంటాడు తులసీదాసు.

**జాసు త్రాన దరు కహుఀ డర్ హోఈ**

**భజన ప్రభాఉ దేఖావత్ సోఈ......**

భయము భగవంతుని చూచి భయపడుతుంటే భక్తికి భగవంతుడు భయపడతాడు.

రాముడు వెనుదిరిగాడు. వెళ్ళవద్దని రాముని చేయి పట్టుకొని బాలురు మారాం చేస్తున్నారు. రాముడు ప్రేమ పలుకులతో బిడ్డల్ని సముదాయించి ఇళ్ళకు పంపాడు. పిల్లలు నిరాశగా మూలుగుతూ వెళ్లారు.

ఆడుకునే పిల్లలు మొదలుకొని ఆటలణగిన పరమానందయోగి వరకు అందరికీ రాముడు కావాలి. కాని అందరూ రామునికి సమానులే.

రామలక్ష్మణులు తిరిగి వచ్చి గురుదేవుల పాదాలకు నమస్కరించి విశ్రమించారు.

ఆత్మబంధువులారా! ఇక మనం ప్రధాన స్రవంతిలో కలుస్తాం. వాల్మీకం వైపు నడుస్తాం.

## శివధనుర్భంగం

తెల్లవారింది. ఆహ్నికములు పూర్తిచేసికొని రామలక్ష్మణులతో గూడి విశ్వామిత్రుడు జనకుని సమీపించాడు. జనకుడు విశ్వామిత్రుని పూజించాడు.

"పూజ్యుడా! నీకు స్వాగతము. అనఘా! నేను మీ భృత్యుడను. మీ ఆజ్ఞను పాలించుటకు సిద్ధంగా ఉన్నాను. ఆజ్ఞాపించండి" అన్నాడు విశ్వామిత్రునితో జనకుడు.

"జనకా! నీ వద్దనున్న శివధనుస్సును చూడాలని రామలక్ష్మణులు అభిలషించుచున్నారు. ఆ ధనుస్సును వారికి చూపు. కోరిక తీరినవారై రామలక్ష్మణులు సంతోషంతో తిరిగి వెళ్తారు" అన్నాడు విశ్వామిత్రుడు.

"మునిపుంగవా! అలాగే ధనుస్సును వారికి చూపుతాను. అంతేకాదు. ఈ ధనుస్సును రాముడు ఎక్కుపెట్ట గలిగితే సీతను రాముడికిస్తాను" అని పలికి, ఆ ధనుస్సును తీసుకొనిరమ్మని జనకుడు సామంతులను ఆజ్ఞాపించాడు.

బలిష్ఠులైన ఐదువేలమంది పురుషులు ధనుస్సు ఉంచిన ఇనుపపెట్టెను లాక్కొని వచ్చారు.

"మహర్షీ! చూడండి. మా జనకవంశీయులగు రాజులందరు పూజించిన శివధనుస్సు ఇదే. ఇంతవరకు ప్రయత్నించి ఎక్కుపెట్టలేకపోయిన రాజులందరు పూజించిన శివునివిల్లు ఇదే.

"సురులు, అసురులు, గంధర్వులు, యక్షులు, కిన్నెరాదులు దీనిని ఎక్కుపెట్టలేక పోయారు. దీనిని వంచి, నారికట్టి, బాణమునుసంధించే శక్తి ఎవరికుంది? అట్టి మహోన్నతమైన ఈ ధనుస్సును రాజకుమారులకు చూపండి" అన్నాడు జనకుడు.

శివధనుస్సును జనకవంశీయులకు దేవతలు ప్రసాదించారు. సంతానం లేని జనకునికి భగవంతుడే నాగేటిచాలు నుండి అయోనిజయైన సీతను అనుగ్రహించాడు. పరమాత్మ ప్రసాదించిన దానిని పరమాత్మకే సమర్పించాలి అని జనకుని మనోభిప్రాయము. అందుచేత శివధనుస్సును ఎక్కుపెట్టిన వానికే సీతను అప్పగిస్తాడు.

"రామా! ఆ ధనుస్సును చూడు." **(వత్స రామ ధనుః పశ్య)** అని విశ్వామిత్రుడు పలికాడు.

"పశ్య"- చూడు అని విశ్వామిత్రుడు చెప్పుటలోని విశేషమును రాముడు గ్రహించాడు. చూడు అంటే బొమ్మను చూచినట్లు చూడమని కాదు. పట్టి చూడమని అర్థం. దాని పట్టెంతో చూడమని భావము.





రాముడు ధనుస్సు వున్న ఇనుప పెట్టెను తెరిచాడు. ధనుస్సును చూచాడు. "మహర్షీ! ఈ ధనుస్సును ముట్టుకుంటాను. వీలైతే ఎక్కుపెట్టుటకు ప్రయత్నిస్తాను" అని వినమ్రుడై రాముడు పలికాడు.

రాముడు ధనుర్భంగము గావించగలడు. కానీ గురువు ఆజ్ఞలేనిదే ముట్టడంలేదు. వీలయితే ఎక్కుపెడతానంటూ పెద్దల యెదుట వినమ్రతను ప్రదర్శిస్తున్నాడు.

"అలాగే చేయి" అని విశ్వామిత్రుడు, జనకుడు ఒకేసారి పలికారు.

రామునిది అభ్యర్థన. జనకునిది ప్రార్థన. విశ్వామిత్రునిది దీవెన.

ఆజ్ఞకొరకు రాముడున్నాడు. ఆకాంక్షతో జనకుడున్నాడు. ఆశీర్వదిస్తూ విశ్వామిత్రుడున్నాడు. రాముడు చేతులుజోడించి శివధనుస్సుకు భక్తితో ప్రదక్షిణము చేస్తున్నాడు. అందరి దృష్టి రామునిపై బడింది అంటాడు సంత్ తులసీదాసు.

"వీర్యవంతులైన ఎందరో రాజులు ఈ ధనుస్సును ఎక్కపెట్టలేక పోయారు. ఈ బాలుడు ఎక్కుపెట్టగలడా?" అని కొందరు గుసగుస లాడుతున్నారు.

"హే భగవాన్! ఇతడు మా సీతమ్మకు భర్తకావాలి. జనకపురికి అల్లుడు కావాలి. రాముడు శివధనుస్సును విరుచునట్లు నీవే కరుణించాలి" అని కొందరు జనకపురీయులు మనసులో భగవంతుని ప్రార్థిస్తున్నారు.

సీత మాతృదేవి సునయనాదేవి చెలికత్తెలతో కలత చెందుతూ మాట్లాడ సాగింది. "బాణాసుర, రావణాసురాది వీరులు ఎత్తలేని ఈధనుస్సును బాలుడైన రాముడు ఎక్కుపెట్టగలడా? జనకమహారాజుకి సలహా ఇచ్చే వారెవరు లేకున్నారు. ఏదైనా జరిగితే దశరథుని కేమిచెప్పగలం?" అంటూ ఆందోళన చెందసాగింది. చెలికత్తె సునయనాదేవిని శాంతపరచింది.

"తల్లీ! తేజోవంతులకు వయస్సుతో నిమిత్తం లేదు. చిన్నదిగాతెలిసే సూర్యమండలము లోకములోని అంధకారమును అదృశ్యం చేయడం లేదా? అంత పెద్ద సముద్రాన్ని అగస్త్యుడు పానము చేయలేదా?

**మంత్ర పరమ లఘు జాను బస్ బిధి హరిహర సుర సర్బ్**
**మహామత్త గజరాజ కహుఁ బస్ కర్ అంకుస ఖర్బ్ ॥**

"మంత్రము చిన్నదైనను దానికి త్రిమూర్తులు స్వాధీన మవుతారుకదా! గొప్ప మదపుటేనుగును అంకుశము వశపరచుకొనుట లేదా?

"అమ్మా! సందేహమును విడిచిపెట్టు. రాముడు తప్పక ధనుస్సును ఎక్కుపెడతాడు" అని చెలికత్తె సునయనాదేవితో చెబుతుంది.

జానకి శివపార్వతులను ప్రార్థిస్తూ ఉంది. శివధనుస్సుయొక్క బరువును తగ్గించమని వేడుకొంటూ ఉంది. విఘ్నము కల్పించవద్దని గణపతికి నమస్కరిస్తూ ఉంది. "ఓ శివధనుస్సా! రాముని కరుణించు" అని ధనుస్సుకు కూడా నమస్కరిస్తూ ఉంది. ఆమెకు క్షణమొక యుగంగా ఉంది.

గరుత్మంతుడు సర్పమును చూచినట్లు రాముడు ధనుస్సును చూశాడు.

అందరికళ్ళు విస్మయంతో, సందేహంతో, ఆందోళనతో రామునే చూస్తున్నాయి. అందరూ ఉత్కంఠతో చూస్తున్నారు.

విశ్వామిత్రుని ప్రక్కన కూర్చునియున్న లక్ష్మణుడు చివాలున లేచి పాదముతో భూమిని త్రొక్కిపట్టాడు.

"లక్ష్మణా! ఏమిటయ్యా నీ హడావుడి! ధనుస్సును ఎక్కుపెట్టేది రాముడు. నీవిక్కడ లేచి విన్యాసాలు చేస్తున్నా వేమిటి?" అన్నాడు విశ్వామిత్రుడు. లక్ష్మణుడు కూర్చున్నాడు.

ధనుస్సు పొడవుగా ఇనుప బద్దవలె ఉంటుంది. దానికి ఒక చివరన అల్లెత్రాడు ఉంటుంది. పొడవుగా ఇనుపబద్దవలె ఉండే ధనుస్సును ముందు నిలబెట్టాలి. ఒక చివర భాగము నేలపై ఉంటుంది. ఇప్పుడు ధనుస్సును వంచి అల్లెత్రాడును రెండవ చివరకు చేర్చి దానికి అమర్చాలి. ఈ విధంగా కట్టుటను ఎక్కుపెట్టుట అంటారు.

అందరూ ఉత్కంఠతో చూస్తూ వుండగా రాముడు ధనుస్సు నెత్తాడు. ధరించాడు. ఎక్కుపెట్టాడు. అంతే. ధనుస్సు త్రుటికాలంలో విరిగిపోయింది.

ఆశబ్దము పిడుగుపాటువలె భూనభోంతరాళములు నిండిపోయింది. భూమి కంపించి నట్లైంది. పర్వతాలు బ్రద్దలైనట్లు వినిపించింది. జనక, విశ్వామిత్ర, రామలక్ష్మణులు తప్ప మిగిలిన వారంతా స్పృహతప్పి పడిపోయారు.

ధనుర్భంగముతో పాటు రాముడు మరికొన్నిటిని కూడా భంగంచేశాడు.

1. "బాలుడైన రాముడు ధనుస్సును ఎక్కుపెట్టగలడా?" అని జనుల మనసులలో వున్న సందేహమును భంగం చేయుట. ఇది **సంశయ భంగము.**

2. "సీతారాముల వివాహము జరుగుతుందో లేదో?" అని వ్యధ చెందే జానకీ చెలికత్తెల బాధను భంగం చేయుట. ఇది **ఆవేదనా భంగము.**

3. క్షణాన్ని ఒక యుగంగా భావిస్తూ పరితపిస్తున్న జానకి యొక్క దుఃఖమును భంగం చేయుట. ఇది **వియోగ భంగము.**

4. నాబిడ్డకు ఎప్పుడు తగిన వరుడు లభిస్తాడో? వివాహము ఎప్పుడు జరుగుతుందో నని సదా ఆలోచించే జనకుని యొక్క ఊహలను భంగం చేయుట. ఇది **సంకల్ప భంగము.**



5. ఏంజరుగుతుందోనని క్షణక్షణము ఉత్కంఠతో చూస్తున్న లక్ష్మణుని యొక్క ఉత్సుకతను భంగంచేయుట. ఇది **నిరీక్షణా భంగము.**

6. దంభముతో విఱ్ఱవీగే రాజుల యొక్క గర్వమును భంగము చేయుట. ఇది **అహంకార భంగము.**

ఈ విధంగా ధనుర్భంగముతో పాటు మరెన్నో భంగమైనాయి.

మూర్ఛిల్లిన జనకపురీయులు నిద్రనుండి లేచినట్లు లేచారు. ఈనాటికి జనకుని పుణ్యం ఫలించిందని కొందరు భావించారు. రాముని మిథిలా నగరానికి తీసుకొని వచ్చిన విశ్వామిత్రునికి అందరూ మనసులలో కృతజ్ఞతలు చెప్పుకున్నారు.

"మహర్షీ! రామునిశక్తిని ఈనాడు నేను ప్రత్యక్షంగా చూశాను. అత్యద్భుతం. అనూహ్యం. ఇలా జరుగుతుందని నేను కలలో కూడా ఊహించలేదు.

"విశ్వామిత్ర మహామునీ! ధనుస్సును ఎక్కుపెట్టినవానికే నా పుత్రికను ఇస్తానని నేను చేసిన ప్రతిజ్ఞ ఈరోజు సత్యమైంది. నా ప్రాణతుల్యమైన సీతను రాముడికిస్తాను. రాముని భర్తగా పొంది సీత మా వంశానికే వన్నె తెస్తుంది," అంటూ స్వాతివర్షానికి తృప్తి చెందిన చాతకమువలె గోచరించాడు జనకుడు.

"జనకా! చాలా ముదావహం. ఈ విషయమును అయోధ్యలో దశరథునికి తెలుపు" అన్నాడు విశ్వామిత్రుడు.

"కౌశికా! నీకు శుభం కలుగుగాక! నా మంత్రులు వెంటనే రథములెక్కి అయోధ్యకి వెళ్తారు. విషయాలన్నీ చెప్పి, దశరథ మహారాజుని విదేహ నగరానికి తీసికొని వస్తారు," అని పట్టరాని ఆనందంతో పలికి సముచిత రీతిన మంత్రులకు ఆజ్ఞ లిచ్చాడు జనకుడు.

ఇక్కడ నాటికీ, నేటికి వరాన్వేషణలో ఉండే తారతమ్యాన్ని గుర్తించాలి. వరుని శౌర్యాన్ని చూచి ఆరోజు పిల్లనిచ్చేవారు.

రాముడు చక్కనివాడు. చిక్కని సంపద కలవాడు. పైగా రాజకుమారుడు. అయినా అతని శౌర్యాన్ని పరీక్షించిగాని సీతను ఇవ్వలేదు జనకుడు.

వరుని విషయంలో ఈనాడు డబ్బు, మేడలు, పదవులు ఇవే ప్రధాన లక్షణాలుగా ఉన్నాయి. అందుచేతనే ఊహించిన ఫలితాలు రాక విలపించవలసి వస్తూవుంది. తాత ఆస్తితో గాక తనశక్తితో బ్రతికేవాడే ఆలిని పోషించుకోగలడు. మగువ ఏమి తెస్తుందా? అని ఎదురుచూచేవాడు మగవాడవుతాడా? మామ ఆస్తిపై మక్కువ గలవాడు మగువను సుఖపెట్టలేడు.

## వివాహ సన్నాహాలు

జనకుడు పంపిన దూతలు అయోధ్యకు చేరారు. రాజాజ్ఞను పొంది రాజభవనంలో ప్రవేశించారు. జనకుని సందేశమును దశరథునికి చదివి వినిపించారు.

**దశరథ మహారాజా!**

మీ యొక్క, మీ గురువుల, పురోహితుల యొక్క, బంధుమిత్ర పరివారము యొక్క యోగక్షేమములను స్నేహపూర్ణమైన మనస్సుతో కాంక్షిస్తున్నాను.

నా పుత్రిక **చి॥సౌ॥ జానకి** వీర్యశుల్కయని నేను ప్రకటించిన విషయం మీకు విదితమే.

ఎందరో రాజులు ప్రయత్నించి విఫలులయ్యారు. దైవకృపచే విశ్వామిత్రుని వెంట మిథిలకు వచ్చిన నీ కుమారుడు రాముడు నా కుమార్తెను సంపాదించుకున్నాడు. మీ అనుజ్ఞను ఆశిస్తున్నాను.

మీరు ఉపాధ్యాయ, పురోహిత, బంధుమిత్ర సపరివార సమేతంగా విచ్చేసి నేత్రానందముగా కళ్యాణమును జరిపింపుడు. మాకు మీ దర్శనానందమును కల్గింపుడు.

విశ్వామిత్రుని అనుజ్ఞతో, శతానందుని అనుమతితో ఈ మాటలు పలుకుచున్నాను.

మీ

జనక మహారాజు



దూత వాక్యములను ఆలకించి దశరథుడు ఎంతగానో సంతసించాడు. వసిష్ఠ వామదేవాదులతో చర్చించాడు. మంత్రుల, మహర్షుల అనుమతిని తీసుకున్నాడు. అందరూ ప్రయాణమునకు సిద్ధమయ్యారు.

మరునాడు బయలుదేరారు. ధనము, రత్నరాశులను తీసికొని కోశాధికారులు ముందువెళ్ళారు. గొప్ప రథాలు, పల్లకీలు, చతురంగ బలసైన్యము బయలుదేరింది. వసిష్ఠుడు, వామదేవుడు, కాశ్యపుడు, జాబాలి, మార్కండేయుడు, కాత్యాయనుడు ముందు వెళ్తున్నారు.

దశరథుడు రథారూఢుడైనాడు. చతురంగబలము అతనిని అనుసరించింది. నాల్గురోజులు ప్రయాణముచేసి విదేహరాజ్యము చేరారు.

దేహభ్రాంతి దూరమైన దివ్యస్థితియే విదేహస్థితి. విదేహలో సీతారాములకు కళ్యాణం జరుగుతుంది. జీవుడు పరమాత్మతో ఐక్యమగుటయే విదేహస్థితి. కనుకనే జీవుడైన సీత రాముడైన పరమాత్మతో విదేహలో ఐక్యమవుతుంది.

దశరథుడు నాలుగు రోజులు ప్రయాణం చేసి విదేహరాజ్యం చేరాడు. దశరథుడు అంటే దశేంద్రియములను జయించినవాడని అర్థము.

సాధకుడు దశేంద్రియములను జయించి, కర్మ, భక్తి, యోగ, జ్ఞానములు అనెడి నాలుగు మార్గాలలో పయనించి, పరమాత్మను విదేహస్థితిలో దర్శించాలి. దశరథుడు నాలుగు రోజులు ప్రయాణం చేయుటలోని అంతర్భావ మిదియే.

జనకుడు దశరథునికి స్వాగతం పలికాడు. పరస్పరం ఆలింగనం చేసికొని సంతోషించారు.

"దశరథమహారాజా! మా ఆతిథ్యమును స్వీకరించి, నేటికి విశ్రాంతి తీసుకోండి. రేపు ఉదయాన యజ్ఞము సమాప్త మవుతుంది. ఆ తరువాత ఋషుల అభిమతమునకు అనుకూలముగా వివాహమును జరిపించండి" అన్నాడు జనకమహారాజు.

"జనకమహారాజా! ధర్మజ్ఞా! ప్రతిగ్రహ మనేది దాతకు సంబంధించింది. దాత ఇచ్చినప్పుడే గదా ప్రతిగృహీత గ్రహించేది. విషయమంతా నేను విని యున్నాను.

**యథా వక్ష్యసి ధర్మజ్ఞ తత్కరిష్యామహే వయమ్**

"నీవు ఎలా చెబితే అలా చేస్తాము" అన్నాడు దశరథుడు.

దశరథుని మాటలు జనకుని ఆనందంలో ముంచెత్తాయి. మహర్షులందరు పరస్పరము కలిసికొని చాలా ఆనందించారు.

యజ్ఞ సమాప్తికి సంబంధించిన విషయములను, వివాహమునకు సంబంధించిన ఏర్పాట్లను గురించి తనవారికి సముచిత ఆజ్ఞలిచ్చాడు. సాంకాశ్య నగరానికి దూతల ద్వారా కబురంపి తన తమ్ముడైన కుశధ్వజుని పిలిపించాడు.

మరునాడు ఉదయం పుత్ర, పురోహిత, బంధు మిత్రాదులతో కలిసి దశరథుడు జనకుని కలిశాడు. ప్రసంగ వశాన దశరథుని కులగురువైన వసిష్ఠుడు దశరథుని వంశవృక్షమును జనకునికి వినిపించాడు.

దశరథుని వంశము బ్రహ్మదేవుని నుండి ఆవిర్భవించినది. బ్రహ్మకుమారుడు మరీచి మొదలు మధ్యలో త్రిశంకుడు, త్రిశంకుని మనుమడు మాంధాత, తరువాత అనేకమంది రాజులు, ఆ తరువాత సగరుడు, అసమంజుడు, అంశుమంతుడు, దిలీపుడు, భగీరథుడు, ఆ పిమ్మట చాలామంది రాజులు, చివరగా నాభాగుని కుమారుడుగా పుట్టిన అజునకు దశరథుడు పుత్రుడుగా జన్మించినాడు. ఆ దశరథుని పుత్రులే రామలక్ష్మణులు అని నలభైమంది రాజులుగల వంశవృక్షమును వివరించాడు.

వసిష్ఠుని మాటలు విని తృప్తి చెందిన జనకుడు కన్యాదానము చేయు తాను తన వంశచరిత్రను చెప్పవలసిన ధర్మమును గుర్తించి చెప్పసాగాడు.

నిమిచక్రవర్తినుండి ఆవిర్భవించిన జనకవంశము అనేకమంది రాజులతో పోషింపబడి, మధ్యలో సుకేతువు, తరువాత కొందరు రాజులు, వారి తరువాత కీర్తిరథ మహారాజు, ఆ పిమ్మట కొందరు రాజులు, చివరగా హ్రస్వరోముడు. ఆయనకు ఇద్దరు కుమారులు. పెద్దవాడు జనకుడు, రెండవవాడు కుశధ్వజుడు అని ఇరవైరెండు మంది రాజులు గల తన వంశవృక్షమును జనకుడు వివరించాడు.

"వసిష్ఠ మహర్షీ! వీర్యశుల్క, దేవకన్యతో సమానమైన నాకుమార్తెను రామునకు, రెండవ కుమార్తె ఊర్మిళను లక్ష్మణునకు ఇచ్చెదనని సందేహము లేకుండా మూడుసార్లు చెప్పుచున్నాను" అని జనకుడు పలికాడు.

జనకుని వచనములను ఆలకించిన వసిష్ఠుడు, "జనక మహారాజా! ఇక్ష్వాకు, విదేహ వంశములు కీర్తి ప్రదమైనవి. అసమానమైనవి. సీతా ఊర్మిళలను రామలక్ష్మణులకు ఇచ్చుట మాకెంతో సంతోషమును కల్గించినది.

"రాజా! మామాట నొకదానిని వినుము. నీ తమ్ముడు కుశధ్వజుడు ధర్మజ్ఞుడు. ఆతని ఇరువురు కుమార్తెలను దశరథపుత్రులైన భరతశత్రుఘ్నులకు ఇవ్వవలసిందని కోరుచున్నాము.

"దశరథుని నలుగురు పుత్రులు దివ్యమైనవారు. లోకపాలకులతో సమానులు. ఈ మీరెండు వంశముల కలయిక లోకకళ్యాణమును ఆవిష్కరిస్తుంది" అన్నాడు వసిష్ఠుడు.

జనకుడు నమస్కరిస్తూ, "మహర్షీ! మీ ఆజ్ఞ మాకు శిరోధార్యము. మా సోదరులలో నేను పెద్దవాడను. కుశధ్వజుడు చిన్నవాడు. నా సోదరుడైన కుశధ్వజుని కుమార్తెలగు మాండవీ శ్రుతకీర్తులు దశరథుని కుమారులైన భరతశత్రుఘ్నులకు సతులై వారిని సేవిస్తారు. మహర్షీ! నలుగురు రాజకుమారులు నలుగురు రాజకుమార్తెలను ఒకేరోజు పరిణయ మాడుతారు," అన్నాడు.

కుశధ్వజుని కుమార్తెల వివాహమును గూర్చి జనకుడు వధువుల తండ్రితో ప్రస్తావించకనే, అనుమతి తీసికోకనే వసిష్ఠునికి మాట ఇచ్చేశాడు. తాను పెద్దవాడు కనుక నిర్ణయం తీసుకున్నాడు. పూర్వపు రోజులలో పెద్దలదే పైచేయి. అందుచేతనే అందరి జీవితాలు పెద్దవిగా ప్రకాశించేవి.

"జనకమహారాజా! మీరిరువురు సోదరులు ధర్మాత్ములు. ఎందరో ఋషులను సేవించి కృతపుణ్యపుంజులైనారు. నాకు చాలా ఆనందముగా యున్నది. మీకు శుభము కలుగు గాక!" అని దశరథుడు పలికాడు.



దశరథుడు నివాసమునకు వచ్చిన పిమ్మట నలుగురు కుమారుల నుద్దేశించి నాలుగు లక్షల గోవులను దానం చేశాడు. మనకు ఏమంచి జరిగినా ఆ సంతోష సమయాన సమాజంలోని కొందరినైనా తృప్తి పరచాలి అనేది పూర్వమునుండి ఆర్షసంస్కృతిని పెనవేసుకొని వస్తున్న ఆచారము.

## సీతారామ కళ్యాణం

మరునాడు మహర్షులు వెంటరాగా యజ్ఞశాలకు వెళ్ళాడు దశరథుడు. రాముడు విజయముహూర్తాన మంగళాచారములన్నీ పూర్తిచేసికొని చక్కగా అలంకరించిన తమ్ములు వెంటరాగా వెళ్ళి తండ్రి వద్దకు చేరాడు.

వసిష్ఠుడు జనకుని సమీపించి, "రాజా! దశరథుని కుమారులు కౌతుక మంగళము పూర్తి చేసుకొని కన్యాదాతవైన నీకొరకు నిరీక్షిస్తున్నారు. దాత, ప్రతిగృహీత కలిసి చేయవలసిన కార్యాలు ఎదురు చూస్తున్నాయి" అన్నాడు.

జనకుడు వసిష్ఠునితో, "మహాత్మా! కౌతుకమంగళములను పూర్తిచేసికొని, ప్రజ్వలించు చున్న అగ్ని జ్వాలలలాగా నాపుత్రికలు వేదిక వద్దకు చేరియున్నారు. నేను మీకొరకు ఎదురుచూస్తున్నాను. మీరంతా నాభవనములోనికి రాకుండా ఎవరి ఆజ్ఞకొరకు నిరీక్షిస్తున్నారు?

**కః స్థితః ప్రతిహారోమే కస్యాజ్ఞా సంప్రతీక్ష్యతే**
**స్వగృహే కో విచారోఽస్తి యథా రాజ్య మిదం తవ**

"నాద్వారము వద్ద నిరోధించుటకు ద్వారపాలకుడు ఎవడైనాఉన్నాడా? ఎవరి అనుమతి కొరకు నిరీక్షిస్తున్నారు? స్వగృహములో సంకోచము ఎందుకు? ఈ రాజ్యముకూడా మీ రాజ్యము వంటిదే" అన్నాడు జనకుడు. వివాహఘట్టము ప్రారంభమైనది.

జనకుని ప్రార్థనపై విశ్వామిత్ర శతానందులను వెంటబెట్టుకొని వసిష్ఠుడు మండపము వద్దకు అరుదెంచాడు. మండపము మధ్య అగ్నివేదికను నిర్మించాడు.

జనకమహారాజు సర్వమంగళ స్వరూపిణి అయిన సీతను తీసికొని వచ్చాడు. సర్వాభరణ భూషితయైన సీతను రామునికి ఎదుట కూర్చోబెట్టారు ముత్తయిదువలు.

సీతారాములను ఒకేచోట చూచేసరికి జనులకు నయనానందమైంది. జనకుని పుణ్యమంతా జానకిగా పుట్టగా, దశరథుని పుణ్యము శ్రీరాముడుగా పుట్టినట్లు జనులు ముచ్చటించుకుంటున్నారు.

"మనమెంత పుణ్యము చేసితిమో! లేకపోతే సీతారాముల కళ్యాణ వైభవమును తిలకించే భాగ్యము కలిగి యుండేదా?" అని మరికొందరు చెప్పు కుంటున్నారు. సర్వులు నేత్రోత్సవముగా ఆనందముతో తిలకిస్తున్నారు. సీతారాముల దివ్యమంగళ విగ్రహములను గాంచి పరమానందభరితు లవుతున్నారు.

జనకుడు ముందుకు వచ్చాడు.

అగ్ని సమక్షమున నిలబడి

**ఇయం సీతా మమసుతా సహధర్మ చరీ తవ**
**ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా॥**
**పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా**

"ఇదిగో నాపుత్రికయైన సీత. ఈమె నీకు సహధర్మచారిణి. ఈమెను స్వీకరించు. నీచేతితో ఈమె చేయిని పట్టుకో. మహాభాగ్యవంతురాలైన ఈమె పతివ్రతయై నిన్ను సదా నీడలాగ అనుసరిస్తుంది" అని పలికి మంత్రపూతమైన జలాన్ని రామునిచేతిలో విడిచాడు జనకుడు.

దేవతలు పుష్పములు వర్షించారు. దుందుభులను మ్రోగించారు. సురులు విమానారూఢులై ఆకాశమున నిలబడి దర్శించి ఆనందించారు.

మంగళవాద్యాలు మ్రోగుతుండగా, ద్విజుల ఆశీర్వచనాల ఘోష ఒకవైపు, వందిమాగధుల విజయ గీతాలు మరొకవైపు, పండితుల ప్రశంసా వాక్యాలు ఇంకొకవైపు కలిసి సర్వశుభకరంగా వీనులకు విందు చేకూరినట్లు సర్వులూ భావించారు.

**పవనజ స్తుతిపాత్ర పావన చరిత్ర**
**రవి సోమ వరనేత్ర రమణీయగాత్ర**
**సీతాకళ్యాణ వైభోగమే ॥**

అని సీతారామ కళ్యాణ వైభోగమును కీర్తించారు త్యాగయ్య.

పాణిగ్రహణోత్సవంలో జనకమహారాజు పలికిన పైశ్లోకములో నిగూఢమైన భావాలు శోభిస్తున్నాయి. అదొక అద్భుతమైన శ్లోకము. చాలాచోట్ల వివాహమహోత్సవంలో కన్యాదానం చేసేటప్పుడు కన్యాదాత ఈ శ్లోకాన్ని ఉచ్చరిస్తాడు.

జనకుడు "ఇయం" ఇదిగో అంటూ సీతను రాముడికి చూపిస్తున్నాడు. ఇదిగో (ఇయం) అనే ప్రయోగమును వాల్మీకి ఎందుకు చేయవలసి వచ్చిందో మనం గమనించాలి.

జానకి ముఖకమలమును రాముడు చూశాడు. దివ్యకాంతితో శోభించు సీతమ్మను చూడగనే రాముని చూపులు భ్రమించాయి. ఒక్కక్షణం దిగ్భ్రాంతి చెంది, సీతమ్మ ఒకచోట ఉండగా రాముడు మరొక చోట చూస్తున్నాడు. అది కనిపెట్టిన జనకుడు "ఇదిగో" (ఇయం) అంటూ రామునికి చూపిస్తున్నాడు.

అంతేగాదు. "ఇయం" ఇదిగో. రామా నీవే గొప్ప సుందరుడివి అనుకోకు, ఇదిగో మాసీత కూడా నీలాగ సౌందర్యము కలది.

"ఇయం", ఇదిగో అని - ఆ తరువాత 'సీతా' అన్నాడు. ఈమె సీత. అనగా నాగేటి చాలులో పుట్టింది. కనుక అయోనిజ. నీవు యోనిజుడవు. కానీ మా అమ్మాయి అయోనిజ. నీకన్నా ఒక విధంగా - ఏమో, నే చెప్పనుగాని, నీవే ఊహించుకో" అంటున్నాడు జనకుడు.

సీత రాముని దృష్టిని భ్రమింపచేసే సౌందర్యము గలది. పైగా గొప్ప జననము, సౌందర్యము కలది. "ఇయం సీతా" ఇదిగోసీత. భూమినుండి పుట్టింది గనుక తల్లిలేని బిడ్డ. ఎక్కువ ప్రేమతో చూసుకో. ఇకమీదట ఆమెకు తల్లిదండ్రి అంతానీవే అనికూడా



అర్థము. 'మాతరమంగనాః' ఆడపిల్లలకు తల్లి పోలిక లేదా తల్లిచాలు వస్తుందంటారు. సీత భూమినుండి పుట్టింది. కనుక భూదేవిలాగ సహనం కలది అనిభావము. ఈ విషయాలు చెప్పి ఆ తరువాత 'మమసుతా' అంటున్నాడు జనకమహర్షి.

'మమసుతా' - సీత నాకుమార్తె. తనవంశమును గూర్చి వివరించే సమయాన "కులజాతేన" సత్కులము అని తన వంశగౌరవమును జనకుడు వివరించాడు. నాకుమార్తె యని చెప్పి ఆమెయొక్క సత్ప్రవర్తనమును కీర్తించాడు.

"మమసుతా" ఈమె నా కుమార్తె. నేను విరాగిని. దేనియందు ఆసక్తి లేనివాడను. అట్టివాని కుమార్తె గనుక నీవే సర్వమై ఆమెను రక్షించాలి అని జనకుని భావము.

"సహధర్మ చరీ తవ" ఆమె నీ సహధర్మచారిణి అంటున్నాడు జనకుడు. నీతో కలిసి ధర్మమును ఆచరిస్తుంది అని అర్థము.

వివాహ మనేది ప్రధానంగా ధర్మాచరణ కొరకే నియమింపబడింది. అర్థకామాలు అముఖ్యమైనవి. అందుచేతనే భార్యను ధర్మపత్ని అంటారు. కామపత్ని అనరు.

'కామరాజు' అనేపేరు మగవాళ్ళలో నేను చూచాను గాని, 'కామరాణి' అనే పేరు స్త్రీలలో ఎక్కడా ఇప్పటికి వినలేదు. బహుశ రాబోయే రోజుల్లో వస్తే ఆశ్చర్యపడ నవసరంలేదు. పేరుకు ముందు 'కలి' తగిలించి ఊరుకోవడమే.

ధర్మరహితమైన కామంగాని, అర్థంగాని, భోగంగాని మనిషికి వినాశాన్ని కల్గిస్తాయి.

వరుడు వధువుతండ్రికి ఒకమాట చెబుతాడు.

**'ధర్మప్రజా సంపత్యర్థం స్త్రియ ముద్వహే'**

"ధర్మమును ఆచరించుటకు సత్సంతానమును పొందుటకు మాత్రము నేను పరిణయము చేసికోదలచాను".

అలాగే కన్యాదాత కూడా వరునితో ఒక వాక్యం పలుకుతాడు.

**'ధర్మార్థకామేషు త్వయైషా నాఽతిచరితవ్యా'**

"ధర్మ రహితమైన అర్థకామాలను నీవు ఆచరించరాదు" అని శాసనం చేసి మరీ కన్యాదానం చేస్తాడు.

పతికి ధర్మాచరణమునందు సహకరించి వర్తించేదే సతి.

**అయజ్ఞో వా ఏషః ! యోఽ పత్నీకః**

"అపత్నీకుడు యజ్ఞం చేయరాదు" అని తైత్తిరీయ బ్రాహ్మణం ప్రవచించింది.

ధర్మమునందు భర్తతో కలిసి చరించునది గనుక భార్య ధర్మపత్ని అయింది. సహధర్మచారిణి అయింది. అందుచేత 'నాపుత్రిక యైన సీత ఇదిగో' అని పలికిన జనకుడు ఈమె నీ సహధర్మచారిణి అని చెబుతున్నాడు.

అలా చెప్పి "ఏనాం ప్రతీచ్ఛ," ఈమెను అంగీకరించు లేదా స్వీకరించు అంటున్నాడు.

నీకు సహధర్మచారిణిగా చరిస్తుంది అని జనకుడు చెప్పగానే "సరే ఇవ్వండి" అని రాముడు అడుగుతాడేమోనని భావించి, "నీవే స్వీకరించు"అంటున్నాడు జనకుడు.

ఈ ప్రపంచంలో నాదనేది ఏముంది అహంకారము తప్ప. అంతా పరమాత్మ ఇచ్చిందే. పరమాత్మ ఇచ్చినదానిని తిరిగి ఆయనకు సమర్పించడంలో మనదేముంది గనుక.

ఈ భావంతో జనకుడు అలా పలుకుతున్నాడు. ఈ సీత నాగేటిచాలులో నాకు దొరికింది. ఈమె భగవంతుడు నాకు ప్రేమతో అనుగ్రహించిన ఫలం. పరమాత్మ ప్రసాదించిన ఈ కన్యను కొంతకాలం పోషించాను. ఆమె పరమాత్మకే చెందుతుంది. మధ్యలో ఇవ్వడానికి నేనెవ్వడను? ఆ అహంకారము నా కెందుకు? "ఏనాం ప్రతీచ్ఛ" "నీవే స్వీకరించు" అంటున్నాడు జనక మహారాజు.

కన్యాదానంలో దాత తన పుత్రికను పరమాత్మ కిస్తున్నట్లే భావిస్తాడు. అందుచేతనే చిన్నవాడైనా అల్లునికి కాళ్ళు కడిగి కన్యాదానం చేస్తాడు. చిన్నవాడైన అల్లునికి కాళ్ళెందుకు కడుగుతాడు? అల్లునిలో అనంతుని దర్శించుట చేతనే అలాచేస్తాడు.

"ఈమెను గ్రహించు" అని పలికిన జనకుడు 'భద్రంతే' "నీకు శుభం కలుగుగాక!" అంటున్నాడు.

అందమైన వస్త్రాలు, ఆభరణాలు ధరించిన పిల్లలకు దిష్టి తగలకుండా పెద్దలు దిష్టితీస్తూ ఉంటారు. అమంగళం ప్రతిహత మగుగాక! అనెడి సత్సంకల్పమే దిష్టి వెనుక దాగియున్న భావము.

ఇక్కడ కూడా సౌందర్యరాశి, అపరంజి బొమ్మ, సుగుణాల కుప్ప, అతిలోక సుందరి అయిన సీతమ్మ ప్రక్కన ఉండుటచేత రామునికి దిష్టి తగులునేమో యని భావించి "నీకు మంగళమగుగాక!" అని ఆశీర్వదిస్తున్నాడు.

**రక్షబెట్టరే దొరకు రక్షబెట్టరే**
**వక్షస్థలమున వెలయు లక్ష్మీ రమణునికి సాయ ॥రక్ష॥**
**సీతాకరమును బట్టి చెలగిన దొరకు ॥రక్ష॥**

అని పాణిగ్రహణము చేసిన రామునకు దిష్టి తగలకుండా రక్షబెట్టించాడు త్యాగరాజస్వామి.

చివరగా పాణిగ్రహణం చేయమంటున్నాడు. "నీహస్తముతో ఆమె హస్తమును పట్టుకో" అంటున్నాడు.

"పాణిగ్రహణం" చేసే సమయంలో వివాహ మండపము వద్ద వరుడు ఒక మంత్రం చెబుతాడు.

**గృహ్ణామి తే సుప్రజాస్త్వాయ హస్తం**
**భగో అర్యమా సవితా పురంధి ర్మహ్యం**
**త్వా అదుః గార్హపత్యాయ దేవాః**

"ఓ శుభకరీ! చక్కని సంతానమును పొందుటకే నేను నీ హస్తమును గ్రహించుచున్నాను. భగుడు, అర్యముడు, సవిత మొదలగు దేవతలు నిన్ను నాకు ప్రసాదించారు. గృహస్థాశ్రమ ధర్మాలను కలిసిఆచరించడం కొరకే వారు అనుగ్రహించారు."



కనుక పాణిగ్రహణంలో ధర్మాచరణమే ప్రధాన విషయముగా హిందూ వివాహవైభవము తెలుపు చున్నది.

ఈ విధంగా పలికి మహర్షియైన జనకుడు సీతను రామునికి అప్పగించాడు.

జనకుడు చెప్పిన పై విషయము రాముని ఉద్దేశించి పలికిందైనా నిజానికి అది సీతమ్మకు చేసిన ఉపదేశమే. భర్త వద్ద చరించవలసిన ధర్మమును తెలుపడం జరిగింది.

మరి సీతమ్మకే చెప్పవచ్చుగదా? రాముడి కెందుకు చెప్పాలి?

సీతమ్మకు చెప్పలేదు. అవని సుతయైన సీత ధర్మజ్ఞురాలు. ఒకరిచేత చెప్పించుకోవలసిన అవసరంలేదు. ఎలా చెప్పాలో తండ్రియైన జనకుడికి కూడా తెలిసిరాలేదు. రాముడికి చెబుతున్నట్లుగా ప్రస్తావించి పరోక్షంగా సీతమ్మకు చెప్పాడు.

వాస్తవం చెప్పాలంటే జనకుడు చెప్పిన ఆ శ్లోకం వారిద్దరికీ సంబంధించింది కాదు.

జనకుడు సీతమ్మకే తండ్రికాడు. స్త్రీలోకానికే ఆయన జనకుడు. కనుక పవిత్ర భారతావనిలో ఆవిర్భవించిన నారీలోకానికి ఆయన ఈ సందేశాన్నిచ్చాడు. అందుచేతనే "ఇయం సీతా మమసుతా" అనే ఈ శ్లోకము చాలాచోట్ల వివాహ మండపాలలో వినిపిస్తూ ఉంటుంది.

"పాణిగ్రహణం" జరిగింది. ఈ మండపమున అందరి ఎదుట వారి చేతులు కలిశాయి. ఒకటయ్యాయి. ధర్మ నిర్వహణమునందు కూడా ఆచేతులు అలా కలిసే పనిచేయాలి.

"అమ్మా! జానకీ! అతడు పతి; నీవు పత్నివి. అతడు రాజయితే నీవు రాణివి. అతడు వనవాసి అయితే నీవు వనవాసినివి" అనేది ఆంతర్యబోధ. కనుకనే

**"ఛాయే వానుగతా సదా"**

"ఆమె ఎప్పుడూ నిన్ను ఛాయలా వెంబడిస్తుంది" అంటాడు జనకుడు.

అయోధ్యకాండలో రాముడు అరణ్యవాసము వెళ్ళునపుడు సీతమ్మ తానుకూడా అనుసరిస్తానని పట్టు పట్టుటకు, రాముడు అంగీకరించుటకు కూడా జనకుడు వివాహ మండపమున పలికిన **"ఛాయే వానుగతా సదా"** అనెడి వాక్యమే ఆధారము. ఆలంబనము.

ఆత్మబంధువులారా! ఈ భావగర్భితమైన శ్లోకాన్ని మనసులో అవధరించండి. అయోధ్యకాండలో అనువైన సందర్భములో మళ్ళీ ప్రస్తావిస్తాను.

జనకమహారాజు మంత్రపూతమైన జలమును విడిచి రామునికి సీతను ఇచ్చిన తరువాత

"లక్ష్మణా! ఇదిగో ఊర్మిళ. పాణిగ్రహణము చెయ్యి."

"భరతా! మాండవిని పాణిగ్రహణము చెయ్యి."

"శత్రుఘ్నుడా! శ్రుతకీర్తిని పాణిగ్రహణము చెయ్యి" అన్నాడు. జనకుని వచనముల నాలకించి, వసిష్ఠుని అనుమతితో నలుగురు రాజకుమారులు నలుగురు కన్యల హస్తములను పట్టుకున్నారు.



భార్యాసమేతులైన దశరథ పుత్రులు అగ్ని హోత్రానికి, జనకునికీ, ఋషులకూ ప్రదక్షిణ నమస్కారాలు చేశారు. నలుగురు రాజకుమారులు నలుగురు కన్యల హస్తములను పట్టుకోగానే గగనము నుండి దివ్యమైన సుమవృష్టి కురిసింది. రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల వివాహాలు వాల్మీకి రామాయణం ప్రకారం ఈవిధంగా జరిగాయి.

## నవ్వులు - పువ్వులు

తులసీదాస్, ఏక్‌నాథ్ అనేక విశేషాంశాలను చేర్చి వర్ణించారు.

కళ్యాణ మండపమున జానకి సర్వాలంకార భూషితయై శోభిస్తూ ఉంది. మిశ్రమ భావాలతో ఆమె మనసు డోలాయమానంగా ఉంది.

రాముని చూడాలంటే సిగ్గుగా ఉంది ఆ మీనాక్షికి. కానీ రాముని ఎప్పుడు చూద్దామా అనే అభిలాషతో ఊగిపోతూవుంది ఆ చకోరాక్షి.

ఈమె మానసిక స్థితిని గ్రహించిన చెలికత్తెలు ఒక పుష్పమాలను తెచ్చి ఆమెకు అందించారు. రామునికి వేయమని సైగ చేశారు. ఈ విధంగానైనా రాముని చూడాలనే కోరిక జానకికి ఫలిస్తుంది అని వారి ఉబలాటం, హడావుడి.

సీతమ్మ పూలమాలను గ్రహించింది. రెండు చేతులతో పట్టుకుంది. రాముడు శిరము వంచి నిలబడ్డాడు. సీతమ్మ వేయలేదు. రెండు చేతులతో కొంతవరకు పైకెత్తి, రామునికి వేయడానికి ఎందుకు సంకోచిస్తుందో ఎవరికీ అర్థంగాదు.

ఇలా సీతమ్మ ఆలస్యం చేయడం ఏమిటా అని మహాత్ములు ఆలోచించారు. అనేకమైన ఆసక్తికర విషయాలు, విచిత్రాలు బయటపడ్డాయి. చదవండి.

1. సీతమ్మ మాలను వేయకుండా పట్టుకొని నిలబడి ఉండగా, శ్రీరాముడు తన ఆంతర్యంలో సీతమ్మను ప్రశ్నిస్తాడట.



**రాముడు:-** జానకీ! నామెడలో మాలవేయడానికి ఎందుకింత ఆలస్యము చేస్తున్నావు?

**సీత:-** (మనసులోనే) స్వామీ! శివధనుస్సును విరిచేటప్పుడు మీరెంత ఆలస్యం చేశారు? నన్ను ఎంత ఆందోళనకు గురిచేశారు? దానికి మారుగా నేను ఇప్పుడు ఆలస్యం చేస్తున్నాను.

**రాముడు :-** సీతా! నాకన్నా నీవే ఎక్కువ ఆలస్యం చేస్తున్నావు. నేను ఇంత ఆలస్యం చేయలేదు.

**సీత:-** నాథా! విరచడం తేలికే. కూర్చడమే కష్టం. మీరు శివధనుస్సును విరిచారు. నేను పూలను దారాలతో గుచ్చి మాలగా తీర్చాను. ఆలస్యమవుతుంది మరి!

2. సీతమ్మ పుష్పమాలను రాముని మెడలో అలంకరించాలని చేతులు పైకి ఎత్తుతూ ఉంది. ఈలోగా జానకి హస్తకంకణము నందలి మణులలో రాముని ప్రతిబింబం కనిపించిందట. రాముని దివ్య ముఖారవిందమును దర్శిస్తూ, చేయి కదిపితే ఆ కమనీయ రూపము అదృశ్యమవుతుందేమోనని అలా మణులలోని రాముని ప్రతిబింబమును చూస్తూ ఉండిపోయిందట.

3. **రాముడు:-** (మనసులో) జానకీ! తొందరగా నామెడలో పూల మాల నలంకరించు. శివ ధనుస్సును విరిచిన రాముడు తలవంచుకొని నిలబడియున్నాడు అని రాజులు నావైపు అవహేళనగా చూస్తున్నారు.

**సీత:-** స్వామీ ! అనన్యసాధ్యమైన శివధనుస్సును ఎక్కుపెట్టినను మీరు తలవంచి నిలబడ్డారు. అహంకారులైన ఈ భూపతులు ఆ విల్లును కదల్చలేక పోయినా తలలెత్తుకొని విర్రవీగు చున్నారు. అహంకారులైన వారికి, నిరహంకారులై, వినమ్రులైన మీకు గల వ్యత్యాసమును అందరూ గ్రహించాలని మాల వేయుటకు నేను ఆలస్యం చేస్తున్నాను.

4. **రాముడు :-** (మనసులో) జానకీ! నేను మరీ తలవంచితే బాగుండదు. కానీ మరి. తొందరగా పుష్పహారముతో నా కంఠము నలంకరించు.

**సీత:-** ప్రభూ! మీరు తల బాగావంచనిదే నేను మాలను వేయను. నేను భక్తి, మీరు జ్ఞానము. భక్తిముందు జ్ఞానము తలవంచక తప్పదు.

5. రాముడు పొడుగరి. రాముని కంఠం సీతమ్మకు అందడంలేదు. పూలమాల ఎలావెయ్యాలో అర్థం కాలేదు.

అంతకన్నా తలవంచుట రామునికి ఇష్టంలేదు. రాముడేమో అంతకన్నా తగ్గడు. సీతమ్మ ఏమో అంతకన్నా పెరగలేదు.

ఈ సమస్యను పరిష్కరించే నెపంతో రాముడు లక్ష్మణుని వైపు చూచి నేత్రాలతో సైగచేశాడు.

రాముని సైగను గ్రహించిన లక్ష్మణుడు కాదన్నట్లు బదులు సైగచేశాడు.

అన్నదమ్ములిద్దరు ఇలా కళ్ళతో సైగ చేసుకోవడం చూచిన విశ్వామిత్రమహర్షి అదేమిటని లక్ష్మణుని అడిగాడు.

"గురుదేవా! నేను ఆదిశేషుడను గదా! నా శిరముతో భూమిని మోస్తున్నాను గదా! మా వదిన పాదముల క్రింద ఉన్న భూమిని కాస్త పైకి ఎత్తితే ఆమె మాల వేయగలదట. అలా చేయమని మా అన్న సైగ చేస్తున్నాడు.

"కానీ నేను భూమిని పైకి ఎత్తితే భూమంతా పైకి లేస్తుందిగాని ఒకప్రక్కే లేవడం సాధ్యమయ్యే పని కాదని చెబుతూ నేను రాముని కోర్కెను తిరస్కరించాను. అదే మాసైగలలోని ఆంతర్యం" అన్నాడు లక్ష్మణుడు.

"లక్ష్మణా! మరి దీనికి ఏమిటి పరిష్కారం? రాముడు ఎత్తు తగ్గడు. సీతమ్మ పెరగదు. మరి మాల వేసేదెట్లాగయ్యా?" అన్నాడు విశ్వామిత్రుడు.

"గురుదేవా! మీరు ఆజ్ఞ ఇస్తే నేను ఏదో విధంగా ఈ సమస్యను పరిష్కరిస్తాను" అన్నాడు లక్ష్మణుడు.

"అలాగే" అన్నాడు విశ్వామిత్రుడు.

రామ లక్ష్మణులు అలాగే ఉన్నారు. లక్ష్మణుడు ఒక్కమాటున లేచి తొందరగా వెళ్ళి రాముని పాదాలపై పడ్డాడు. రాముడు ఆశ్చర్యంతో వంగి లక్ష్మణుని లేపబోయాడు. ఇదే అదునుగా భావించి వంగిన రాముని మెడలో సీతమ్మ పూలమాల వేసేసింది.

6. **రాముడు** :- లక్ష్మణా! ఆగంతుకంగా వచ్చి, అనవసరంగా సమయాసమయాలు పాటించకుండా కాళ్ళమీద పడ్డావు. నీ కారణంగా సీత ముందు నేను తలవంచాల్సి వచ్చింది.

**లక్ష్మణుడు** :- ప్రభూ! భక్తిముందు భగవంతుడు తలవంచక తప్పదు. వంచాలి. అలా కానిచో, భక్తి నెవరు చేస్తారు? నేచేసింది అందరికీ మంచిదే.

ఈ విధంగా రాముని మెడను సీతమ్మ పూలమాలతో అలంకరించింది.

మరికొందరు చెలికత్తెలు సువర్ణ పాత్రలతో గంగోదకమును తెచ్చి శ్రీరాముని చరణములను ఆశ్రయించమని చెప్పారు.

కళ్యాణమును వీక్షించుచున్న వారి దృష్టంతయూ రాముని పాదాలపై బడింది. శ్రీరాముని పవిత్ర పాదములను ధ్యానించినా, స్పృశించినా, దర్శించినా సర్వపాపాలు ప్రక్షాళన మవుతాయి. అట్టి చరణ కమలములను గంగోదకముతో జానకి అర్చించబోతూ ఉంది. ఈమె భాగ్యమే భాగ్యము అని కొందరు భావిస్తున్నారు.

ఆహా! జానకి ఎంత అదృష్టవంతురాలు! ఏ చరణ పంకజముల నుండి గంగాదేవి ఆవిర్భవించిందో, ఏ పాదపద్మ పరాగము సోకి మునిపత్ని పాపవిముక్తిని, శాపవిముక్తిని పొందిందో, అట్టి చరణ కమలములను జానకి కడగబోతూ ఉంది అని మరికొందరు తమలో తాము భాషించుకుంటున్నారు.

ఇలా అందరూ భావిస్తున్నారే గాని సీతమాత్రము రాముని పాదములు కడగడంలేదు. పాత్రలను పట్టుకొని సఖులు ప్రక్కన నిలబడే ఉన్నారు. మాల వేయడానికి సందేహించినట్లే పాదములను అర్చించుటకు కూడా సీతమ్మ సందేహిస్తూ ఉంది. ఇక్కడ ఆమెకు రెండు సంశయాలు మనసులో నిలిచాయి.



1. ఇతని చరణధూళి సోకి సుందరరూపమును ధరించిన అహల్య కొన్ని క్షణాల వ్యవధిలో ఇతనికి దూరమైంది కదా! నేను రామునికి దూరమై జీవించలేను. కనుక నేను ఆ చరణములకు దగ్గరగా పోతే ఎలా?

2. రాముని పాదస్పర్శచేత శిల అహల్యగా మారింది. సీతమ్మ కరకమలములకు రత్నములు పొదిగిన స్వర్ణకంకణము లున్నాయి. ఆయన పాదధూళిసోకి రాళ్ళే స్త్రీలుగా మారినపుడు, తన హస్తకంకణములలోని రత్నములు స్త్రీలుగా మారితే ఎలా? అలాంటి సమస్యలు తనకు రాకూడదు అని ఆలోచిస్తూ ఉందట.

ఈలోగా ఒక చెలికత్తె చెవిలో రహస్యంగా చెప్పిందట. "ఈ బాధంతా ఆయన చరణధూళి వల్లనే గదా! అమ్మా! జానకీ! గంగోదకంతో పాదాలు కడిగేస్తే, ఆ తరువాత ధూళి ఉండదు. మనకు సమస్యలూ ఉండవు" అంది.

వెంటనే జానకి రాముని అంఘ్రియుగ్మములను అర్చించింది.

వివాహమైన తరువాత వధూవరుల చుట్టూ జనకపురి మహిళలు కూర్చుని పాటలు పాడి వినోదమును కల్పించారు.

**రాజంటే రాజు - అయోధ్యరాజు**
**ముగ్గురు భార్యల ముదుసలి రాజు ॥రాజంటే॥**
**సంపదలున్నా సంతానము సున్న**
**పాయసమును పంచి పుత్రులను కన్నాడు ॥రాజంటే॥**

అని చమత్కరిస్తూ ఉల్లాసంగా వినోదాన్ని సృష్టించారు.

ఎందుకో ఈ వినోదం లక్ష్మణునికి నచ్చలేదు. అయోధ్యలో పాయసం తాగి బిడ్డల్ని కంటారు అనడం చాలా బాధగా తోచింది. వెంటనే ప్రతి చమత్కృతితో లక్ష్మణుడు ఒక పాట పాడాడు.

**సంతతికోసం అయోధ్యలో**
**పానం చేశారు పాయసం**
**కనడం కూడా కష్టమేనని**
**మిథిలలో మాకు తెలిసిందిలే**
**మహినుండి మహిళలు పుడతారని ॥సం॥**

ఈ విధంగా, వినోదాలతో, ఆనందాలతో రాజభవనం కళకళలాడుతోంది. కొందరు చెలికత్తెలు రామునికి ఎదురుగా కూర్చునియున్న సీతమ్మ చేతిలో ఏదో ఉంచి చేతిని ముడిచారు.

"సీతమ్మ పిడికిటిలో ఉన్నది ఒక గవ్వా? లేక రెండు గవ్వలా?" అని రాముని ప్రశ్నించారు జానకీ సఖులు.

"ఒక్కటే" అన్నాడు రాముడు.

"ఇంతవరకు ఒంటరిగానే యున్నారు. ఇప్పుడు ఇద్దరైకూడా ఒక్కటే అంటున్నారే?" అని రాముని మాటను చమత్కరించారు చెలికత్తెలు.

"మా అన్నగారు చెప్పింది నిజము. వివాహమైన తరువాత దంపతులు ఒక్కటై జీవిస్తారు," అన్నాడు లక్ష్మణుడు.

ఒకే బాణము. ఒకే మాట. ఒకే పత్ని. ఇది రాముని జీవితము.

**ఒకమాట ఒకబాణము ఒకపత్నీ వ్రతుడే మనసా ॥ఒక॥**

**ఒక చిత్తము గలవాడే ఒకనాడును మరవక వే ॥ఒక॥**

అని ఏకరూపుడైన రాముని వైభవమును ఎలుగెత్తి త్యాగరాజస్వామి గానం చేస్తూ రాముడికి వేరొకడు సాటిలేడని చాటుతున్నాడు. రెండుమాటలు రామునికి తెలియవు.రాముడు అద్వైతమూర్తి. ద్వైతమును రాముడు అంగీకరించడు.

'**రామో ద్విర్నాభి భాషతే**' "రాముడు రెండుమాటలు మాట్లాడడు" అని అయోధ్యాకాండలో రాముడే కైకేయితో అంటాడు.

**తరీహో వేదాంతి చా ఇత్యర్థ్**

**ద్వైత కల్పిత్ అద్వైతత్వే**

**యాపరీ సుఖే శ్రీరామసీతా**

**దోనీ నాందతీ ఏకాత్మతా**

"ద్వైతం కల్పితం. అద్వైతం సత్యం. సీతారాములు ఏకాత్మగా సంసారంచేస్తారు" అంటాడు భావార్థరామాయణంలో సంత్ ఏకనాథ్ మహరాజ్.

వివాహ సమయాన కన్యను స్వీకరించమని జనకుడు పలికినపుడు "ప్రతిగృహ్ణామి" అని పలికి రాముడు స్వీకరిస్తాడు.

లక్ష్మణుని వంతు రాగానే "ప్రతిగృహ్ణామి" అనుటకు లక్ష్మణుడు నిరాకరిస్తాడు. "మేము అయోధ్య వాసులం. క్షత్రియులం. దానాలు ఇవ్వడం మాకు తెలుసుగాని, పుచ్చుకోవడం తెలియదు" అంటాడు లక్ష్మణుడు.

"మరి మీపెద్దన్నగారు అన్నారు కదా!" అంటాడు పురోహితుడు.

"ఏమో! ఆయన అంటే అని ఉండవచ్చు. నేను మాత్రం అనను" అని భీష్మించుకుంటాడు లక్ష్మణుడు.

అప్పుడు విశ్వామిత్రుడు వచ్చి, "అలా పలకాలి" అంటాడు లక్ష్మణునితో. వెంటనే లక్ష్మణుడు "ప్రతిగృహ్ణామి" అంటాడు. తనకు ఇష్టం లేకున్నను గురువు చెప్పిన దానిని సంతోషంతో ఆచరించాలి అంటాడు లక్ష్మణుడు.

నవ్వులు పువ్వులై రాజభవనమంతా విరజిమ్మ బడగా, ఆనంద సౌరభము మిథిల నంతా అలుముకున్నది.

అందరూ ఆనంద హృదయులయ్యారు.

తృప్తితో అందరూ ఆరాత్రి నిద్రించారు.



## విశ్వామిత్రునికి వీడ్కోలు

తెల్లవారింది. ఆహ్నికములు పూర్తయ్యాయి. విశ్వామిత్రమహర్షి అరుదెంచాడు. రాజకుమారులను ఆశీర్వదించాడు. హిమవత్పర్వతానికి వెళ్ళడానికి సిద్ధ పడ్డాడు.

జనకుడు విశ్వామిత్రుని సమీపించాడు. మహర్షి చరణములపై బడి నమస్కరించాడు. ఆయన చరణధూళిని శిరముపై ధరించాడు.

**సును మునీ న బర్ దరసన్ తోరే**

**అగము న కఛు ప్రతీతి మన్ మోరె ॥**

"హే మునిపుంగవా! మీ శుభదర్శనము వలన నాకు సర్వము సుగమము అని నా విశ్వాసము" అని పలికి మాట్లాడలేక మౌనం ధరించాడు జనకుడు.

దశరథుడు మహర్షిని సమీపించి కన్నీళ్ళతో నిలబడ్డాడు. "మహామునీ! మీరు మా వంశానికి చేసినమేలు మరువలేనిది. మరపురానిది. నాకు ప్రాణతుల్యమైన నా రామునికి మీరు గూర్చిన శుభములు అప్రమేయాలు.

**నాథ సకల సంపదా తుమ్హారీ**

**మై సేవకు సమేత సుతనారీ !**

"దేవా! నా ఐశ్వర్యమంతయూ నీ ప్రసాదమే. నేను, నా బిడ్డలు, నాభార్యలు అందరము నీ సేవకులం" అని పలికి గొంతు మూగబోగా వణుకుతున్న పెదవులను బిగించి మూసి, తలవంచినిలబడ్డాడు దశరథుడు.

తన కుమారుల వివాహ విషయాన్ని మంత్రులతో, మహర్షులతో ప్రస్తావించేటప్పుడు విశ్వామిత్రుడు వచ్చాడు. అదేదో ఉపద్రవంలా గోచరించినా వసిష్ఠుడు చెప్పినట్లు కళ్యాణ ప్రదమైంది. రాముని ఖ్యాతి విశ్వవ్యాప్తమైంది. నలుగురు కుమారులకీ ఒకేచోట పెండ్లి కుదిరింది. జరిగింది. ఇదంతా విశ్వామిత్రుని కృపేగదా! అనే ఆలోచన మనసులో కదలగానే దశరథునికి కన్నీళ్ళు ఆగడంలేదు.

అందరూ చేతులు జోడించి నమస్కరిస్తూ ఉండగా ప్రశాంతంగా ప్రవహించు జీవనదిలా కదలి పోయాడు హిమవత్పర్వతానికి విశ్వామిత్రమహర్షి.

ఆత్మబంధువులారా!

విశ్వకళ్యాణానికి కృషి చేసిన విమల చరితుడు విశ్వామిత్రమహర్షి ఇక మనకు రామాయణంలో కనిపించడు.

మహాతపస్వి ఇక్కడ తెరమరుగయ్యాడు. కనుమరుగయ్యాడు.

ఉన్నది ఒక్కకాండలోనే. తానంటూ లేకపోయినా, అన్ని కాండలలో ఉన్నదంతా ఆయన ప్రభావమే. ఏవీధిలో ఊరేగినా, విగ్రహం శిల్పిచేసిందే. రామాయణ మనే అసమాన శిల్పసుందరి వెనుక అదృశ్య శిల్పి విశ్వామిత్రుడే.

యాగసంరక్షణ కొరకు రామలక్ష్మణులను దశరథమహారాజు నుండి తీసికొని వచ్చిన విశ్వామిత్రుడు మిథిలానగరంలో మళ్ళీ దశరథునికి తిరిగి అప్పగించాడు.

తీసికోవడం తేలికైన పని. తిరిగి అప్పగించడంలోనే వ్యక్తి ఔన్నత్యం, ఔదార్యం చోటు చేసికొని ఉంటాయి.

బాలరాముని గ్రహించాడు విశ్వామిత్రుడు. కొండంత రాముణ్ణి చేసి దశరథునికి అందించాడు.

అస్త్రశస్త్రాలు ప్రసాదించాడు. జీవితపాఠాలు నేర్పాడు. యాగ సంరక్షణము ద్వారా యావద్విశ్వానికి రాముని పరిచయం చేశాడు. అహల్య వృత్తాంతము ద్వారా రాముని పతితపావనుడుగా ప్రపంచానికి చాటాడు. మిథిలకు తీసికొని వెళ్ళి భూపతులనోరు మూయించాడు. రాముని వీర్యతేజమును ప్రకటింప జేశాడు. లోకకళ్యాణమును ఆవిష్కరిస్తూ సీతారాములను ఏకం చేశాడు.

అన్నీ చేశాడు. ఆశలులేనివాడు.

ఎన్ని కఠోర తపస్సులు! ఎన్ని గెలుపులు! ఎన్ని ఓటమిలు. ఎన్ని సంపదలు? ఎన్ని ఆపదలు? ఎన్ని సన్మానాలు? ఎన్ని అవమానాలు?

ఎన్ని విచిత్రాలు! విడ్డూరాలు! విన్యాసాలు! వినోదాలు! విషాదాలు?

ఇవన్నీ కలబోస్తేనే విశ్వామిత్రుడు.

సమిష్టికి కృషిచేసిన మహర్షిని

కోపిష్టి అని నిందించినా

పాపిష్టి అని దూషించినా

తిరిగి ప్రశ్నించని తపోధనుడు.

మార్గమును విస్మరించని త్యాగమయుడు.

అన్నీ మహత్యాలే. ఆయనదేమో ఋషిత్వమే.

**మహత్వం, ఋషిత్వం ఐక్యమై మహర్షిత్వం సిద్ధించింది మహిలో.**

మహిలో ఎన్నున్నా,

తన మనసులో ఏమీలేవు.

తన మహిమంతా ప్రపంచానికి,

తానేమో ఒంటరిగా హిమాలయానికి.

శాంతి తీరాలలో ప్రపంచాన్ని చేర్చి

దూరతీరాలను వెతుక్కొంటూ వెళ్ళాడు.

విశ్వానికి మిత్రత్వాన్ని నేర్పిన మహర్షి.

విజ్ఞాన మిత్రోదయాన్ని దర్శించాలని వెళ్ళిన తపస్వి!

మాటలు మూగబోతున్న ఈ సమయాన మౌనమే ఆయనకి మన భక్త్యంజలి.

## జై జై విశ్వామిత్ర మహర్షికీ !



# ప్రేమ వీడ్కోలు

అయోధ్యకు బయలుదేరుటకు జనకుని వద్ద సెలవు పుచ్చుకున్నాడు దశరథుడు. ప్రయాణానికి అందరూ సిద్ధమవుతున్నారు. ఈ సన్నివేశమును ముక్తసరిగ ప్రస్తావించి ముగించింది వాల్మీకి రామాయణం. రామచరిత మానసం బహు రమ్యంగా ప్రవచించింది.

అంతఃపురమంతా స్త్రీలతో నిండిపోయింది. నలుగురు రాజకుమార్తెలను తల్లులు ఆలింగనం చేసికొని అశ్రువులు రాల్చుతున్నారు. ఈలోగా రామలక్ష్మణాదులు అంతఃపురములోకి అరుదెంచారు.

"తల్లులారా! మా తండ్రిగారు అయోధ్యకు పయనించుటకు ఉద్యుక్తులవుతున్నారు. వారి ఆజ్ఞచే మీ నుండి సెలవు పుచ్చుకొనుటకు మేము వచ్చాము. నన్నుకరుణించండి. నేను ఎల్లప్పుడు మీ బిడ్డనే అని భావించండి. నాపై దయచూపండి" అని రాముడు రాణివాసపు స్త్రీలకు నమస్కరించాడు.

రాణుల హృదయాలు ద్రవించాయి. వారి నేత్రాలు చెమ్మగిల్లాయి.

రాముడు నిష్క్రమించాడు.

రాణులు సీతమ్మను సమీపించి దుఃఖిస్తున్నారు. ఇసుకలో పడిన నీరు ఇంకిపోవునట్లు, వారి ప్రేమలో మాటలు అణగిపోయాయి. మాటిమాటికి వారు సీతమ్మను గాఢాలింగనం చేసుకుంటున్నారు.

**బహురి బహురి భేటహిం మహతారీ**
**కహహిం బిరంచి రచీ కత నారీ ॥**

మాటిమాటికి ఆలింగనం చేసికొంటూ "ఆడపిల్లల్ని బ్రహ్మదేవుడు ఎందుకు సృష్టిస్తాడో కదా?" అని వ్యథ చెందారు.

"ఆడవారు ఆడవారే కదా!" అంటూ ఉంటారు ఇప్పుడు కూడా. ఆడవారు అంటే అక్కడివారు అని అర్థము. ఇక్కడ అనగా అమ్మగారింట్లో ఎంతకాలముండినా ఏదో ఒకనాడు అక్కడికి వెళ్ళి భర్త దగ్గర సుఖించవలసినవారే! అందుచేత ఆడవారు ఆడ-వారే గాని ఇక్కడివారెలా అవుతారు? అని అంటుంటారు.

తల్లులు రాణివాసంలో అలా దుఃఖిస్తున్నారు.

సీతమ్మ వెళ్తున్నదన్న వార్త తెలిసి లేగదూడలు తల్లివద్దకు పరిగెత్తునట్లు చెలికత్తెలు సీతమ్మ వద్దకు పరుగెత్తుకొని వచ్చారు.

బంగారు పంజరముల నుండి చిలుకలు, గోరువంకలు "మా అమ్మ వెళ్తూ వుందా? మా సీతమ్మ వెళ్తూవుందా? మమ్మల్ని చేరదీసింది ఇందుకా?" అని ఏడ్వసాగాయి. వాటి పలుకులకు అందరి గుండెలు జారిపోతున్నాయి.

సీతమ్మ కదిలింది. జనకుని సమీపించింది.

జనకుడు పరమవైరాగ్య పురుషుడు. అయినా సీతమ్మ నిష్క్రమించే సమయాన ఆయన వైరాగ్యం లోకం పాలైంది. ఆమెను గుండెకు హత్తుకున్నాడు. కళ్ళవెంబడి నీళ్ళు కారిపోతున్నాయి.

ప్రయాణభేరి మ్రోగింది.

దేవతలు పుష్పవృష్టిని కురిపించారు. దేవ దుందుభులు మ్రోగాయి.

సీతమ్మ బంగారు పల్లకీలో కూర్చున్నది. రథాలు కదిలాయి. అశ్వములు కదిలాయి. జనకుడు తన రథంలో ఆసీనుడై వీడ్కోలిస్తూ వెంట వెళ్తున్నాడు.

"జనక మహారాజా! మీరు ఇప్పటికే చాలా దూరం వచ్చారు. ఇక విరమించడం మంచిది" అని ప్రాధేయపూర్వకంగా పలికాడు దశరథుడు.

జనకుడు రథం దిగాడు. అతని నేత్రములు ఆగకుండా వర్షిస్తున్నాయి. చేతులు జోడించి నమస్కరించాడు.

"మహారాజా! నావంటి అధముణ్ణి మీరు గౌరవించి ఎంతగానో ఆదరించారు. మీకు నేను సదా కృతజ్ఞుణ్ణి. ఏమి చెప్పాలన్నా నాకు మాటలు రావడం లేదు;" అని తలను దించుకున్నాడు జనకుడు.

దశరథుడు జనకుని కౌగిలించుకొని ఆదర వచనములను పలికాడు. పరస్పరము నమస్కారాలు సమర్పించుకున్నారు.

జనకుడు, జనకపురి వాసులు వెనుదిరిగారు.

జానకి మిథిలను వదలేటప్పుడు ఆ నేలపై మంగళాక్షతలు చల్లిందట. అందుకే ఆప్రాంతంలో ఈనాటికి కూడా పంటలు సమృద్ధిగా పండుతాయని చెప్పుకుంటారు.

అత్తవారింటికి వెళ్ళేటప్పుడు పుట్టింటివారికి శుభం కలగాలని ప్రార్థిస్తారు ఆడపడచులు. సీతమ్మ కూడా అలాగే కృతజ్ఞతా భావంతో మంగళాక్షతలు చల్లింది.

అయోధ్య పెండ్లివారి సంబరాలు ప్రయాణమై సాగుతున్నాయి. మధ్య మధ్యన విశ్రాంతి తీసుకుంటూ ప్రయాణమును సాగించారు.

మార్గంలో అక్కడక్కడ భయంకరమైన పక్షులు శబ్దము చేయసాగాయి. అది విని ఎందుకో తన మనసు కలత చెందుతున్నదని దశరథుడు వసిష్ఠునితో చెప్పాడు.

మనస్తాపము చెందనవసరంలేదన్నాడు వసిష్ఠుడు.

## పరాజితుడైన పరశురాముడు

ప్రయాణం సాగుతూ ఉంది. ఈలోగా వాతావరణం భయంకరంగా తయారవుతూ ఉంది. ఒకవైపు గాలి దుమారం రేగింది. భూమి కంపించ సాగింది. చెట్లు కూలిపోతున్నాయి.

దిక్కులలో చీకట్లు వ్యాపించాయి. పొగ రేగి సూర్యుని క్రమ్మేసింది. దిక్కులు తెలియడం లేదు.



ఈలోగా కాలాగ్ని స్వరూపంలా, క్షత్రియుల పాలిటి యముడైన పరశురాముడు ఎదురొచ్చి నిలిచాడు. భుజాన ధనుస్సు, గొడ్డలిని ధరించి, మెరుపులాంటి బాణమును చేతిలో ధరించి భయంకరంగా ముందుకు వచ్చి నిలిచాడు. ప్రళయాగ్ని లాగే సహించుటకు అశక్యంగా తెలుస్తున్నాడు. త్రిపురాసురుని చంపి వస్తున్న రుద్రుని లాగా ప్రచండంగా వెలిగి పోతున్నాడు.

పరశురాముని చూడగానే అందరూ భయభ్రాంతులకు లోనయ్యారు. పూర్వము ఒక క్షత్రియుడు తన తండ్రిని వధించాడనే కోపంతో క్షత్రియ వంశాన్నే నాశనం చేయాలని పరశురాముడు ప్రతిజ్ఞ చేశాడు. ఎందరో రాజుల్ని సొరకాయల్ని త్రెంచినట్లు నరికేశాడు.

ఆ తరువాత కోపము తగ్గి శాంతించాడు. కానీ ఈనాడు ఇతని రౌద్రాకారము చూస్తుంటే మళ్ళీ క్షత్రియ నాశనమునకు పూనుకున్నాడా? అనిపిస్తూ ఉంది అని వసిష్ఠాది మునీంద్రులు తమలోతాము చర్చించు కోసాగారు.

పరశురామునికి ఋషులు అర్ఘ్యపాద్యాదులను సమర్పించారు. ఋషుల నుండి పూజను స్వీకరించిన పరశురాముడు రాముని వైపు తిరిగి ఇలా పలికాడు.

"రామా! నీ పరాక్రమము చాలా గొప్పదని విన్నాను. శివధనుస్సును నీవు విరిచినావని కూడా విన్నాను. అది చాలా అద్భుతమైన విషయము.

"అది విని నేను నీ కొరకు ఒక విల్లు తెచ్చినాను. ఈ విల్లు శుభమైనది. దీనిని ఎక్కుపెట్టి నీ వీర్యమును ప్రకటించు. అప్పుడు నీ బాహుబలమును చూచి, ఆ తరువాత నీతో ద్వంద్వయుద్ధము చేస్తాను" అన్నాడు.

పరశురాముని మాటలు వినగానే దశరథుని ప్రాణాలు లేచిలేచి పడుతున్నాయి. ముఖంలో విషాదం అలుముకొంది. హృదయమంతా భయము నిండి పోయింది.

"అయ్యా! నీవు గొప్ప కీర్తిమంతుడవు. బ్రాహ్మణుడవు. క్షత్రియులపై కోపమును మాని శాంతిగా ఉన్నావు గదా! నీవు గొప్ప ప్రజ్ఞావంతుడవు. నా కుమారులు నూతన వరులు. వారికి అభయం ఇవ్వు.

"మహామునీ! మా అందరికీ రాముడే ప్రాణం. రామునికి ఏ ప్రమాదం వాటిల్లినా మేము జీవించలేము. మేము మరణిస్తాము" అని దశరథుడు చేతులు జోడించి పలికాడు.

పరశురాముడు దశరథుని మాటలను లెక్క చేయలేదు. "రామా! నేను మహేంద్ర పర్వతమున నివసిస్తున్నాను. నీవు గొప్పదైన శివధనుస్సును ఎక్కుపెట్టినావని విని ఇక్కడికి వచ్చాను.

"ఇదిగో ఈ విల్లును ఎక్కుపెట్టు. శరమును సంధించు. నీవు అది చేయగలిగితే నీతో నేను ద్వంద్వయుద్ధము చేస్తాను;" అన్నాడు పరశురాముడు.

రాముడు పరశురామునితో మితంగా భాషించాడు: "భార్గవా! నీ వాచరించిన కార్యములను వినియున్నాను. పితృవాక్పరిపాలకుడవని నీ మీద నాకెంతో గౌరవము.

"కానీ! నన్ను చులకనగా మాట్లాడి అవమానపరుస్తున్నావు. శక్తి లేని వానినిగ నన్ను ఊహించుకుంటున్నావు. ఇక నా పరాక్రమమును, వైభవమును ప్రదర్శిస్తాను. చూడు;" అని పలికి పరశురాముని చేతిలోని ధనుస్సును, బాణమును తీసికొని రాముడు ఎక్కుపెట్టాడు. నారిపై బాణమును సంధించాడు.



"పరశురామా! చెప్పు! ఎక్కుపెట్టిన ఈ బాణం వృథా కాకూడదు;" అని రాముడు మందహాసం చిందించాడు.

**"కోపమున భృగుసుత చాపబలమందుకొన్న బాహులను చూచే దెన్నటికో"** అని రామునిలో శోభించే వీరత్వమును దర్శించేందుకు ఉవ్విళ్ళూరాడు త్యాగరాజస్వామి.

రాముడు విల్లు ఎక్కు పెట్టగానే పరశురాముడు తేజోహీనుడయ్యాడు. "రామా! నీ పరాక్రమమును వీక్షించాను. నా గర్వం మటుమాయమైంది. నేను పరాభూతుడనయ్యాను. నీవెవరో నాకు తెలిసి పోయింది. నా తపస్సును నీకు ధారబోస్తున్నాను. నేను మహేంద్రగిరికి వెళ్తున్నాను;" అని పలికి రామునికి నమస్కరించి పరశురాముడు వెళ్ళాడు.

అప్పుడు దిక్కులన్నీ ప్రకాశించాయి. దేవతలు, ఋషులందరు రాముని స్తుతించారు.

పరశురాముడు వెళ్ళగనే రాముడు ఆధనుర్బాణములను అప్రమేయ శక్తివంతుడైన వరుణునికి ఇచ్చాడు.

దశరథుడు శ్రీరాముని ఆలింగనం చేసికొని ముద్దాడాడు. పరశురాముడు నిష్క్రమించగనే తన పుత్రులకు పునర్జన్మ ప్రాప్తించినట్లు భావించాడు దశరథుడు.

## నగర ప్రవేశం

దశరథుడు సపరివార సమేతంగా అయోధ్య చేరాడు. అయోధ్య చక్కగా అలంకరించబడి ఉంది. రంగురంగుల జండాలు రెపరెప లాడుతున్నాయి. ఎటు చూసినా పచ్చని మామిడి తోరణాలు కనిపిస్తున్నాయి. మంగళవాద్యాలు మిన్నుముట్టు తున్నాయి. రాజమార్గాల్లో నీళ్ళు తడిపి, పూలు చల్లారు. ప్రజలంతా రాజుకు ఆహ్వానం పలికేందుకు ఆనందంగా నిరీక్షిస్తూ ఉన్నారు.

దశరథునితోపాటు కుమారులు, కోడళ్ళు రాజభవనంలోనికి ప్రవేశించారు. దశరథుని ఆనందమును నింపుటకు ఆకాశముగాని, సముద్రముగాని సరిపోయేలా లేవు.

ఇంతవరకు తన రెండు నేత్రాలకు నలుగురు కుమారులే కనిపించేవారు. వారి నేత్రాల ద్వారానే ప్రపంచాన్ని వీక్షించేందుకు దశరథుడు అలవాటు పడ్డాడు. నలుగురు కుమారులకి ఎనిమిది నేత్రాలు గనుక ఆ ఎనిమిది నేత్రాల ద్వారా ప్రపంచాన్ని దర్శించేవాడు.

ఇప్పుడలాకాదు. నలుగురు కోడళ్ళు గూడా వచ్చారు. మొత్తము పదహారు కళ్ళు అయినాయి. ఇక్ష్వాకువంశము షోడశకళాప్రపూర్ణమై, పదహారు కళలతో శోభిస్తూ ఉందని పొంగిపోయాడు దశరథుడు.



**All happy families resemble one another; every unhappy family is unhappy in its own way** "ఒకరి భావాలను మరొకరు ప్రతిబింబించే కుటుంబాలే సంతోషంగా ఉంటాయి. ఎవరికి వారుగా చరించే కుటుంబం దానికి అదే తనదైన రీతిలో శోకమయంగా ఉంటుంది" అంటాడు టాల్‌స్టాయ్.

ఈ సందర్భములోనే దశరథమహారాజు సంతుష్టాంతరంగ చిత్తుడుగా తెలుస్తున్నాడు. పూర్ణానంద స్వరూపుడుగా కన్పిస్తున్నాడు.

అన్నీ ఉండినా, సంతానం లేదని కొంతకాలం క్లిష్టంగా గడిపాడు. పిల్లలు పుట్టి, ఆనందించే వారి యౌవన దశలో విశ్వామిత్రుడు రాముని అడిగినపుడు సంక్లిష్టంలో పడ్డాడు.

వివాహోలై ఆనందంగా తిరిగి వస్తున్నప్పుడు పరశురాముని భీభత్సాన్ని గాంచి వికల చిత్తుడయ్యాడు.

పాపం! ఈ దశలోనే పూర్ణ సంతృప్తితో కనిపిస్తున్నాడు. ఇలా ఏ విపత్తు రాకుండా ఎంతకాలం ఉంటాడో? ఏమో! ఎవరికి తెలుసు? ఏ క్షణాన ఏం జరుగుతుందో ఎవరికి తెలుసు? రేపును నేడు ఊహించలేము.

అంతఃపుర రాణులైన కౌసల్య, సుమిత్ర, కైకేయి నలుగురు కోడళ్ళను ఆప్యాయతతో ఆదరించి లోనికి తీసికొని వెళ్ళారు. వారందరు మంగళ స్నానాలు చేసి, పట్టుబట్టలు ధరించి, గృహదేవతలను పూజించారు.

ఇలా కొంతకాలం జరిగింది. నలుగురు రాజకుమారులు తండ్రికి సేవచేస్తూ ఆనందంగా జీవిస్తున్నారు.

ఒకనాడు దశరథుడు కైకేయి పుత్రుడైన భరతుని పిలిచి, "నాయనా! నీ మేనమామయైన యుధాజిత్తు నిన్ను వారి రాజ్యానికి తీసికొని పోవాలని వచ్చినాడు. నాయనా! వెళ్ళిరా! వారికి కూడా సంతోషాన్ని కల్గించు" అన్నాడు దశరథుడు.

భరతుడు తండ్రి ఆజ్ఞను పాలించాడు. తండ్రికి, అన్నకు, తల్లులకు నమస్కరించాడు. లక్ష్మణుని ఆలింగనం చేసుకున్నాడు. శత్రుఘ్నునితో గూడి బయలుదేరి వెళ్ళాడు.

భరతుడు వెళ్ళిన తరువాత రామలక్ష్మణులు తండ్రికి సేవచేయసాగారు. తండ్రి ఆజ్ఞ మేరకు నగర వాసులకు హితకరమైన కార్యాలను రాముడు చేస్తుండేవాడు.

రాముని ప్రవర్తన దశరథునికి ఎంతో ఆనందాన్ని కల్గించేది. రాముడు అయోధ్యావాసులకు ప్రాణమై మిగిలాడు.

సీతారాములు అన్యోన్య ప్రేమానురాగాలతో ఆనందంగా జీవించసాగారు. రాముడు తనను ప్రేమించిన దానికన్న సీతమ్మ రాముని ఎక్కువగా ప్రేమించేది. అలాగే సీతమ్మ తనను ప్రేమించే దానికన్నా రాముడు సీతను ఎక్కువగా ప్రేమించేవాడు.

వారిలో ఎవరి ప్రేమ గొప్పదో నిర్ణయించుట సృష్టికర్తకు కూడా సాధ్యమయ్యే పనికాదు. వారి ప్రేమను పరస్పరం పోల్చి సంతోషించాలే గాని వారి ప్రేమను పోల్చుటకు ప్రపంచంలో మరొకరు లేరు.

సీతారాములు లక్ష్మీనారాయణులుగా శోభిస్తుండగా అయోధ్యానగరము వైకుంఠమై ప్రకాశించింది.

## బాలకాండము సమాప్తము